

# చైతన్య భగవద్గీత

## అథ ద్వాదశోఽధ్యాయః - పన్నెండవ అధ్యాయము

## భక్తియోగః - భక్తియోగము

### సందర్భము - సందేహము

పూర్వాధ్యాయం విశ్వరూప సందర్శన యోగము లోని **మత్కర్మకృత్** అనే చరమ శ్లోకం పన్నెండవ అధ్యాయమైన భక్తి యోగానికి బీజ శ్లోక మైంది. ఈ శ్లోకం లోని మచ్ఛబ్దార్థము సూచించేది సగుణ బ్రహ్మమునా లేక నిర్గుణ బ్రహ్మమునా? అనేది సందేహము. అసలు ఈ సందేహము ఎందు కొచ్చింది? ఎక్కడ నుండి పుట్టింది?

***తేషాం జ్ఞానీ నిత్యయుక్తః ఏకభక్తి ర్విశిష్యతే*** - నాలుగు రకాలైన భక్తులలో జ్ఞాని శ్రేష్ఠుడు అని ఏడవ అధ్యాయంలో ప్రవచించాడు భగవంతుడు *(7 - 17)*.

***శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః*** - శ్రద్ధావంతుడై నన్నే సేవించు యోగి మిక్కిలి శ్రేష్ఠుడు అని నా అభిప్రాయము అని ఆరవ అధ్యాయంలో చెప్పడం జరిగింది *(6 - 47)*. మరి, ఈ ఇరువురిలో ఎవరు శ్రేష్ఠుడు? జ్ఞాని శ్రేష్ఠుడా? లేక యోగి శ్రేష్ఠుడా? అనేది సంశయము.

***ఉదారా స్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్*** - అందరూ శ్రేష్ఠులే అయినా జ్ఞాని మాత్రము నేనే అని నా అభిమతం అని ఏడవ అధ్యాయం లోను *(7 - 18)*, ***పురుష స్స పరః పార్థ భక్త్యా లభ్య స్త్వనన్యయా*** - అనన్యమైన భక్తి చేతనే పురుషోత్తము డైన భగవంతుడు లభ్య మవుతాడు అని ఎనిమిదవ అధ్యాయం లోను *(8 - 22)* ప్రవచించడము చేత, భక్తుడైన కర్మయోగి శ్రేష్ఠుడా? లేక ఆత్మజ్ఞాని శ్రేష్ఠుడా? అనే సందేహం సవ్యసాచిని ఆవరించింది.

అదలా ఉండగా,

విశ్వరూప సందర్శన యోగాన్ని సమాప్తం చేస్తూ, చరమ శ్లోకంలో మచ్ఛబ్దాన్ని పదే పదే ప్రయోగించి, తొమ్మిదవ అధ్యాయాన్ని మచ్ఛబ్ద ప్రయోగంతో సమాప్తం చేసినట్లే, పదకొండవ అధ్యాయాన్ని కూడా సమాప్తం చేయడం జరిగింది. ఇంతకీ ఈ మచ్ఛబ్దం సాకారాన్ని ప్రతిపాదిస్తూ ఉందా? నిరాకారాన్ని సూచిస్తూ ఉందా? అనేది పార్థుని సంశయము. అందుచేత, వ్యక్తావ్యక్తాలను ఉపాసించే వారిలో **తేషాం కే యోగ విత్తమాః** - ఎవరు యోగవిత్తములు? అని అర్జునుడు ప్రశ్నించడంతో పన్నెండవ అధ్యాయము ప్రారంభ మవుతూ ఉంది. ఈ ప్రశ్న క్రొత్తగా అనిపించినా, సందేహము మాత్రం క్రొత్తది కాదు.

### వెంటే ఉంది

యుద్ధకర్మలో ప్రవేశించడమా? యుద్ధాన్ని విరమించి సన్యసించడమా? అనే సందేహం కురుక్షేత్రంలో కాలు మోపిన క్షణం నుండి కౌంతేయుణ్ణి పట్టి పీడిస్తూనే ఉంది. ఈ సంశయాన్ని రెండవ అధ్యాయం లోనే భగవంతుడు నివారించడం జరిగింది. అయినా అర్జునుని మనస్సు కుదుట పడలేదు.

జ్ఞానము కర్మ కంటే శ్రేష్ఠ మైనపుడు, భయంకరమైన ఈ యుద్ధకర్మలో నన్నెందుకు నియోగిస్తున్నావు? అని మూడవ అధ్యాయారంభం లోనే అర్జునుడు ప్రశ్నించాడు. పైగా, విషయాన్ని కలగాపులగం చేసి, తనను

శ్రీకృష్ణుడే కలత పెడుతున్నట్లు అభియోగం కూడా మోపాడు. దీని ఫలితమే మూడవ అధ్యాయమైన కర్మ యోగము. అక్కడ కర్మయోగ, సన్యాసములు రెండూ జ్ఞానానికి ఎలా ఉపకరిస్తాయో స్పష్టం చేయడం జరిగింది. ఈ క్రమంలో యోగ, సన్యాసాల వైశిష్ట్యాన్ని మూడు, నాలుగు అధ్యాయాలలో భగవానుడు వివరించడం కూడా జరిగింది. ఇంత చెప్పినా, అయిదవ అధ్యాయంలో మళ్ళీ అదే సందేహాన్ని మరో రూపంలో అర్జునుడు వ్యక్తం చేయడం జరిగింది.

'కృష్ణా! కర్మయోగాన్ని, కర్మసన్యాసాన్ని నువ్వు పదే పదే చెబుతున్నావు. ఈ రెండిటిలో ఏది శ్రేయస్కరమో దానిని నిశ్చయంగా చెప్పు' అని ఐదవ అధ్యాయం ప్రథమ శ్లోకం లోనే మళ్ళీ ప్రశ్నించాడు అర్జునుడు.

యోగము, సాంఖ్యము వేరు కాదని, రెండిటి గమ్యము ఒక్కటే నని, ఈ రెండిటిని అభిన్నంగా దర్శించే వాడే సత్యద్రష్ట అని ఐదవ అధ్యాయంలో చెప్పడం జరిగింది.

## మళ్ళీ మొదటి కొచ్చింది

అనుష్ఠాన పద్ధతులైన కర్మయోగ, జ్ఞానయోగాలను నిష్ఠాద్వయంగా పరమేశ్వరుడు ప్రతిపాదించిన తరువాత, ఈ రెండిటిలో ఏది శ్రేయస్కరము? అని అర్జునుడు ఏ సందేహాన్నైతే విడిచి పెట్టకుండా భగవంతునికి వినిపిస్తూ ఉన్నాడో, దానినే పన్నెండవ అధ్యాయంలో కూడా మరో కోణం నుండి వినిపిస్తున్నాడు.

పూర్వం అనుష్ఠాన పద్ధతులైన కర్మయోగ, సన్యాసాల మధ్య తరతమ భేదాన్ని చూచిన వాడు, ప్రస్తుతం అదే తరతమ భేదాన్ని అంతరంగ సాధనల మధ్య కూడా చూస్తూ ప్రశ్నిస్తున్నాడు. ఉపాసనకు సగుణము శ్రేష్ఠమా, నిర్గుణము శ్రేష్ఠమా? అని ప్రశ్నిస్తున్నాడు.

## యోగము - జ్ఞానము

కర్మయోగి కర్మానుష్ఠానంలో ఉంటూ, పరమేశ్వరుడే గమ్య మని భావిస్తూ, ఈశ్వరార్పణ బుద్ధితో కర్మలను నైవేద్యాలుగా సమర్పిస్తూ, కర్మఫలాలను ప్రసాదాలుగా స్వీకరిస్తూ, స్వామి భృత్య న్యాయానుసారం, సాకారమూర్తిని సేవిస్తూ జీవితాన్ని కొనసాగిస్తాడు. అనన్య శరణ్యుడై జీవిస్తాడు. ఇది సగుణోపాసన. అంటే, సగుణ ధ్యానము. సగుణ బ్రహ్మ విషయ మానస వ్యాపారము.

అలా కాకుండా, సర్వ కర్మలను విడిచిపెట్టి - ఉపాధి శూన్యము, అక్షరము, అవ్యక్తము అయిన పరబ్రహ్మ స్వరూపాన్ని ఉపాసించే జ్ఞానయోగులు ఆచరించేది నిరాకారోపాసన లేదా నిర్గుణోపాసన.

రూప దర్శనం చేస్తూ ఉపాసించే కర్మయోగులు సాకారోపాసకులు లేదా సగుణారాధకులు. రూపాన్ని దాటి స్వరూపాన్ని ఉపాసించే జ్ఞానయోగులు నిరాకారోపాసకులు లేదా నిర్గుణోపాసకులు.

వ్యక్తాన్ని దర్శించి భక్తి చేసే వారు కర్మయోగులు. అవ్యక్తాన్ని అవగాహన ద్వారా, అంటే శ్రవణ మనన నిదిధ్యాసనల ద్వారా అర్థం చేసుకొని అనుభూతిని పొందే వారు జ్ఞానయోగులు. కర్మయోగులది విశ్వరూపోపాసన. జ్ఞానయోగులది అక్షరోపాసన.

పూర్వం వీరిరువురి జీవన విధానాలలో ***(నిష్ఠాద్వయం)*** ఏది శ్రేయస్కరం? అని ప్రశ్నించిన పార్థుడు, ప్రస్తుతము వీరిరువురి ఉపాసనలలో లేదా ధ్యానాలలో ఏది శ్రేయస్కరము? అని అడుగు తున్నాడు. సతత యుక్తులై, పరమేశ్వరుని ఉపాసించే కర్మయోగులు యోగశ్రేష్ఠులా? ***(సతత యుక్తాః యే భక్తాః త్వాం పర్యుపాసతే).*** లేక, అక్షరము అవ్యక్తము అయిన పరబ్రహ్మమును ఉపాసించే జ్ఞానయోగులు యోగశ్రేష్ఠులా? ***(యే తు అక్షరం అవ్యక్తం పర్యుపాసతే).*** వీరిరువురిలో యోగవిత్తములు ఎవరు? ***(తేషాం కే యోగవిత్తమాః, ఉభయేషాం మధ్యే, కే అతిశయనే యోగవిదః ఇత్యర్థః).*** కనుక మూడవ అధ్యాయం నుండి ఏ సంశయాన్ని ప్రస్తావిస్తూ పార్థుడు ప్రశ్నిస్తున్నాడో, దానినే ఇక్కడ ఉపాసనా పరంగా ప్రశ్నిస్తున్నాడు. అంతే తేడా. ఆహార్యాలు వేరే అయినా అభినయం మాత్రం ఒక్కటే.





రెండవ అధ్యాయంలో **అశోచ్యా నన్వ శోచస్త్వం** అనే శ్లోకం నుండి పదవ అధ్యాయం విభూతి యోగం వరకు నిరుపాధిక మైన జ్ఞేయబ్రహ్మ విషయమే ప్రధానంగా ప్రస్తావించ బడింది. ప్రతిపాదించ బడింది. అక్కడక్కడ సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, సృష్టి స్థితి లయ కారకుడు అయిన ఈశ్వరుని వైభవము, ఉపాసన కూడా చెప్పబడ్డాయి. ఇక పదకొండవ అధ్యాయమైన విశ్వరూప సందర్శన యోగములో ప్రదర్శింప బడిన విశ్వరూపము కూడా ఆద్యము ఉపాసనార్థమే చెప్పబడింది. విశ్వరూప దర్శనాన్ని ఉపసంహరించిన తరువాత, అధ్యాయాంతంలో **మత్కర్మకృత్** అంటూ చెప్పడం జరిగింది. కనుక ఈ ఉభయ వర్గాలలో ఏది శ్రేయస్కరమో, ఈ రెండు పక్షాలలో ఎవరు శ్రేష్ఠులో తెలుసుకోవాలనే ఆకాంక్ష అర్జునునిలో ఏర్పడింది. ఈ విధంగా పన్నెండవ అధ్యాయంలో ప్రశ్న రూపంగా మొదలైన ప్రథమ శ్లోకానికి పూర్వాధ్యాయం లోని చరమ శ్లోకం బీజ శ్లోకమైంది.

## రూపం - స్వరూపం

రూపం అంటే విశ్వరూపం. లేదా, విశ్వం లోని రూపం. రూపోపాసన అంటే, విశ్వరూపోపాసన. లేదా, విశ్వం లోని రూపోపాసన. రూపం ఎవరిది? రూపం ఎవరిదో అతడు రూపి. రూపము ఏదైనా అది రూపిదే.

రూపం రూపిదే కనుక, రూపం ద్వారా రూపి తెలియ బడతాడు. కాని, రూపి యొక్క స్వరూపానికి రూపం లేదు. రూపం వ్యక్తం; స్వరూపం అవ్యక్తం. రూపం క్షరం; స్వరూపం అక్షరం. రూపం అనేకం; స్వరూపం ఏకం.

రూపం వ్యక్తం కనుక, దానిని ఉపాసించ వచ్చు. కాని, స్వరూపం అవ్యక్తం. అవ్యక్తాన్ని ఉపాసించేది ఎలా? కనుక, ఇక్కడ వాస్తవానికి స్వరూపాన్ని అర్థం చేసుకోవడమే గాని ఉపాసించడ మనేది ఉండదు. ఉపాసించే వాని స్వరూపమే అవ్యక్తం కనుక, అక్కడ ఉన్నది జ్ఞానమే గాని ఉపాసన కాదు. సగుణ బ్రహ్మోపాసన చేసే వారు కర్మయోగులు. నిర్గుణ బ్రహ్మ విచారము చేసే వారు జ్ఞానయోగులు. అలాంటపుడు, ఉభయులలో యోగవిత్తము లెవరు? అనే ప్రశ్న ఎలా పుడుతుంది?

కర్మయోగ, ఉపాసనల ద్వారా శుద్ధిపడిన అంతఃకరణము జ్ఞానమును, తద్వారా మోక్షమును పొందుతుంది. కనుక, ఇక్కడ సోపానక్రమంగా ప్రస్థానము సాగే టప్పుడు తరతమ భేద ప్రసక్తి ఎలా తలెత్తు తుంది? రెండూ అవశ్యం మోక్ష సాధనాలే కనుక ఏది శ్రేష్ఠము అనే ప్రశ్నే ఉత్పన్నం కాదు. తాను దేనికి సరిపోతాడు, లేదా తన కేది సరిపోతుంది? అనేది అర్థం చేసుకొని, అక్కడ సరిపడి ఉండేవాడు శ్రేష్ఠమైన మార్గంలో ఉన్నాడని అర్థము.

మనం మార్గాన్ని అనుసరించేది గమ్యం చేరడానికి. చేరవలసింది గమ్యమునే అయినా, మార్గాన పడి పోతే గాని గమ్యం చిక్కదు. శ్రేష్ఠ మైనది గమ్యమే అయినా, మార్గం లేకుండా గమ్యం ప్రాప్తించదు. శ్రేష్ఠమైన గమ్యాన్ని చేర్చే మార్గము కూడా శ్రేష్ఠమే కదా!

పొంద దగినది జ్ఞానమే అయినా, చిత్తశుద్ధి లేకుండా జ్ఞానం సిద్ధించదు. చిత్తశుద్ధి కర్మయోగం ద్వారానే లభిస్తుంది. ప్రశస్తమైన జ్ఞానాన్ని పొందడం పవిత్ర మైతే, అట్టి జ్ఞానాన్ని పొందడానికి ఉపకరించే చిత్తశుద్ధిని ప్రసాదించే కర్మయోగము పవిత్రం కాకుండా ఎలా ఉంటుంది? మరి ఈ రెండిటిలో ఏది శ్రేష్ఠము అంటే ఏం చెప్పగలం? జ్ఞాననిష్ఠుల చేత ఏ స్థానం పొంద బడుతుందో, కర్మయోగుల చేత అదే పొంద బడుతుంది

(5-5) అని పూర్వం మనం గ్రహించినట్లే, అవ్యక్తోపాసకు లైన జ్ఞానభక్తులు దేనిని పొందుతారో, విశ్వరూపోపాసకు లైన సగుణ భక్తులు కూడా దానినే పొందుతారు అని ఇక్కడ గ్రహించ వలసి ఉంటుంది. ఉపాసనా ప్రధానమైన ఈ ప్రశస్తమైన విషయాన్ని ప్రముఖంగా ఈ భక్తియోగము అనే పన్నెండవ అధ్యాయంలో చర్చించడము జరుగుతుంది.

**భక్తి యోగము**

***సా తు అస్మిన్ పరమ ప్రేమ రూపా*** - భగవంతుని యందు ఉత్కృష్టమైన ప్రేమను కలిగి ఉండటమే భక్తి అని నారదమహర్షి నిర్వచించాడు.

***సా పరానురక్తిః ఈశ్వరీ*** - పరమేశ్వరుని యందు అత్యంత అనురాగమును కలిగి ఉండటమే భక్తి అని శాండిల్య మహర్షి నిర్వచించాడు. కనుక, భక్తి సూత్రకారు లైన ఈ ఇరువురు మహర్షులు ప్రవచించిన విషయమును బట్టి భక్తులకు భగవంతునిపై గల ప్రేమానురాగాది జ్ఞానాతిశయమే భక్తి అని అర్థమవుతూ ఉంది. భవ్య మైనది, భద్ర మైనది భక్తియే అనేది నిర్వివాదాంశము. అందుచేత, **సర్వాత్ము హరిన్ నమ్మి సజ్జనుడై *యుండుట భద్రమంచు! తలతు*** అని ఆంధ్ర మహాభాగవతము - సప్తమ స్కంధము.

***స్వస్వరూపాను సంధానం భక్తి రిత్యభిధీయతే*** - మోక్ష సాధనములలో శ్రేష్ఠ మైనది భక్తి ఒక్కటే అని చెబుతూ, పరమాత్మ స్వరూపమును అనుసంధానం చేస్తూ స్వస్వరూప స్థితిలో ఉండటమే భక్తి అని శ్రీ శంకరాచార్య స్వామి నిర్వచించారు.

ఇదంతా చూస్తే భక్తి సగుణము, నిర్గుణము కూడా అని అర్థ మవుతూ ఉంది. సాకార భక్తులు విశ్వరూప ధ్యానాన్ని సాగిస్తే, నిరాకారమును ఉపాసించే నిర్గుణ భక్తులు ఆత్మధ్యానాన్ని కొనసాగిస్తారు. రెండిటి యొక్క ఫలము బ్రహ్మాత్మజ్ఞానమే కనుక, సగుణ నిర్గుణాల మధ్య భేదము గాని, తరతమ భావ భేదాలు గాని ఉండేందుకు వీలు లేదు. కనుక పూర్వాధ్యాయ చరమ శ్లోకంలో ప్రముఖంగా ప్రస్తావించబడిన మచ్ఛబ్దము యొక్క అర్థము సగుణానికి వర్తిస్తుంది. నిర్గుణము లోనూ ప్రవర్తిస్తుంది. సప్తమాధ్యాయము నుండి ప్రతిపాదింప బడుతూ వస్తున్న తత్పద వాచ్యార్థము ప్రస్తుతము తత్పదార్థ శోధన రూపమైన ఉపాసనా కాండమును పూర్తి చేయడంతో స్పష్ట మవుతూ ఉంది. ఇంతటితో ద్వితీయ షట్కము సమాప్త మవుతుంది.

**ద్వాదశాధ్యాయము**

ఇది ద్వాదశాధ్యాయము. పన్నెండవ అధ్యాయము. భక్తియోగము. భక్తి భగవత్స్వరూపము. అమృత స్వరూపము. స్వయంప్రమాణము. స్వయం ఫలరూపము. అనుభవరూపము.

భగవ త్స్వరూపమైన భాగవతము ద్వాదశ స్కంధాలతో ప్రకాశిస్తూ ఉంది. భగవానుడైన శ్రీకృష్ణదేవుని దివ్య మంత్రము ***ఓం నమో భగవతే వాసుదేవాయ*** ద్వాదశాక్షరీ మహామంత్రమై, ద్వాదశాదిత్య తేజంతో ప్రకాశిస్తూ ఉంది.

ఈ అధ్యాయంలో భగవంతుని రూప స్వరూపాలు వర్ణింపబడ్డాయి. భక్తి సాధనలతో పాటు, భక్తుని లక్షణాలు కూడా దివ్యంగా ప్రవచింప బడ్డాయి. భగవంతుని స్వరూపాన్ని తెలుసుకోవడానికి ***(జ్ఞాతుం శాస్త్రతః)***, తెలుసుకోవడమే గాక యథార్థంగా దర్శించడానికి ***(ద్రష్టుం తత్త్వతః)***, దర్శించి భగవంతునిలో ప్రవేశించడానికి ***(తత్త్వేన ప్రవేష్టుం)*** ఈ అధ్యాయం దారిదీపమై శోభిస్తుంది. దివ్యదీపమై భాసిస్తుంది. ఈ దీపానికి కావలసిన వస్తువు లన్నీ పూర్వాధ్యాయ చరమ శ్లోకంలో సూక్ష్మ రూపంలో అందించ బడ్డాయి. దీపం ప్రకాశించడానికి (1)ప్రమిద (2) వత్తి (3) తైలము (4) జ్వాల (5) గాలి ఎలా అవసరమో, జీవనజ్యోతి శోభించడానికి మత్కర్మకృత్ అనే ప్రమిద, మత్పరమ మనే వత్తి, మద్భక్తి అనే తైలము, సంగరాహిత్య మనే జ్వాల, సర్వభూతముల యందు నిర్వైర మనే గాలి అవసరమై ఉన్నాయి. అన్నీ సమకూర్చుకో బడ్డాయి. ఇక, దీపాన్ని వెలిగించి దర్శించినట్లు ఈ అధ్యాయంలో భక్తి స్వరూపాన్ని దర్శించడమే మిగిలి ఉంది. అర్జునుని ప్రశ్నతో దర్శనానికి తెర తొలగింది.





**అర్జున ఉవాచ :**

**ఏవం సతతయుక్తా యే భక్తా స్త్వాం పర్యుపాసతే ।**
**యే చా ప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః ॥** 1

**ఏవం-సతతయుక్తాః-యే-భక్తాః-త్వాం-పర్యుపాసతే**
**యే-చ-అపి-అక్షరం-అవ్యక్తం-తేషాం-కే-యోగవిత్తమాః**

| | | | |
|---|---|---|---|
| ఏవం | = ఈ విధముగా | అవ్యక్తం | = వ్యక్తము గాని |
| సతతయుక్తాః | = సదా నీ యందే చిత్తమును ఉంచి | అక్షరం అపి | = అక్షర బ్రహ్మమును |
| యే | = ఎవ్వరయితే | పర్యుపాసతే | = ఉపాసిస్తున్నారో |
| భక్తాః | = భక్తులు | తేషాం | = వారలలో |
| త్వాం | = నిన్ను | కే | = ఎవరు |
| పర్యుపాసతే | = ఉపాసిస్తున్నారో | యోగవిత్తమాః | = యోగము నెరిగిన వారు |
| యే చ | = ఎవరైతే | | |

**అర్జునుడు అడుగుతున్నాడు :**

**భగవంతా! శ్రీకృష్ణా! నిరంతరము నీ యందే చిత్తము నుంచి కొందరు భక్తులు నిన్నే ఉపాసిస్తూ ఉంటారు. మరి కొందరు అక్షరము, అవ్యక్తము అయిన పరబ్రహ్మమును ధ్యానిస్తూ ఉంటారు. ఈ ఇద్దరిలో ఉత్తమ యోగు లెవరు?**

**వ్యాఖ్య**

**సవ్యసాచి సంశయము**

ఉపాసనా ప్రధానమైన విషయాన్ని ప్రశ్న రూపంలో ప్రస్తావిస్తూ **ఏవం** అంటూ శ్లోకాన్ని ప్రారంభించాడు అర్జునుడు. **ఏవం** అంటే 'ఈ విధంగా, ఈ ప్రకారంగా' అని అర్థము. అంటే, ఈ విషయానికి ముందు సమీపంగా ఏది ఉందో అదే **ఏవం** శబ్దం చేత పరామర్శింప బడుతూ ఉంది. అదే పూర్వాధ్యాయం లోని చివరి శ్లోక విషయాలైన **మత్కర్మకృత్** మొదలైన సాధనలు.

మత్కర్మకృత్వము మొదలైన సాధనల చేత సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, సర్వవ్యాపి, సృష్టి స్థితి లయాది హేతువు అయిన పరమేశ్వరుని అర్జునుడు దర్శించినట్లు విశ్వరూపిగా కాని, లేదా విశ్వము లోని రూపాలలో ఏదో ఒక రూపంగా గాని, లేదా అవతార మూర్తుల రూపాలలో గాని ఉపాసించడం సోపాధిక ధ్యానము. ఉపాధి సహిత సవిశేష ధ్యానము. ఇదే సగుణోపాసనము లేదా సాకారోపాసనము. ఈ విధమైన **(ఏవం)** సాకార ధ్యానమును నిరంతరము కొనసాగిస్తూ **(సతతయుక్తాః)**, కేవలం పరమేశ్వరునే ఆశ్రయించుకొని జీవించే భక్తులు **(భక్తాః)** సోపాధిక బ్రహ్మమును ఉపాసిస్తున్నారు.

అలా కాకుండా, మరి కొందరు సర్వ కర్మలను సన్యసించి, ఉపాధి రహితము, అవ్యక్తము అయిన అక్షర పరబ్రహ్మమును నిర్విశేషంగా ఉపాసిస్తున్నారు. మొదటి వారు భక్తులు, లేదా కర్మయోగులు. రెండవ తెగ వారు జ్ఞానులు, లేదా సన్యాసులు.

భక్తులకు సోపాధిక బ్రహ్మము ధ్యేయ వస్తువు కాగా, జ్ఞానులకు నిరుపాధిక బ్రహ్మము జ్ఞేయ వస్తువు. వీరిరువురిలో ఉత్తమ యోగులు ఎవరు? అనేది అర్జునుని ప్రశ్న. విశ్లేషించి అర్థం చేసుకుంటే, వారిరువురిలో ఎవరు గొప్ప యోగులు అనేది అర్జునుని ఉద్దేశం కాదు. ఈ రెండు ఉపాసనలలో ఏది సుకరము, మోక్షానికి సన్నిహితము అనేది అర్జునుని భావము. పరమేశ్వరుడు ఈ ఉభయ సాధనలను ఉపదేశించి ఉండటమే ఈ భావానికి ఆధారము.

ఇంతవరకు మనం చేసిన అధ్యయనాన్ని బట్టి చూస్తే, గీతలో ఆద్యమూ, సమస్తమూ అక్షర పరబ్రహ్మమే ప్రధాన విషయంగా చర్చింప బడింది. పది, పదకొండవ అధ్యాయాలు సోపాధికమైన పరమేశ్వర స్వరూపాన్ని ప్రధానంగా ప్రస్తావించాయి. వాటితో పాటు అక్కడక్కడ ఇతర అధ్యాయాలలో కూడా ఈశ్వరోపాసన చెప్పడం జరిగింది ***(తత్ర తత్ర ఈశ్వరస్య ఉపాసనం ఉక్తమ్)***. ఈ రెండు రకాలైన ఉపాసనలను అనుష్ఠించే వారిలో ఎవరు శ్రేష్ఠులు? అంటే, ఏ ఉపాసన శ్రేష్ఠము అని అర్థము. ఏది శ్రేష్ఠమో దానిని ఆచరిద్దా మని బహుశ అర్జునుడు భావిస్తున్నాడేమో! ఏది ఎలా భావించినా, ఏదో ఒకటి చేయాలి అనే నిర్ణయానికి మాత్రం అర్జునుడు వచ్చేశాడు అని ఖచ్చితంగా చెప్ప వచ్చు.

ఇప్పుడే దర్శించిన విశ్వరూప మూర్తిని అనన్య శరణుడై, మత్కర్మకృత్వాది సాధనల చేత ఉపాసించడం అనే సగుణోపాసనను **ఏవం** అనే శబ్దం చేత ప్రస్తావించిన పార్థుడు, మళ్ళీ అవ్యక్తమైన అక్షర పరబ్రహ్మమును ప్రత్యేకంగా ప్రస్తావించ నవసరం లేదు. తాను దర్శించిన విశ్వరూపునిపై సవిశేష ధ్యానాన్ని కొనసాగించి ఉండ వచ్చు. కాని, అలా కాకుండా, నిర్విశేష నిరుపాధిక బ్రహ్మమును ప్రస్తావించాడు అంటే, విశ్వరూప సందర్శనము జరిగినా, ప్రారంభం నుండి అర్జునుని ఏ సందేహం పట్టుకొని ఉందో, అది ఇంకా పూర్తిగా పరిహరించబడ లేదని తెలుస్తూ ఉంది. కర్మయోగమా? కర్మసన్యాసమా? ఏది శ్రేష్ఠము అంటూ మూడు, ఐదు అధ్యాయాలలో ఏ సందేహా న్నైతే వెలిబుచ్చాడో, అదే సందేహాన్ని కర్మయోగి ఆచరించే సగుణోపాసన శ్రేష్ఠమా, సన్యాసి అనుష్ఠించే నిర్గుణోపాసన శ్రేష్ఠమా? అనే ప్రశ్నలో వ్యక్తం చేస్తున్నాడు. విశ్వరూపాన్ని దర్శించిన విజయుడు విశ్వరూపం కన్నా తనను వేరుగా నిలుపుకోవడమే దర్శన సమయంలో భయానికి, దర్శనానంతరము సందేహానికి కారణమైంది. ఈ కారణంగా భక్తియోగము ఆరంభమైంది. సగుణ నిర్గుణాలలో ఏ ఉపాసన శ్రేష్ఠము? అనే విషయం తెర మీదికి వచ్చింది.

## ఉపాసనా విషయము

ఇంతకీ ఉపాసన అంటే ఏమిటి? ఉపాసించ దగిన వస్తువును ***(ఉపాస్యం)*** శాస్త్రోక్తంగా తెలుసుకొని, దానిని సమీపించి, దానితో భావైక్యం చెంది, అదే భావ ప్రవాహంలో దీర్ఘకాలం కొనసాగడం ఉపాసన అన్నారు ఆచార్యులు ***(యథా శాస్త్రమ్ ఉపాస్యస్య అర్థస్య విషయీకరణేన, సామీప్యం ఉపగమ్య సమాన ప్రత్యయ ప్రవాహేణ దీర్ఘకాలం యత్ ఆసనం తత్ ఉపాసనమ్ ఆచక్షతే)***. ఈ భావ ప్రవాహం కూడా అవిచ్ఛిన్నంగా తైలధార లాగా, జలప్రవాహం లాగా సాగుతూ ఉండాలి.

భక్తులు సోపాధిక బ్రహ్మమును ఉపాసిస్తారు కనుక, ఈశ్వరుడు వారికి ఉపాస్యము. అంటే ఉపాసనా విషయము. ఈ విధంగా సగుణారాధనలో ఉపాస్య ఉపాసక భేద ముంది. కనుక, ఉపాస్యాన్ని సమీపించి దీర్ఘకాలం ఉపాసనలో కొనసాగే అవకాశం ఉంది.

## ఉపాస్య ఉపాసక భేదం

మరి, అక్షర బ్రహ్మోపాసన అనే నిర్గుణారాధనలో ఉపాసన సాగాలి అంటే, అక్కడ కూడా ఉపాస్య





ఉపాసక భేదం ఉండాలి కదా? కాని ఏది? ఉపాసకునికి వేరుగా ఉపాస్యం ఎక్కడుంది? ఉపాసకుడి స్వరూపమే కదా ఉపాస్యము? అలాంటప్పుడు ఉపాసనకు అవకాశం ఎక్కడుంది? ఉపాసనకే అవకాశం లేనపుడు, ఈ ఉభయులలో శ్రేష్ఠు లెవరు అని అర్జునుడు అడిగిన ప్రశ్నను ఎలా అర్థం చేసుకోవాలి? కర్మయోగము శ్రేష్ఠమా? కర్మసన్యాసము శ్రేష్ఠమా? అని ప్రశ్నించి నపుడు, ఎలా అర్థం చేసుకున్నామో అలాగే అర్థం చేసుకోవాలి.

ఉపాసనకు అవకాశం ఉండే సాకారోపాసనను, ఉపాసనకు అవకాశమే లేని నిర్గుణారాధనతో పోల్చి ఏది శ్రేష్ఠతమము? అని ప్రశ్నించడాన్ని ఎలా అర్థం చేసుకోవాలి? అమ్మాయికి పెళ్ళి చేయాలి. వరాన్వేషణం జరుగుతూ ఉంది. ఆ సందర్భంలో పెళ్ళి కాని ఇద్దరు యువకుల్ని చూపి, వీరిద్దరిలో అమ్మాయికి శ్రేష్ఠు డెవరు? అంటే, సమాధానం చెప్పగలం గాని, ఒక వివాహితుణ్ణి, ఒక అవివాహితుణ్ణి చూపి, వీరిరువురిలో ఎవరు శ్రేష్ఠుడు? అంటే ఏమి చెప్పగలం? ఇక్కడ కూడా అంతే.

కర్మలలో ఉండే యోగిని కర్మలు సన్యసించిన జ్ఞానితో పోల్చి చర్చించడము, ఉపాస్య ఉపాసక భేద భావనలో ఉన్న భగవ దుపాసకుని, ఉపాస్య ఉపాసక భేదం లేని ఆత్మ స్వరూపాన్ని ధ్యానించే జ్ఞానితో పోల్చి విశ్లేషించడము ఎలా చూచినా సముచితం కాదు. కర్మయోగికి సాధన సోపాధిక ధ్యానం. జ్ఞానయోగికి సాధన నిరుపాధిక జ్ఞానం. కర్మయోగికి సవిశేష బ్రహ్మము ధ్యేయం. జ్ఞానయోగికి నిర్విశేష బ్రహ్మము జ్ఞేయం. ఈ అంతరాన్ని స్పష్టంగా అర్థం చేసుకుంటే సగుణ నిర్గుణాల మధ్య భేదం గోచరించదు. కనుక, ఏది శ్రేష్ఠము అనే ప్రశ్న ఉత్పన్నమే కాదు.

జ్ఞానము పవిత్రము, ప్రశస్తము అయినా, కర్మయోగికి కర్మయే శ్రేష్ఠము. కర్మయోగము ద్వారా చిత్తశుద్ధిని పొందిన యోగి కర్మసన్యాసానికి అర్హు డవుతాడు. అలాగే ఉపాసన ద్వారా చిత్త నైశ్చల్యమును పొంది నిర్గుణారాధనకు చేరు వవుతాడు. ఇది సుకరము. మోక్షైక సాధనము.

తీగ లోని మొగ్గ పువ్వు కావడంలో కష్టం లేదు. బాధ లేదు. సందేహం లేదు. కాని, మొగ్గ పువ్వుగా మారాలని మొగ్గను నలిపితే మాత్రం, ఈ అసహజమైన ప్రయత్నం వల్ల మొగ్గ పాడవుతుందే గాని పువ్వుగా మారదు. కర్మయోగ కర్మసన్యాసాల విషయంలో గాని, సాకార నిరాకార ధ్యాన విషయంలో గాని ఈ సత్యమే దర్శనీయము.

## రూప ధ్యానం - స్వరూప జ్ఞానం

భక్తులు సతతయుక్తులు. భగవత్సేవల యందు నిరంతరము సమాహితులై ఉండేవారు. అనన్య శరణులు ***(భక్తాః అనన్య శరణాః)***. అంటే, భగవంతుడు తప్ప మరొక ఆశ్రయము తెలియని వారు. వీరు సాకారమూర్తి అయిన పరమేశ్వరునే ఆరాధిస్తూ ఉంటారు. ధర్మబద్ధంగా జీవనయాత్రను కొనసాగిస్తూ, నిరంతరం సగుణ బ్రహ్మారాధనలో ఉంటారు. వీరే భక్తులు. కర్మయోగులు. వీరిది రూప ధ్యానం. సోపాధిక ధ్యానం.

జ్ఞానులు సర్వకర్మలను సన్యసించిన వారు. శమదమాదులను కలిగి, నిరంతరం అవ్యక్తమైన అక్షర పరబ్రహ్మను ధ్యానిస్తూ ఉంటారు. వాస్తవానికి ఇక్కడ ఉన్నది జ్ఞానమే గాని ఉపాసన కాదు. ఇది రూప ధ్యానం కాదు, స్వరూప జ్ఞానం.

బ్రహ్మము అవ్యక్తము. ఏది ఇంద్రియ మనస్సులకు అందుతుందో అది వ్యక్తము ***(యత్ కరణ గోచరం తత్ వ్యక్తమ్)***. ఏది ఇంద్రియ బుద్ధులకు అందదో అది అవ్యక్తము ***(యత్ అకరణ గోచరమ్ తత్ అవ్యక్తం)***. ఏదయితే ఇంద్రియ బుద్ధులకు అందదో అది అవ్యక్తము. అదియే పరబ్రహ్మము. ఇది జ్ఞేయ విషయమే గాని ధ్యాన విషయం కాదు; ఉపాసనా విషయం కానే కాదు.

అవ్యక్తము కనుక బ్రహ్మము అక్షరము. అకరణ గోచర మైనది ఎలా నశిస్తుంది? నశించదు కనుక

అవ్యక్త పరబ్రహ్మము అక్షరము ***(న క్షరతి ఇతి అక్షరమ్).*** ఇట్టి అక్షర రూపాన్ని అర్థం చేసుకొనే వారు సన్యాసులు.

కాబట్టి, కర్ములకు, కర్మయోగులకు మధ్య అంతరాన్ని, శ్రేష్ఠత్వాన్ని దర్శించవచ్చు నేమో గాని, కర్మయోగులకు, జ్ఞానులకు మధ్య శ్రేష్ఠత్వాన్ని అర్థం చేసుకోవడం సాధ్య పడదు.

ఎవరు శ్రేష్ఠులు? అనే అర్జునుని ప్రశ్నకు సమాధానం కర్మయోగులే అనేది నిర్వివాదాంశం. జ్ఞానులు ఉపాసకులు కారు కనుక.

యోగాన్ని సాధించాలి అనే ఆరురుక్షువు అనే కర్మయోగికి కర్మ సాధనము కాగా, యోగాన్ని సాధించిన యోగారూఢు డనే జ్ఞానికి కర్మనివృత్తి సాధన మవుతూ ఉందని ఆరవ అధ్యాయం లోనే చూశాము కదా! (6-3).

ఉపాసన కర్మే కనుక, ధ్యానమైనా మానస కర్మే కనుక, ఉపాసనలో సాగే కర్మయోగికి, జ్ఞానంలో రమించే సన్యాసికి పోలికే లేదు. ఇక శ్రేష్ఠత్వం అనే ప్రశ్న ఎక్కడుంది? ఒకవేళ ఉన్నా, ఆ శ్రేష్ఠత్వము యోగికి సంబంధించిందే గాని జ్ఞానికి సంబంధించింది కాదు.

*భగవానుడు అదే చెబుతున్నాడు.*

**శ్రీ భగవానువాచ :**

మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే ।
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః ॥ 2

*మయి-ఆవేశ్య-మనః-యే-మాం-నిత్యయుక్తాః-ఉపాసతే*
*శ్రద్ధయా-పరయా-ఉపేతాః-తే-మే-యుక్తతమాః-మతాః*

| | | | | | |
|---|---|---|---|---|---|
| మయి | = | నా యందు | యే | = | ఎవరు |
| మనః | = | మనస్సును | మాం | = | నన్ను |
| ఆవేశ్య | = | నిలిపి | ఉపాసతే | = | ఉపాసిస్తున్నారో |
| నిత్యయుక్తాః | = | నిత్యయుక్తులై | తే | = | వారు |
| పరయా | = | ఉత్తమమైన | మే | = | నాకు |
| శ్రద్ధయా | = | శ్రద్ధతో | యుక్తతమాః | = | ఉత్తమ యోగులని |
| ఉపేతాః | = | కూడినవారై | మతాః | = | అభిప్రాయము |

**శ్రీ భగవానుడు చెబుతున్నాడు :** **అర్జునా! మనస్సును నా యందే నిలిపి, నిరంతరము దైవ చింతనాపరులై, మిక్కిలి శ్రద్ధతో నన్ను ఉపాసించే వారు ఉత్తమ యోగులని నా అభిప్రాయము.**

**వ్యాఖ్య**

**సగుణమే సుగుణము**

రూపాన్ని ఆలంబనం చేసుకొని పరమేశ్వరుని ధ్యానించేది సగుణారాధన. నామరూపాలకు విలక్షణమైన తత్త్వాన్ని తదేక చింతనతో దర్శించేది నిర్గుణారాధన. సగుణారాధన చేసే భక్తులు కర్మయోగులు. నిర్గుణారాధనను కొనసాగించే సన్యాసులు జ్ఞానయోగులు. వీరిరువురిలో ఉత్తమయోగు లెవరు? అని అర్జునుడు ప్రశ్నించడంతో ఈ ద్వాదశాధ్యాయం ప్రారంభమైంది.





విశ్వరూపోపాసన చేసే సగుణ భక్తులకు, అవ్యక్తోపాసనలో నిమగ్నులైన నిర్గుణ భక్తులకు సామ్యమే లేదని గ్రహించాము కదా! అందుచేత, అర్జునుని ప్రశ్నకు సూటిగా సమాధాన మివ్వకుండా అర్జునుని సందేహాన్ని పరిహరించాడు పార్థసారథి.

సగుణ నిర్గుణాలలో ఏది ఉత్తమము? అని ప్రశ్నిస్తే, దానికి సమాధానంగా, ఎవరికి? అనే ప్రశ్న ఎదు రవుతుంది. సాంఖ్యులకు, లేదా సన్యాసుల కైతే నిర్గుణము అనుసరణీయము. కర్మయోగులకు అంతఃకరణ శుద్ధ్యర్థం సగుణమే ఆచరణీయము. కనుక, సగుణ నిర్గుణాల మధ్య పోలికే లేనందున, అర్జునుని వంటి కర్మయోగులకు సాకారోపాసనే శ్రేష్ఠ మని భగవంతుడు నిర్ణయించాడు.

భగవ దుపాసకులకు కావలసింది భగవంతుడా, లేక ఉపాసనా? భక్తుల గమ్యము భగవంతుడే గాని ఉపాసన కాదు. కాని ఉపాసన చేస్తే గాని భగవంతుని పొందడం సాధ్య పడదు.

గమ్యం చేరాలని భావించే వాడే మార్గంలో చరిస్తూ ఉంటాడు. మార్గంలో ఉన్నవాడు గమ్యం చేరా లనుకుంటాడే గాని మార్గం లోనే ఉండి పోవా లనుకోడు. చేర వలసింది గమ్యాన్నే అయినా, మార్గాన్ని ఆశ్రయించకుండా గమ్యాన్ని చేరే ప్రసక్తే లేదని ఇప్పటికే అర్థం చేసుకున్నాం కనుక, గమ్యము శ్రేష్ఠమా, మార్గము శ్రేష్ఠమా? అని ప్రశ్నిస్తే, ప్రయాణంలో ఉండే వాడికి మార్గమే శ్రేష్ఠము అని చెప్పాలి.

భగవంతుడు గమ్యము. జ్ఞాని తన స్వరూపమే అని భగవంతుడు ప్రవచించాడు. భగవంతునికి జ్ఞానికి తేడా లేదు. సాధకుడైన కర్మయోగిని, సాధ్యరూపుడైన జ్ఞానితో పోల్చి శ్రేష్ఠత్వాన్ని ఎలా నిర్ణయిస్తారు? అందుచేత ఉత్తమయోగు లెవరు? అనే అర్జునుని ప్రశ్నకు కర్మయోగియే ఉత్తమయోగి అని నిర్ధారించాలి. భగవంతుడు అదే చేశాడు. కర్మయోగంలో కొనసాగుతూ సగుణారాధనలో బ్రతుకును భగవన్మయం చేసుకోమని బోధిస్తున్నాడు.

**భక్తి నావ**

సాకారోపాసకులకు ఈ అధ్యాయం మధురమైన అధ్యాయము. మంగళకరమైన అధ్యాయము. భక్తవశుడు, భక్తవత్సలుడు అయిన భగవంతుని వశ పరచుకొని బ్రతుకును భవ్యంగా తీర్చి దిద్దుకోవడానికి కావలసిం దంతా ఈ అధ్యాయంలో లభిస్తుంది. **యోగి హృత్ ధ్యాన గమ్యం** అని కీర్తనీయుడైన శ్రీకృష్ణ దేవుడు దయామయుడై, దయారూపుడై హృదయంలో ఎలా ఒదిగి ఉన్నాడో ఈ అధ్యాయంలో స్పష్టంగా చూడవచ్చు. దాచిన మనస్సును దోచి పెడితే, దోచిన వాడు గుట్టుగా మనస్సులో దాగి ఉండే రహస్యాన్ని ఇక్కడ దర్శించ వచ్చు.

**ఏమి లేని నాకు ఉన్న దొకటి**
**ఎవరి కివ్వక నీ కొరకె దాచి పెడితి**
**హృదయమే అది - మధ్యలో 'దయ'వు నీవు**
**నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!**

అని చిన్నికృష్ణ శతకంలో ఒక వెన్నముద్ద.

ఆత్మజ్ఞానము పరమోత్కృష్టము. జీవుల గమ్యము. ఆ విషయంలో మరో ఆలోచనకు అవకాశం లేదు. కానీ, అందరికీ సులభసాధ్య మయ్యేది భక్తి. కర్మయోగిని జ్ఞానానికి సిద్ధ పరచేది భక్తి. స్నిగ్ధ సుకుమార సుందరతర చారుమూర్తి మురళీకృష్ణ భగవానుని మంజుల మనోహర రూపాన్ని దర్శిస్తూ, మనస్సును మాధవ చైతన్యంతో నింపుకొని అలౌకిక ఆనందానుభూతిని పొందే దివ్య స్థితిని భక్తి ప్రసాదిస్తుంది.

అర్జునా! ఉత్తమయోగు లెవరు? అని అడిగావు కదూ! అయితే విను. ఎవరు నా యందే మనస్సును ఉంచి ***(యే మయి మనః ఆవేశ్య)***, సదా దైవ చింతనాపరులై ***(నిత్యయుక్తాః)***, మహా శ్రద్ధ కలవారై ***(పరయా శ్రద్ధయా ఉపేతాః)***, నా రూపమును ధ్యానిస్తూ, నన్నే ఉపాసిస్తారో ***(మాం ఉపాసతే)***, వారే ఉత్తమ యోగులని ***(తే యుక్తతమాః)*** నా అభిప్రాయము ***(మే మతాః)*** అన్నాడు భగవంతుడు.

సాకార నౌక నెక్కి, దివ్యానుభూతులనే శీతల పవనాలు హృదయాన్ని చలింప చేస్తూ ఉంటే, అలౌకిక సౌందర్యాలను భావ జగత్తులో అవలోకిస్తూ, అవలీలగా ప్రేమ జలాలలో కదలి పోతూ, అలవోకగా గమ్యం వైపు సాగిపోతూ, రసానంద పారవశ్యంలో అభయ రూపమైన జ్ఞానహస్తాన్ని అందుకొని, సుధామయ స్వరూపంతో సమరస మయ్యే దెలాగో బోధించేందుకు సిద్ధమైన గీతాచార్యుడు, భక్తి వైభవాన్ని వివరించేందుకు ఉద్యమించాడు.

**చిత్త సమర్పణము**

అర్జునా! నీ మనస్సును నా యందే నిలుపు అని సాధకుని ప్రథమ కర్తవ్యాన్ని సూచించాడు భగవంతుడు ***(మయి విశ్వరూపే పరమేశ్వరే, ఆవేశ్య సమాధాయ మనః)***.

ఏది ఎక్కడ ఉంచాలో తెలియక పోతే, ఆ ఉన్నదేదో ఉపయోగం లేకుండా పోతుంది. కలిపిన అన్నపు ముద్దను నోటిలో ఉంచాలని, పడుకొనే సమయంలో తలను దిండుపై ఉంచాలని, ధనాన్ని బ్యాంకులో ఉంచాలని, ఆభరణాలను లాకర్‌లో ఉంచాలని మనిషికి తెలుసు. కాని, మనస్సును ఎక్కడ ఉంచాలన్న దొక్కటే మనిషికి తెలియదు. అందుచేత, తన మనస్సు ఎప్పుడు ఎక్కడ ఉంటుందో, ఎందుకుంటుందో, ఎలా ఉంటుందో మనిషికే అర్థం కాకుండా ఉంటుంది.

తిరిగితే దేహం అలసి పోతుంది. కాని, మనస్సు అలసట తెలియకుండా ఎంత కాలమైనా తిరుగుతుంది. ఎన్ని చోట్లకైనా పోతుంది. కాని ఒకచోట ఉండదు. ఉండలేదు. అది ఎక్కడైనా తిరుగుతుంది కనుక, ఎక్కడుందో అర్థం కాదు. మనస్సు మనిషికి సంబంధించిందే అయినా, మనిషిలో ఉండేదే అయినా, మనిషి ఉన్నచోట మనస్సు ఉండదు. అందుకనే, 'నా మనస్సు మనస్సులో లేదు' అనే విచిత్రమైన వాక్యాన్ని చాలా మంది అంటూ ఉండటము మనము వింటూ ఉంటాము.

ఎక్కడున్నావు? నేను చెప్పే విషయం వినేవాడి మనస్సుకు ఎక్కలేదని మనకు అర్థమై నపుడు, 'ఎక్కడున్నావు? నేను మనం చెప్పే విషయం వినేవాడి మనస్సుకు ఎక్కలేదని మనకు అర్థమై నపుడు' —

మనం చెప్పే విషయం వినేవాడి మనస్సుకు ఎక్కలేదని మనకు అర్థమై నపుడు, 'ఎక్కడున్నావు? నేను చెప్పింది తల కెక్కిందా?' అంటూ ఉంటాము. ఎందుకని? ఎదురుగా ఉండి వింటున్న మనిషిలో వినే మనస్సు లేదని మనకు అర్థమవుతూ ఉంది కనుక.

మనస్సు పాదరసం లాంటిది. నిలవకుండా జారిపోతూ ఉంటుంది. ఎవరి మనస్సును ఎవరు ఎక్కడ ఉంచుతారో చెప్పలేము. కొందరు సంసారంలో, కొందరు రాజకీయాలలో, కొందరు భోగ భాగ్యాలలో, కొందరు చలనచిత్రాలలో, కొందరు కళలలో - ఇలా ఎవరి కిష్టమైన చోట వారు ఉంచుతారు. కాని, భక్తుడు మాత్రం తన మనస్సును భగవంతుని యందే ఉంచుతాడు. మనస్సును ఉంచ దగిన పవిత్ర స్థానము పరమేశ్వరుని పద పంకజాలే నని భక్తునికి తెలుసు. మనస్సు లోని కలతలు, నలతలు కనుమరుగై, మనస్సు రమ్యంగా, రమణీయంగా మారేది భగవంతుని చరణ సన్నిధి లోనే అనే సత్యం భక్తునికి అనుభవ సిద్ధం.

మనస్సు ఎందుకని సదా చలిస్తూ, సర్వత్ర చరిస్తూ ఉంటుంది? దానికి ఏదో కావాలి. ఆ కావలసిన ప్రియ వస్తువు ఎక్కడ ఉందో, ఎక్కడ ప్రాప్తిస్తుందో తెలియని కారణంగా అది ఎక్కడెక్కడో తిరుగుతూ ఉంటుంది. మనస్సు దేనిని ఆశిస్తూ ఉందో, అది లభ్య మయ్యేది మహిలో కాదని, మహేశ్వరుని సన్నిధి లోనే అని అర్థమైన క్షణాన మనస్సును బాహ్యానికి పొమ్మన్నా పోదు. పోయినా, అక్కడ ఉండ లేదు. తిరిగి భగవంతుని సన్నిధికే





చేరుతుంది. ఇనుము అయస్కాంతము వైపునకు ఆకర్షింప బడినట్లు, మనస్సు మాధవుని వైపుకు ఆకర్షింప బడుతుంది. ఇనుము అయస్కాంతమును అంటి పెట్టుకున్నట్లు, మనస్సు పరమేశ్వరుని చరణ కమలాలను హత్తుకొని ఉంటుంది. భగవంతుని యందు మనస్సును ఉంచడము అంటే ఇదే.

మనస్సు ఎక్కడుంది? అనేది ముఖ్యం కాదు. మనస్సులో ఏముంది? అనేదే ప్రధానము. మనస్సులో ప్రపంచం ఉంటే, మనస్సు ప్రపంచం లోనే తిరుగుతుంది. మనస్సులో పరమాత్మ ఉంటే, మనస్సు పరమాత్మ సన్నిధి లోనే ఉంటుంది. ఈ విధంగా భగవంతుని యందు మనస్సు నుంచిన వాడే యోగి. ఉత్తమమైన యోగి.

భక్తియోగి విశ్వరూపోపాసనలో ఉంటాడు కనుక, అతనికి విశ్వమంతా విశ్వేశ్వరుడే. కనింది, వినింది, తలచింది, తాకింది ఏదైనా, అది దృశ్యమైనా, శబ్దమైనా, భావన అయినా, స్పర్శ అయినా అంతా భగవంతుడే. అన్నీ భగవంతుడే అని భావించడం చేత అన్నిటిలో భగవద్భావనే భక్తునికి ప్రధానంగా ఉంటుంది. భక్తుని మనస్సు పరమేశ్వరుని యందే ఉన్నందున, పరమేశ్వరుని కన్నా అన్యమైన విషయం భక్తుని బుద్ధిని తాకలేదు.

**శ్లో॥ విక్రేతు కామాకిల గోపకన్యా మురారి పాదార్పిత చిత్తవృత్తిః**
**దధ్యాదికమ్ మోహవశా దవోచత్ గోవింద! దామోదర! మాధవేతి ॥**

ఒక గోపిక పెరుగు, పాలు అమ్మడానికి మధురకు పోయింది. ఆమె మనస్సు మాత్రం శ్రీకృష్ణుని పాదపద్మముల యందే లగ్నమై ఉంది. బుద్ధి భగవంతుని యందే ఉండటం చేత, పాలో పాలు, పెరుగో పెరుగు అని అనడానికి బదులుగా, 'గోవిందా! గోవిందా!, మాధవా! మాధవా!' అని కేక లేస్తూ నగర వీధులలో తిరిగిందట.

గోపిక తల మీద పాలకుండ ఉన్నా, ఆమె తలలో, తలపులలో పాలకడలిలో పవ్వళించి యున్న పరమాత్మే ఉన్నాడు. అందుకే పాలు అనడానికి బదులుగా పరమేశ్వరుని పిలిచింది.

ఇనుమును అయస్కాంతము ఆకర్షించినట్లు, గోపిక మనస్సును గోపాలుడు అమాంతం ఆకర్షించాడు. అదే భక్తి వైశిష్ట్యము. సదా భగవంతుని యందే మనస్సు నుంచి, తదేక నిష్ఠులై, భక్తులు భగవంతున్నే స్మరిస్తూ ఉంటారు కనుక, భగవంతుడు వాళ్ళ మనస్సును ప్రపంచం వైపు వెళ్ళకుండా ఆకర్షిస్తూ ఉంటాడు. అందుకే ఆయన కృష్ణుడు. చిత్తచోరుడు.

**కర్షతి చిత్తమితి కృష్ణః** - చిత్తమును అమాంతం ఆకర్షిస్తాడు కనుక శ్రీకృష్ణుడు చిత్తచోరుడు. భక్తి హృదయాన్ని పరమాత్మ వెన్న లాగా దోచుకుంటాడు. భక్తి పూర్ణ రూపాన్ని ధరిస్తే, దాగుడు మూతలు మానేసి దొర లాగా కళ్ళ ముందే దర్శన మిస్తాడు. ఇదే విశ్వరూపోపాసన లోని వైభవము.

పల్లవి: **మల్లె కన్నా తెల్లనైన మనసు నా కుందిరా!**
**మనసు లేని స్వామి నా మనసు నేలరా!**

చరణము: **దొరవయసు దోచుకున్న దొంగ నీవు కావా!**
**దొంగ మనసు దాచిపెట్టి దొర లాగ రావా!** **॥ మల్లె కన్నా ॥**

అని చిత్తాన్ని చిత్తచోరునికి సమర్పించింది చైతన్య గీతిక.

**తదేక నిష్ఠత్వం**

పరమేశ్వరుని యందే మనస్సు నుంచిన భక్తులు తదేక నిష్ఠులై ఉంటారు. దైవ చింతనాపరులై ఉంటారు ***(సతత యుక్తాః)***. పూర్వాధ్యాయం లోని చరమ శ్లోకంలో తెలిపిన మత్కర్మకృత్త్వాది సాధనల యందు సతతము

నియతులై ఉంటారు *(సతత యుక్తాః, నిత్యయుక్తాః)*. అహోరాత్రాలు భగవత్సేవ యందే రమిస్తూ ఉంటారు.

ఈశ్వరార్పణ బుద్ధితో కర్మల నాచరిస్తూ, ఫలాలను ప్రసాదాలుగా స్వీకరిస్తూ **(మత్కర్మకృత్)**, ఒక జీవనది సముద్రమునే లక్ష్యంగా చేసుకొని ప్రవహించునట్లు, పరమేశ్వరునే లక్ష్యంగా భావిస్తూ **(మత్పరమః)**, నిరంతరము స్వామి సేవలో తరించే భృత్యుని లాగా ఆరాధనా భావంతో చరిస్తూ **(మద్భక్తః)**, విషయ ప్రపంచాన్ని మనస్సు లోకి రానివ్వకుండా ప్రవర్తిస్తూ *(సంగవర్జితః)*, సర్వ ప్రాణులను, ఉపకారు లైనా, అపకారు లైనా వైరబుద్ధి లేకుండా వీక్షిస్తూ *(నిర్వైర స్సర్వభూతేషు)*. శేష కాలాన్ని విశేషించి విశ్వరూపోపాసనలో గడిపే వారు సతత యుక్తులైన భక్తులు. కాలాన్నంతా పూర్ణంగా భగవత్సేవ లోనే వినియోగించే వారు సతతయుక్తు లైన భక్తులు. కర్మయోగులు.

కర్మయోగులైన ఈ సగుణ భక్తులు గృహస్థులు. గృహస్థ ధర్మాలను పాటించే వారు. వీరికి సంసార బరువులు, బాధ్యతలూ ఉంటాయి. వాటిని విస్మరించరు. ధర్మబద్ధంగా జీవిస్తూ, బాధ్యతలను నిర్వర్తిస్తూ ఉంటారు. అనురాగాలు, అభిస్నేహాలు లేకుండా ధర్మాచరణము వరకే పరిమితమై, మిగిలిన కాలాన్నంతా దైవ సేవ యందే వినియోగిస్తారు.

సంసారంలో ఉన్నా, వారిలో సంసారము లేకుండా జీవిస్తూ ఉంటారు. విభక్తము కాని, విభాగము లేని భక్తిని సాగిస్తూ ఉంటారు. సంసారంలో ఉండటం దోషం కాదు. సంసారము మనస్సులో ఉంటేనే దోషం. దోమలున్న చోట దోమతెర ఉండవచ్చు. కాని, దోమతెర లోకి దోమలు ప్రవేశించ కూడదు.

భక్తుడు సంసారంలో ఉంటాడు. భార్యాబిడ్డల మధ్యే ఉంటాడు. కానీ అతని మనస్సులో సంసారం ఉండదు. భార్యాబిడ్డలు, బంధుమిత్రాదులు ఉండరు. భగవంతు డొక్కడే ఉంటాడు. అదే తదేక నిష్ఠత్వం. సతత యుక్తత్వం. అట్టి దైవ చింతనా పరత్వంతో పరీక్షిన్మహారాజు శ్రద్ధతో భాగవతాన్ని శుకబ్రహ్మ వద్ద శ్రవణం చేయడం చేత, గృహస్థుడే అయినా భగవంతునిపై తదేకంగా మనస్సును లగ్నం చేయ గలిగాడు.

***సుతుల హితుల విడిచి, చుట్టాల విడిచి, యిల్లాలి విడిచి, బహుబలాళి విడిచి***
***రాజు హృదయ మిడియె రాజీవ నయనుపై, ధనము విడిచి, జడ్డు(దనము విడిచి !***

పరీక్షిన్మహారాజు బిడ్డల్ని త్యజించాడు. హితులను విడిచాడు. చుట్టాలను విస్మరించాడు. భార్యను పరిత్యజించాడు. బలగాన్నంతా వదిలేశాడు. ధనాన్ని, దానితో పాటు జడత్వాన్ని కూడా త్యజించి కమల నయనుడైన శ్రీకృష్ణునిపై మనస్సును నిలిపి తరించి పోయాడు అన్నది భాగవతము - ద్వితీయ స్కంధము.

## శ్రద్ధా పరాయణత్వం

పరమేశ్వరుని యందే మనస్సు నుంచి, నిరంతరము దైవ చింతనా పరులైన భక్తులు, శ్రద్ధాపరాయణులై భగవంతుని సేవిస్తూ ఉంటారు ***(శ్రద్ధయా పరయా ప్రకృష్టయా ఉపేతాః)***. ఇది సాధారణమైన శ్రద్ధ కాదు, పరాశ్రద్ధ. అంటే గొప్ప శ్రద్ధ అంటున్నాడు.

పరాశ్రద్ధ అంటే చెదరని శ్రద్ధ. చలించని శ్రద్ధ. శ్రద్ధ లేని విషయంలో బుద్ధి నిలవదు. శుద్ధి ఏర్పడదు. సిద్ధి లభించదు. అందుకనే ***శ్రద్ధావాన్ లభతే జ్ఞానం*** - శ్రద్ధ గలవాడే జ్ఞానమును పొందుతాడు అని గీతాచార్యుడు నాల్గవ అధ్యాయం లోనే తెలియ చేశాడు.

సగుణ ధ్యానమును భక్తితో అనుష్ఠించే సాధకుడు, ఉత్తమమైన శ్రద్ధ కలిగి ఉండాలి. శ్రద్ధతో కూడిన భక్తి ధ్యానాలు మోక్ష హేతువులని వేదవాణి వినిపిస్తూ ఉంది అన్నారు వివేక చూడామణిలో శ్రీ శంకరాచార్య స్వామి.





**శ్రద్ధా భక్తి ధ్యానయోగాత్ ముముక్షోః ముక్తేః హేతూన్ వక్తి సాక్షాత్ శ్రుతేర్గీః ।**

మోక్షమును కాంక్షించే వారికి శ్రద్ధా భక్తి ధ్యానాలే ప్రధాన హేతువులుగా వేదమాత చెబుతూ ఉంది అన్నారు.

***శ్రద్ధా భక్తి ధ్యాన యోగా దవైహి*** - శ్రద్ధా భక్తి ధ్యాన యోగాల ద్వారా పరాత్పరుని పొంది తరించ మని బ్రహ్మదేవుడు అశ్వలాయన మహర్షికి కైవల్యోపనిషత్తులో బోధించాడు. ప్రస్తుత శ్లోకంలో ఈ మూడే ప్రధాన విషయాలుగా చర్చింప బడ్డాయి. కనుక శ్రద్ధా భక్తి ధ్యాన యోగ తత్పరుడైన సాకారోపాసకుడు భగవంతుని తప్పక పొందుతాడు అని ప్రామాణికంగా ప్రబోధించడం జరిగింది.

ఇక్కడ శ్రద్ధ అంటే ప్రమాణ విషయంలో అకుంఠిత మైన విశ్వాసము అని అర్థము. శస్త్ర చికిత్స విషయంలో వైద్యునిపై ఎలాంటి విశ్వాసాన్ని ఉంచి రోగి దేహాన్ని అప్పగిస్తాడో, అలాగే ప్రమాణ విషయంలో శాస్త్ర విషయంపై, గురు వచనంపై అచంచలమైన శ్రద్ధ నుంచి యోగి తన మనస్సును సమర్పించాలి. అప్పుడే ప్రమాణం ఫలిస్తుంది.

ఈ విధంగా మనస్సును భగవంతుని యందు ఉంచి, తదేక నిష్ఠాపరులై, శ్రద్ధా పరాయణులై విశ్వరూపోపాసన సాగించే సగుణారాధకులు ఉత్తమ యోగులని పరమేశ్వరుడు నిర్ధారణ చేయడం జరిగింది ***(తే యుక్తతమాః మే మతాః అభిప్రేతాః)***.

దివారాత్రములు దైవము నందే మనస్సును లగ్నం చేసి జీవిస్తూ ఉంటారు కనుక వారు యుక్తతములు ***(నైరంతర్యేణ మచ్చిత్త తయా అహోరాత్రమ్ అతివాహయన్తి అతః యుక్తతమాః ఇతి వక్తుమ్)***.

మరి, వీరు ఉత్తమ యోగులైతే, నిర్గుణారాధకుల మాటేమిటి? వారిని గూర్చి సంక్షిప్తంగా రెండు శ్లోకాలలో చెబుతున్నాడు.

**యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే ।**
**సర్వత్రగ మచిన్త్యం చ కూటస్థ మచలం ధ్రువమ్ ॥** 3
**సంనియ మ్యేన్ద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః ।**
**తే ప్రాప్నువన్తి మామేవ సర్వభూతహితే రతాః ॥** 4

**యే-తు-అక్షరం-అనిర్దేశ్యం-అవ్యక్తం-పర్యుపాసతే**
**సర్వత్రగం-అచింత్యం-చ-కూటస్థం-అచలం-ధ్రువం**
**సంనియమ్య-ఇంద్రియగ్రామం-సర్వత్ర-సమబుద్ధయః**
**తే-ప్రాప్నువంతి-మాం-ఏవ-సర్వభూతహితేః-రతాః**

| | | | |
|---|---|---|---|
| యే తు | = ఎవరయితే | రతాః | = రమించువారై |
| ఇంద్రియగ్రామం | = సర్వేంద్రియములను | అనిర్దేశ్యం | = నిర్వచించుటకు వీలు లేనిది |
| సంనియమ్య | = నియమించి | అవ్యక్తం | = వ్యక్తము గాని |
| సర్వత్ర | = అంతటను | సర్వత్రగం | = అంతటా వ్యాపించినది |
| సమబుద్ధయః | = సమబుద్ధి గలవారై | అచింత్యం | = చింతించుటకు వీలు కానిది |
| సర్వభూతహితే | = సర్వభూతముల క్షేమము నందు | అచలం | = స్థిరమైనది |

| | | | | | |
|---|---|---|---|---|---|
| ధ్రువం | = | నిత్యమైనది | తే | = | వారు |
| కూటస్థం చ | = | కూటస్థము నైన | మాం ఏవ | = | నన్నే |
| అక్షరం | = | క్షరము గాని బ్రహ్మమును | ప్రాప్నువంతి | = | పొందుతారు |
| పర్యుపాసతే | = | ఉపాసిస్తున్నారో | | | |

**అక్షరోపాసకులు అనిర్దేశ్యము, అవ్యక్తము, సర్వగతము, అచింత్యము, కూటస్థము, అచలము, ధృవము అయిన పరమాత్మను సేవిస్తారు.**

**ఇంద్రియ సమూహాన్ని చక్కగా నిగ్రహించి, అంతటా సమబుద్ధి కలవారై, సర్వభూత హితము నందు ఆసక్తులైన అక్షరోపాసకులు నన్నే పొందుతారు.**

**వ్యాఖ్య**

**వ్యక్తావ్యక్తములు**

ప్రపంచము దృశ్యము. పరమాత్మ అదృశ్యము. దృశ్యమైన ప్రపంచము రూపము, అనిత్యము, క్షరము. అదృశ్యమైన పరమాత్మ స్వరూపము నిత్యము, అక్షరము. వ్యక్తమయ్యే ప్రపంచ రూపానికి అవ్యక్తమైన పరమాత్మ స్వరూపమే ఆధారము. అవ్యక్తమైన పరమాత్మ యొక్క రూపమే వ్యక్తమైన ఈ ప్రపంచము. స్వరూపము ఉంటేనే రూపం ఉంటుంది. రూపం లేకపోయినా స్వరూపం ఉంటుంది.

రూపము సాకారము, సగుణము. స్వరూపము నిరాకారము, నిర్గుణము. సాకారము, నిరాకారము రెండూ పరమాత్మ రూప స్వరూపాలే కనుక, రెండూ ఉపాసనా యోగ్యములే. సాకారమును ఉపాసించే వారు సగుణోపాసకులు, లేదా సవిశేష బ్రహ్మోపాసకులు. నిరాకారమును సేవించే వారు అవ్యక్తోపాసకులు, లేదా నిర్విశేష బ్రహ్మోపాసకులు.

విశ్వరూపుని ధ్యేయంగా పెట్టుకొని సతతయుక్తులై ఉపాసించే సగుణారాధకులు ఉత్తమ యోగులని రెండవ శ్లోకంలో భగవంతుడు ప్రకటించాడు *(యుక్త తమాః)*. అలాంటప్పుడు ఇతరులు, అనగా రెండవ వారైన అక్షరోపాసకులు యుక్తతములు కారా? *(కిమ్ ఇతరే యుక్తతమాః న భవన్తి?)*. అలా కాదు *(న)*. వాళ్ళను గూర్చి ఏమి చెప్పాలో, ఎలా చెప్పాలో భగవంతుడు వరుసగా ఈ రెండు శ్లోకాలలో వినిపిస్తున్నాడు *(కింతు తాన్ ప్రతి యద్వక్తవ్యం తత్ శృణు)*.

మూడవ శ్లోకంలో అక్షరోపాసకులు సేవించే నిర్విశేష బ్రహ్మము యొక్క ఏడు విశేషణాలను వినిపించి, నాల్గవ శ్లోకంలో జ్ఞానుల, లేదా సన్యాసుల యొక్క జీవన శైలిని, జ్ఞాన నిష్ఠా వైభవమును వివరించి, వారు పొందే ఫలాన్ని కూడా తెలియ జేస్తున్నాడు. రెండు శ్లోకాలకు ఏకాన్వయం ఉంది.

భక్తులను నిర్గుణోపాసకులైన జ్ఞానులను వేరు చేస్తూ

***యే తు*** అని శ్లోకారంభం లోనే సగుణారాధకులైన భక్తులను నిర్గుణోపాసకులైన జ్ఞానులను వేరు చేస్తూ ఉపాస్య విషయం లోను, ధ్యాన విషయము, అంటే సాధన విషయం లోను, అలాగే సాధన యొక్క ఫల విశేషము లోను విలక్షణత్వము ఉండటమే ఈ **తు** శబ్ద ప్రయోగ హేతువు.

భక్తి జ్ఞానాలకు, సగుణ నిర్గుణాలకు వైలక్షణ్యమును సూచించుటకు **తు** శబ్దమును ప్రయోగించడం జరిగింది.

ధ్యేయ విషయము, అంటే

పరమాత్మ నశించే వాడు కానందున ఆయన అక్షరము *(న క్షరతీతి అక్షరః)*. అక్షరము అంటే మార్పు లేని వాడు లేక కూటస్థుడు అని కూడా అర్థము *(కూటస్థః అక్షరమ్)*. కార్యరూపంలో గోచరిస్తున్న ప్రపంచము పరిణామ శీలము కనుక క్షరము. కార్యమైన ప్రపంచానికి కారణమైన పరమాత్మ పరిపూర్ణము కనుక అక్షరము. అట్టి అక్షర రూపుడైన పరమాత్మను ఉపాసించడానికి అక్షర బ్రహ్మము యొక్క ఏడు విశేషణాలను సాధనలుగా





భగవంతుడు అందిస్తున్నాడు **(అక్షరస్య విశేషణం ఆహ)**. ఆ ఏడు విశేషణాలను సంక్షిప్తంగా చెప్పుకుందాం.

**అనిర్దేశ్యం**

ప్రపంచం వ్యక్తం కనుక దానికి రూపం ఉంది. విశ్వరూపాన్ని, లేదా విశ్వం లోని రూపాలను ఇది - అది అని చెప్పవచ్చు. రూప నామాలతో నిర్దేశించ వచ్చు. కనుక విశ్వము నిర్దేశ్యము.

పరమాత్మ అవ్యక్తము కనుక ఆయనది అరూపం. స్వరూపం. వ్యక్తం కాని అరూపాన్ని ఎలా నిర్వచించాలి? ఇది - అది అని నిర్దేశించుటకు శక్యం కాదు కనుక పరమాత్మ యొక్క అవ్యక్త స్వరూపము అనిర్దేశ్యము ***('ఇదం - తత్' ఇతి నిర్దేష్టుం య న్న శక్యతే తత్ అనిర్దేశ్యం)***.

**అవ్యక్తం**

ఏది వ్యక్త మవుతుందో అది ప్రత్యక్షాది ప్రమాణాలకు అందుతుంది. రూపాలు కళ్ళకు అందితే, శబ్దాలు చెవులకు అందుతాయి. అక్షర పరబ్రహ్మము వ్యక్తమయ్యేది కానందున అది ఏ ప్రమాణాలకు అందదు. అందుచేత అవ్యక్తమైంది **(న కేనాపి ప్రమాణేన వ్యజ్యతే ఇతి అవ్యక్తమ్)**.

ఒకడు మన ముందు ఉన్నాడు అంటే, వ్యక్త మయ్యాడు అని అర్థం. కనుక అతడు వ్యక్తి. వ్యక్తి కనిపిస్తూ ఉన్నాడు అంటే, అతడు వ్యక్తమై ఉన్నాడు కాబట్టి, **అయం ఈదృశ ఏవ -** 'ఇతడు ఇలా ఉన్నాడు' అని చెప్పగలం. వ్యక్తం కాని అవ్యక్తాన్ని ఎలా నిర్వచించగలం? వ్యక్తం కావడం లేదు అంటే, ఇంద్రియ మనోబుద్ధులకు వ్యక్తం కావడం లేదు అని అర్థం. ప్రత్యక్షాది ప్రమాణాలకు అందుబాటులో లేదు అని భావము. అందుకే అవ్యక్తమైన అక్షర పరబ్రహ్మము అనిర్దేశ్య మైంది.

**సర్వత్రగం**

సర్వత్ర వ్యాపించి ఉన్న దానిని సర్వత్రగం అంటారు. అంటే, అంతటా ఉండేది **(సర్వత్ర గచ్ఛతి ఇతి)**. ఎలా? ఆకాశం లాగా అంతటా వ్యాపించి ఉండేది **(వ్యోమవత్ వ్యాపి, గగన సదృశమ్)**. సమస్తానికి అవకాశాన్నిచ్చేది ఆకాశము. ఆకాశము అంతటా ఉంది కనుక, ఉన్న వన్నీ ఆకాశం లోనే ఉన్నాయి.

మట్టికుండకు మట్టి కారణము. కార్యమైన మట్టికుండలో మట్టి ఎక్కడుంది అంటే ఏం చెప్పగలం? మట్టికుండలో మట్టి లేని దెక్కడ? అంతటా ఉంది. కారణమైన మట్టి కార్యమైన మట్టికుండలో అంతటా ఉంది. సర్వత్ర ఉంది.

వ్యక్తమైన విశ్వానికి విశ్వనాథుడే అభిన్న నిమిత్త ఉపాదాన కారణం అయి ఉన్నందున, విశ్వమంతా విశ్వనాథుడే వ్యాపించి ఉన్నాడు. అవ్యక్త స్వరూపమే కారణత్వం వల్ల కార్యమంతా వ్యాపించి సర్వత్రగంగా శోభిస్తూ ఉంది **(కారణత్వేన వ్యాప్తత్వాత్ సర్వత్ర)**.

**అచింత్యం**

చింతించడానికి వీలు కానిది అచింత్యము. ఏది ఇంద్రియాలకు అందుతుందో దానినే మనస్సుతో ఆలోచించగలం ***(యత్ కరణ గోచరం తత్ మనసాఽపి చింత్యం)***. అక్షర పరబ్రహ్మము ఇంద్రియాలకు గోచరం కాదు అని ఇప్పటికే తెలుసుకొని ఉన్నాము. ఇంద్రియాలకు అగోచరం కనుక దానిని మనస్సు చేత చింతించడానికి వీలు పడదు ***(అచింత్యం సర్వ ప్రమాణ అగోచరత్వాత్)***. చింతించే వాని స్వరూపమే అక్షరుడు కనుక, చింతించడానికి సాధ్య పడడు.

**కూటస్థం**

కూటస్థం అనే విశేషణమును రెండు విధాలుగా అర్థం చేసుకోవచ్చు. ***కూటః*** అంటే మోసము, వంచన లేదా మిథ్య అనే అర్థా లున్నాయి. ఇది మొదటి దృక్కోణం. బాహ్యాభ్యంతరాలలో ఏకంగా ఉండనిది, ఉండలేనిది మోసము లేదా వంచన. అంటే బాహ్యానికి గుణముగా తెలుస్తూ, ఆంతర్యంలో దోషమై ఉండేది కూటం ***(దృశ్యమాన గుణమ్ అన్తర్దోషం వస్తు కూటం, కూట రూపం, కూట సాక్ష్యం ఇత్యాదౌ కూట శబ్దః ప్రసిద్ధః లోకే).*** కనుకనే మోసాన్ని కూటరూపం అంటారు. తప్పుడు సాక్ష్యాన్ని కూట సాక్ష్యం అని ప్రముఖంగా చెప్పుకుంటారు.

కూటము అంటే మాయ అని అర్థం. మాయ వంచిస్తుంది. మోసం చేస్తుంది. అందుకే అది కూట రూపం. కూటరూపంలో ఉంటుంది ***(కూట రూపేణ తిష్ఠతి ఇతి).*** అవ్యక్త రూపంగా ఉన్నప్పుడు మాయ అక్షర పరబ్రహ్మమునకు కారణోపాధిగా, అక్షరోపాధిగా ఉంటుంది. వ్యక్త మైనపుడు బ్రహ్మమునకు కార్యోపాధిగా, క్షరోపాధిగా ఉంటుంది. ఉపాధి ఏదైనా బ్రహ్మానికి వేరుగా ఉండ లేదు. కనుక మాయ బ్రహ్మమునే ఆశ్రయించుకొని ఉంటుంది. కూటమైన మాయకు అధ్యక్షుడై, ఆధారుడై ఉన్నందున, అక్షర పరబ్రహ్మము కూటస్థ మని చెప్ప బడింది. కూటస్థుడైన పరబ్రహ్మమును ఆశ్రయించిన వారు కూట రూపమైన మాయను దాటుతారు *(7 - 14).*

ఇక రెండవ అర్థం, కూట మంటే దాగలి. ఇనుప పనిముట్లు, బంగారు ఆభరణాలు తయారు చేసే వారి వద్ద, అగ్నిలో కాల్చిన లోహ ఖండాలను కొట్టి సాగదీసేందుకు అనువుగా ఒక ఇనుప ముద్ద ఉంటుంది. దానినే దాగలి అంటారు. అదే కూట మంటే. ఈ దాగలిని ఆధారం చేసుకొని లోహాలను అనేక రూపాలుగా తీర్చి దిద్దుతూ ఉంటారు. అలా మారే రూపాలకు కారణమైన దాగలి తాను మారకుండా స్థిరంగా ఉంటుంది. అలాగే, నానా రూపనామాలతో వ్యక్తమై, పరిణామం చెందే ఈ విశ్వానికి తాను ఆధారమే అయినా, తనలో ఏ విధమైన మార్పు లేకుండా భాసిస్తున్నందున అక్షర పరబ్రహ్మము కూటస్థ మని చెప్ప బడింది. అందుకే అది అచలము.

**అచలమ్**

అచలము అంటే చలనము లేనిది ***(న చలతి ఇతి అచలః).*** అక్షరము స్వరూప చలనము లేనిది ***(స్వరూపాత్ చలనం న విద్యతే).*** తన సామర్థ్యము నుండి చలించదు ***(సామర్థ్యాత్ న చలతి).*** జ్ఞానపరంగా చూచినా చలన మెరుగదు కనుక అది అచలము. సర్వత్రగమును ముందే అర్థం చేసుకున్నాం కనుక, అంతటా ఉండేది ఎలా చలిస్తుంది? ఎందులో చలిస్తుంది? చలించి ఎక్కడికి చేరుతుంది? ఆదిలాబాద్ ఆకాశము కదిలి వెళ్ళి అహమ్మదాబాద్‌కు చేరినట్లే ఉంటుంది. ఈ విధంగా అచలం కనుకనే అక్షర పరబ్రహ్మము స్థిరమై ఉంది. నిత్యమై ఉంది. ధ్రువమై ఉంది.

**ధ్రువమ్**

ధ్రువము అంటే స్థిరము, నిత్యము అని అర్థము. ఏది అచలమో అది స్థిరమే కదా! ధ్రువమే కదా! ***(యస్మాత్ అచలం తస్మాత్ ధ్రువమ్ ఇత్యర్థః).*** తనలో ఏ మార్పు లేనందున పరబ్రహ్మము ధ్రువము. అక్షరము అంటే నశించనిది అని అర్థం చేసుకున్నాము కదా! ఆ నశించనిదే, నాశ మెరుగనిదే ధ్రువము ***(అవినాశిత్వాత్ ధ్రువః).*** నిర్వికార చైతన్యము.

ఈ విధంగా అక్షర రూపుడైన పరమాత్మకు సంబంధించిన ఏడు లక్షణాలను నిదిధ్యాసనం చేస్తూ ఆత్మ స్వరూపాన్ని అనుసంధానం చేయడమే అవ్యక్తోపాసన. భక్తులు ధ్యానించే విశ్వరూపోపాసన కన్నా విలక్షణ మైనది. అక్షరోపాసన అనే నిరాకారోపాసనను, లేదా నిర్గుణోపాసనను ఏడు విశేషణాలతో చెప్పుకున్నాం. ఇవన్నీ





వాస్తవానికి అర్థం చేసుకోవలసినవే గాని ఉపాసనలు కావు. నిర్గుణ భక్తుడైన జ్ఞాని విషయంలో ఉపాసన అనేది కేవలం ఔపచారికమే.

ఇక అక్షరోపాసకుని జీవన శైలి ఎలా ఉంటుంది? శీల సంపద ఎలా ఉండాలి? జ్ఞాన నిష్ఠా వైభవము ప్రవర్తనములో ఎలా ప్రతిఫలిస్తుంది అనే విషయాన్ని నాల్గవ శ్లోకంలో మూడు విషయాలలో వివరిస్తున్నాడు. అవి (1) ఇంద్రియ సమూహాన్ని చక్కగా అదుపులో ఉంచుకోవడము (2) అంతటా సమబుద్ధి కలిగి ఉండటము (3) సర్వ భూతములకు హితము చేయుట యందు ఆసక్తి కలిగి ఉండటము.

ఈ మూడు లక్షణాలను సంపూర్ణంగా పొంది, ఇప్పటి వరకు మనం చెప్పుకున్న అక్షర స్వరూపము యొక్క ఏడు విశేషణాలను అనుసంధానం చేసుకుంటూ జీవనయాత్రను సాగించే అవ్యక్తోపాసకులు, పరమేశ్వరుణ్ణే పొంది తరిస్తారు. ఇదే అవ్యక్తోపాసనకు ప్రాప్తించే అమృతఫలం. ఇక ఇప్పుడు, అక్షరోపాసకునికి అర్హతలుగా, లక్షణాలుగా శోభిస్తున్న మూడు విషయాలను ముచ్చటగా, సంక్షేపంగా చెప్పుకుందాం.

**ఇంద్రియ నిగ్రహము**

***ఇంద్రియ గ్రామమ్*** అంటే ఇంద్రియ సముదాయము. జ్ఞానేంద్రియ కర్మేంద్రియ సమూహము. ఇంద్రియా లన్నిటినీ అవ్యక్తోపాసకుడు అదుపులో ఉంచుకొని ఉంటాడు. ఇక్కడ **నియమ్య** అనకుండా, **సంనియమ్య** అనడం జరిగింది. అంటే ఇంద్రియాలను చక్కగా నియమించి ఉంటాడు అని అర్థము ***(సంనియమ్య సమ్యక్ నియమ్య, ఇంద్రియ గ్రామమ్ ఇంద్రియ సముదాయం).***

అక్షరోపాసనలో ఇంద్రియ నిగ్రహము అనేది ప్రముఖమైన సాధన. ఇంద్రియాలు చలిస్తే మనస్సు చలిస్తుంది. నిదిధ్యాసనం భంగ మవుతుంది. అవరోధాలతో అడ్డగింపబడి సాధన సాగకుండా ఆగుతుంది.

ఇంద్రియాలను గుఱ్ఱాలుగా, ఇంద్రియ విషయాలను మార్గముగా వర్ణించింది ఉపనిషత్తు ***(ఇంద్రియాణి హయానాహుః విషయాం స్తేషు గోచరాన్).*** గుఱ్ఱాలను రథానికి పూన్చితే అవి రథాన్ని లాగుతాయి. రథానికి స్వతహాగా చలన శక్తి లేదు. గుఱ్ఱాలు లాగితేనే రథం కదుల్తుంది.

శరీరం కూడా రథం లాంటిది ***(శరీరం రథం).*** రథాన్ని గుఱ్ఱాలు లాగినట్లు, శరీరాన్ని ఇంద్రియాలు ఈడుస్తాయి. విషయ ప్రపంచమనే రహదారి లోకి లాగుతాయి. పట్టు తప్పిన గుఱ్ఱాలు రథాన్ని పెడదారి పట్టించినట్లు, నిగ్రహింప బడని ఇంద్రియాలు జీవన రథాన్ని దారి తప్పిస్తాయి. దగా చేస్తాయి.

గుఱ్ఱాలను అదుపు చేయకుండా గమ్యాన్ని చేరడం ఎలా దుస్సాధ్యమో, ఇంద్రియాలను నిగ్రహించకుండా జీవుడు గమ్యాన్ని చేరడము కూడా అలాగే దుస్సాధ్యము. దుర్లభము.

***ఇంద్రియ నిగ్రహం ఋతే న కశ్చిత్ తరతి అనృతమ్*** - ఇంద్రియ నిగ్రహం లేకుండా, ఎవరు కూడా మిథ్యా రూపమైన సంసార సాగరాన్ని దాటలేరు అన్నారు ప్రబోధ సుధాకరంలో శ్రీ శంకరాచార్యస్వామి.

**ఆఖ్యాయిక**

పూర్వం ఒక రాజు గారు తన కొలువు లోని పండితుల బుద్ధిని పరీక్షించాలని సంకల్పించి వారికి ఒక పరీక్ష పెట్టాడు. ఆ పరీక్షలో నెగ్గిన వారికి విలువైన ప్రశస్త మణిహారమును బహూకరించడం జరుగుతుందని కూడా ప్రకటించాడు.

పరీక్ష యొక్క పూర్వాపరాలను మంత్రిగారు సభ లోని పండితులకు ఈ విధంగా వివరించి చెప్పాడు. కొలువు కూటములో ఒక మేకను ప్రవేశ పెడతారు. దానిని తృప్తిగా మేపాలి. మేతను సంస్థానమే సమకూర్చుతుంది.

మేత పెట్టి, మేకను తృప్తి పరచి, ఏలే వారిని మెప్పించడమే పోటీలో పాల్గొనే వారు చేయవలసిన పని. ఎవరు మేకను తృప్తి పరిస్తే వారికి అమూల్యమైన రత్నహారము లభిస్తుంది.

మరునాడు పోటీ ప్రదర్శనము ఆరంభమైంది. మేకను పూలమాలతో అలంకరించి కొలువులో ప్రవేశ పెట్టారు. ప్రథమంగా ఒక పండిత శ్రేష్ఠుడు ముందు కొచ్చి, పచ్చి గ్రాసమును, మేతను మేక ముందు వేశాడు. అది శుభ్రంగా మేసింది. ఉదయం నుండి సాయంత్రం వరకు అతడు మేత వేస్తూనే ఉన్నాడు. అది మేస్తూనే ఉంది. పొట్ట పెద్ద బానలా బిఱ్ఱుగా తయారైంది. అయినా, పచ్చగడ్డి వేయగానే మేక మూతి పెడుతూనే ఉంది. చీకటి పడింది. పండితుడు ఓడిపోయాడు. ప్రదర్శనము మరునాటికి వాయిదా పడింది.

రెండవ రోజు మరొక పండితుడు, మూడవ రోజు, నాల్గవ రోజు - ఇలా తొమ్మిది రోజులు గడిచాయి. తొమ్మిది మంది పండితులు విఫల ప్రయత్నాలు చేశారు.

పదకొండవ రోజు పోటీలో పాల్గొనిన వ్యక్తి, పూర్వం పోటీలో పాల్గొనిన పండితుల లాగా మేతను ఎక్కువగా మోసుకు రాలేదు. కొద్ది గ్రాసమును మాత్రమే చేతిలో పట్టుకొని కొలువు లోకి ప్రవేశించాడు. ఆ గ్రాసమును మేక ముందు పడేశాడు. మేక యథా ప్రకారం తల వంచి తినడానికి మూతి ముందుకు చాచింది. అంతే. ఆ వ్యక్తి తన నడుముకు కట్టుకొని ఉన్న కొరడాను తీసి మేకపై ఛడేలు మనిపించాడు. తినడానికి ముందు కెళ్ళిన మేక ఉలిక్కి పడి వెనక్కి తగ్గింది.

కొన్ని నిముషాలు ఆగి, మళ్ళీ తినడానికి ముందు కొచ్చింది. మేత దగ్గరకు మూతి వచ్చినప్పుడల్లా మేక వీపు ఛడేలు మంటోంది. సాయంత్రం వరకు ఇదే వడ్డింపు. సాయంత్రం రాజు గారు వచ్చారు.

మహారాజా! ఈ మేకను నేను తృప్తిగా మేపినాను. నాకు బహుమానం ఇప్పించండి అన్నాడా వ్యక్తి. ఇంతవరకు జరిగిన ప్రదర్శనలలో చివరిగా రాజు గారు రావడము, తన చేతితో కొంత పచ్చి గ్రాసమును మేక ముందు వేయడము, అది ఆరగించడము, పోటీదారుడు ఓడిపోయినట్లు ప్రకటించడము జరుగుతూ వచ్చింది.

అలాగే, ఈ రోజు కూడా రాజు గారు మేక ముందు కొంత మేతను పడేయడం జరిగింది. మేక మెల్లగా ఆ మేతను సమీపించి, తినడానికి మూతిని ముందుకు చాచింది. తీరా తినేస్తుందని రాజు గారు భావిస్తూ ఉండగా, అది తినకుండా వెనక్కి తిరిగి వచ్చేసింది. రాజు గారు ఆశ్చర్య పోయాడు. మేకను ఇతడే తృప్తిగా మేప గలిగాడు అని నిర్ణయించి, అతనికి అమూల్య రత్నహారాన్ని బహూకరించాడు.

పెట్టినంత వరకు, ఎంత పెట్టినా తృప్తి లేకుండా మేక తింటూనే ఉండింది. కొట్టడం మొదలెట్ట గానే తినడం కట్టి పెట్టింది. ఇంద్రియాలు కూడా అంతే. పైగా, ఇవి మేకలు కావు, గుఱ్ఱాలు. శక్తివంత మైనవి. మేకల లాగా తల వంచుకొని పడి ఉండేవి కావు. అవసరమైతే తిరగబడి విజృంభిస్తాయి కూడా.

నివేదిస్తూ ఉంటే ఇంద్రియాలు నీల్గుతూనే ఉంటాయి. నిగ్రహించి నపుడే బుద్ధిగా దారి లోకి వస్తాయి. ఇంద్రియాలు ప్రమథన శీలాలు. ఆదమరిస్తే చాలు. అమాంతం హరిస్తాయి. సంక్షోభాన్ని సృష్టిస్తాయి. మనస్సు ఉపాసనలో ఉన్నా, దానిని ఇంద్రియాలు చలింప చేసి, బలవంతంగా బాహ్య ప్రపంచం లోకి ఈడుస్తాయి. విషయాల మధ్య పడేస్తాయి.

***ఇంద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః*** - అర్జునా! క్షోభింప చేసే ఇంద్రియాలు మనస్సును బలవంతంగా బాహ్యానికి ఈడ్చుకొని పోతాయి అని భగవంతుడు రెండవ అధ్యాయంలో చెప్పే ఉన్నాడు. కనుక, ఉపాసకుడు ఇంద్రియాలకు వశ పడకుండా, వాటిని వశం చేసుకొని తన అదుపులో ఉంచుకోవాలి.





## సర్వత్ర సమదర్శనం

సమమైన బుద్ధి కలిగి ఉండటమే సమదర్శనము. అవ్యక్తోపాసకుడు అంతట సమబుద్ధి కలిగి ఉంటాడు. సర్వత్ర సమత్వమే అతనికి దర్శనీయంగా ఉంటుంది. అన్ని కాలాలలో, అన్ని సమయాలలో ఉపాసకుని బుద్ధి సమం గానే వ్యవహరిస్తూ ఉంటుంది **(సర్వత్ర సర్వస్మిన్ కాలే సమబుద్ధయః).**

ఇక్కడ **సర్వత్ర** అంటే అన్ని కాలాలలో అనే గాక, అన్ని పరిస్థితులలో కూడా అని అర్థం చేసుకోవాలి. అనుకూల పరిస్థితులలో బుద్ధి సమంగా ఉండొచ్చు. కాని, విషమ పరిస్థితులలో కూడా స్థిరత్వం కోల్పోకుండా సమంగా ఉండాలి.

ఇష్ట మైనవి ప్రాప్తించి నపుడు బుద్ధి అస్థిరతకు లోను కాదు. కాని, అనిష్టాలు, అరిష్టాలు సంభవించి నపుడు కూడా సంతాపం లేకుండా సమస్థితిలో ఉండాలి **(ఇష్టా నిష్టా దౌ తే సమబుద్ధయః).**

ఇది సాధ్యమేనా? అని మనకు అనిపించవచ్చు. అలా అనిపించడంలో ఆశ్చర్య మేమీ లేదు. రాగద్వేషాల మధ్య ఊగిస లాడే వారికి సమవర్తనము సాధ్య పడదు. రాగద్వేషాలను తటస్థ పరచిన పుణ్యాత్ములకు సమబుద్ధి సహజం గానే ఉంటుంది.

అవ్యక్తోపాసకులు సన్యాసులు, లేదా జ్ఞానయోగులు. వీరు కర్మయోగంలో శుద్ధిపడిన వారు. రాగద్వేషా లనే మల దోషమును కర్మయోగ సాధనలో కడిగేసుకున్న వారు. కనుకనే, జ్ఞాననిష్ఠలో సమబుద్ధితో శోభిస్తారు.

విషం పాము కోరల్లోనే ఉంటుంది. కోరలు తీసేస్తే పాము నిరపాయ మవుతుంది. విషమత్వ మనేది కూడా విశ్వంలో లేదు. దృశ్యాలలో లేదు. విషయాలలో లేదు. కేవలం మన రాగద్వేషాల లోనే ఉంది. కోరలు తీసిన పాము ఎలా కాటు వేయలేదో, వేసినా విషాన్ని ఎలా చిమ్మలేదో, అలాగే రాగద్వేషాలు లేని బుద్ధిలో విషమత్వం ఉండదు. అంతా సమత్వమే ఉంటుంది. సమబుద్ధికి సర్వత్ర సమదర్శనమే జరుగుతుంది.

## సర్వభూత హితం

ఇంద్రియాలను చక్కగా నిగ్రహించి, సర్వత్ర సమబుద్ధి కలిగిన అవ్యక్తోపాసకుడు సర్వభూత హితము నందు ఆసక్తి కలిగి ఉంటాడు. సర్వభూత సంక్షేమము నందు రమిస్తూ ఉంటాడు.

ఇక్కడ **భూతహితం** అనకుండా **సర్వభూత హితం** అనడంలో ఔచిత్యాన్ని అవశ్యం గుర్తించాలి. కొందరికి కొందరు మనుషు లంటే ఇష్టం కావచ్చు. అలాగే కొన్ని ప్రాణులను కొందరు ఇష్ట పడవచ్చు. కోడళ్ళ మీద ద్వేషంతో దూరంగా వెళ్ళి, రాగంతో అక్కడ కోళ్ళను పెంచవచ్చు. రాగద్వేషాలు రాజ్యమేలే హృదయంలో ఎవరో కొందరిపై ప్రేమ ఉండే అవకాశం లేక పోలేదు.

కొన్నిటిని, లేదా కొందరిని ప్రేమించడానికి రాగద్వేషాలు సరిపోతాయి. అందరినీ ప్రేమించాలి, అన్నిటినీ ప్రేమించాలి, సర్వహితాన్ని కాంక్షించాలి అంటే మాత్రం, అది రాగద్వేషాల పరిధిలో సాధ్యపడే పని కాదు. జ్ఞానం కలిగి నపుడే సర్వభూత ప్రేమ ఆవిర్భవిస్తుంది. సర్వము అనేది భిన్నత్వం కాకుండా, ఏకత్వంగా అర్థ మవుతుంది కనుక సర్వ ప్రేమ ఆవిష్కృత మౌతుంది. విశ్వప్రేమ విరజిమ్మ బడుతుంది.

సర్వమును ఏకంగా దర్శిస్తేనే సర్వ ప్రేమ సాధ్య మవుతుంది. సర్వాత్మ భావనలో తన స్వరూపమే సాక్షాత్కృత మవుతుంది. **సర్వాత్మకోஉహం** అనే ఆత్మదర్శనంలో సర్వభూత హితాసక్తి సహజం గానే పరిమళిస్తుంది.

ప్రస్తుతం మనం అర్థం చేసుకుంటున్నది అవ్యక్తోపాసనలో అలరిస్తున్న జ్ఞానయోగిని గూర్చి అనే విషయాన్ని విస్మరించ కూడదు. జ్ఞానయోగి ఎవరో కాదు సన్యాసియే అని మనకు తెలుసు.

సమస్తమును త్యాగం చేసి, సర్వ కర్మలను పరిత్యజించి, సన్యాసమును స్వీకరించే పవిత్ర కాలం లోనే, ***అభయం సర్వ భూతేభ్య మత్తః స్వాహా*** అనే మహత్తరమైన వాక్యాన్ని సర్వసంగ పరిత్యాగి యైన సన్యాసి పలుకుతాడు అన్నది శ్రుతిమాత. ***అభయం సర్వభూతేభ్యో దత్వా సన్న్యాస మాచరేత్*** - సర్వభూతములకు తన వలన ఏ ప్రమాదము జరగదని భూత ప్రపంచానికి అభయ మనే దక్షిణను సమర్పించిన త్యాగపురుషుడు సన్యాసమును స్వీకరిస్తాడు అన్నది స్మృతి.

కనుక, సర్వత్ర తన ఆత్మనే దర్శిస్తాడు కనుక సన్యాసి సర్వ ప్రాణులకు నిర్హేతుకంగా మేలు తల పెడతాడు. ఎవరినీ బాధించ లేడు. హింసించ లేడు. ఆత్మదృష్టి అలవడిన మహాత్మునిలో హింసకు కారణ మైన ద్వేషము ఉండే అవకాశమే లేనందున సర్వత్ర సమబుద్ధి గల జితేంద్రియుడు సర్వభూత హితేరతుడై శోభిస్తాడు.

## సేవా ఫలం

మరి, అక్షర స్వరూపమును ఉపాసించే అవ్యక్తోపాసకులకు ప్రాప్తించే ఫలం ఏమిటి? అది కూడా చెబుతున్నాడు. అర్జునా! 'వారు నన్నే పొందుతారు' ***(తే మామేవ ప్రాప్నువన్తి).*** అవ్యక్తోపాసన యొక్క ఫలం పరమాత్మయే. మోక్షమే. అద్వైతానుభూతియే. అందుకనే, 'జ్ఞాని నా స్వరూపుడే *(7 - 18)*. జ్ఞానికి నాకు భేదమే లేదు' అన్నాడు భగవంతుడు.

జ్ఞానులు తననే పొందుతారు అంటే, ఇంతవరకు పొందకుండా, ఇప్పుడే పొందుతున్నారు అని అర్థం కాదు. ఇంతవరకు లేని దానిని గనుక క్రొత్తగా పొందడము జరిగితే, అది క్రొత్తగా వచ్చింది అవుతుందే గాని ఉన్నదిగా భాసించదు. పూర్వము కూడా, అంటే జ్ఞానాత్పూర్వం కూడా జీవుడు బ్రహ్మమే. అజ్ఞానం వల్ల తాను బ్రహ్మ మని తెలుసుకోలేక పోయాడు. ఇప్పుడు అజ్ఞానం నివృత్తి అయింది కనుక, మేఘం తొలగిన తరువాత ప్రకాశిస్తున్న సూర్యుడే ప్రకాశించిట్లు, బ్రహ్మమైన జీవుడే బ్రహ్మముగా శోభిస్తున్నాడు ***(బ్రహ్మైవ సన్ బ్రహ్మైప్యేతి).*** పూర్వం కూడా తెలియకుండా బ్రహ్మము గానే ఉండిన వాడు అవిద్యా నివృత్తి జరిగిన తరువాత బ్రహ్మముగా భాసిస్తున్నాడు.

మరి, అవ్యక్తోపాసకుడు మోక్షరూపు డవుతు న్నప్పుడు, విశ్వరూపోపాసకుడు ఉత్తమ యోగి ***(యుక్త తమః)*** అని చెప్పడ మేమిటి? అనే సంశయం కలగవచ్చు. సగుణారాధకుడు కర్మయోగి. కనుక అతడే ఉత్తముడు. అతడు ఉత్తముడే గాని పరమేశ్వరుని పొంద లేడు. కర్మయోగం ద్వారా చిత్తశుద్ధిని పొంది, జ్ఞానప్రాప్తి ద్వారా మోక్షాన్ని పొందుతాడు. కాని, అవ్యక్తోపాసకుడు పరమాత్మనే పొందుతున్నాడు. అదే తేడా. జ్ఞాని సాక్షాత్తు భగవత్స్వరూపమే కనుక, అతనిని ఎవరి తోను పోల్చడానికి అవకాశము లేదు. పోల్చినపుడే యుక్తతము డనాలి. కనుక యుక్తతముడు కర్మయోగియే గాని జ్ఞాని కాదు. జ్ఞాని సాక్షాత్తు పరబ్రహ్మమే.

*అలాంటప్పుడు సగుణం కాకుండా నిర్గుణాన్నే ఆశ్రయిస్తే సరిపోతుంది కదా అనే సందేహం రావచ్చు. నిర్గుణోపాసన, లేదా అవ్యక్తోపాసన సులభసాధ్యం కాదు; పైగా కష్టతరం కూడా అని చెబుతున్నాడు.*

**క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తాసక్త చేతసామ్ ।** 5
**అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే ॥**





**క్లేశః-అధికతరః-తేషాం-అవ్యక్తాసక్త చేతసాం**
**అవ్యక్తా-హి-గతిః-దుఃఖం-దేహవద్భిః-అవాప్యతే**

అవ్యక్తాసక్తచేతసాం = అవ్యక్తము నందు ఆసక్తి గల చిత్తము గల్గిన
తేషాం = వారికి
క్లేశః = కష్టము
అధికతరః = అధికము
అవ్యక్తా = అవ్యక్త విషయమైన
గతిః = గతి
దుఃఖం = బాధ గాను
దేహవద్భిః = దేహాభిమానము గల వారలచే
అవాప్యతే హి = పొందబడుతున్నది గదా

**అర్జునా! అవ్యక్తమును ఉపాసించాలనే ఆసక్తి కల వారికి కష్టం ఎక్కువగా ఉంటుంది. దేహాభిమానం కల వారికి అక్షరోపాసన కష్ట సాధ్యము.**

### వ్యాఖ్య

అవ్యక్తోపాసనను గూర్చి మూడు, నాలుగు శ్లోకాలలో భగవంతుడు అందంగా, అద్భుతంగా ఆకర్షణీయంగా వర్ణించడం జరిగింది. అది వినిన తరువాత అక్షరోపాసననే అనుష్ఠించాలి అనే ఆలోచన సహజంగా కలుగుతుంది. అనుభవం కలగాలి, అనుభూతి ఏర్పడాలి అంటే, ఆలోచన ఒక్కటే సరిపోదు. అర్హత కూడా ఉండాలి.

తల ఎంత ఎత్తులో నైనా ఉండవచ్చు. పాదాలు మాత్రం భూమి మీదనే ఉండాలి. నేల విడిచి సాము చేయడం ఎవ్వరికీ మంచిది కాదు. అవ్యక్తోపాసనకు మించిన అనుష్ఠానము మరొకటి ఉండదు. అక్షరోపాసనకు అనంతమే ఫలం. ఫలం ఎలా అనంతమో, సాధనలో కష్టం కూడా అలా అనంతమే. అవ్యక్తోపాసన అందరూ వాంఛించ దగినదే అయినా అందరూ ఆచరించ దగింది కాదు. సర్వులూ ఆచరించడానికి సర్వులకూ సాధ్య పడేది కాదు.

## దుర్లభము - దుర్భరము

రూపధ్యానము ఉపాసనకు సంబంధించింది. స్వరూపధ్యానము అవగాహనకు సంబంధించింది. అందుకే అది స్వరూపానుసంధానము, లేదా నిదిధ్యాసనము అని చెప్పుకున్నాం. అంటే అర్థం చేసుకోవలసిన విషయం. అక్షర స్వరూపాన్ని బుద్ధికి పట్టించడం అందరికీ సాధ్యపడే విషయం కాదు.

రూపం ఆధారంగా ఉన్న సాకార ధ్యానమే మనకు సజావుగా సాగడం లేదు. ధ్యానయోగు లందరికీ ఇది అనుభవంలో ఉంటుంది. దృష్టిని పరమేశ్వరుని రూపంపై సారించినా, మనస్సు ప్రపంచాన్ని ఊహించుకుంటూ విషయాలలో ఊరేగుతూ ఉంటుంది.

అవసరం లేనివి, అవధానాన్ని పాడు చేసే వన్నీ ధ్యాన సమయం లోనే జ్ఞాపక మొస్తాయి. మనం కళ్ళు మూసి ధ్యానానికి కూర్చున్నా, మనసులో చలించే వాసనలు, విషయాలు రేకుల్ని విప్పినట్లు రెప్పల్ని విప్పుతూ ఉంటాయి. దుప్పట్లు కప్పినట్లు మాయను కప్పుతూ ఉంటాయి.

రూపం ఆలంబనంగా ఉండి, మనస్సును లగ్నం చేయ వలసిన స్థానం ఒక వైపు తెలుస్తూ ఉంటేనే, మనస్సు నిలవకుండా విషయాలను పట్టుకొని అటు ఇటు ప్రాకి పోతూ ఉంటే, ఏ ఆలంబనం లేకుండా, మనస్సును ఎక్కడ ఉంచాలో అర్థమే గాని అవ్యక్తంపై చిత్తమును నిలిపేది ఎలా? అందుకే, అవ్యక్తోపాసన యందు ఆసక్తి కల వారికి **(అవ్యక్తాసక్త చేతసామ్)** క్లేశము లేదా కష్టము అధికతరము **(క్లేశః అధికతరః)** అంటున్నాడు భగవంతుడు.

క్లేశము అధికము *(క్లేశః అధికః)* అనకుండా, అధికతర మంటూ, **తర** అనే అంత్య ప్రత్యయాన్ని ప్రయోగించడం చేత అధికము కూడా ఉందని సూచించడం జరిగింది. అవ్యక్తోపాసనలో క్లేశము అధికతరము అంటే, విశ్వరూపోపాసన అనే సాకారోపాసనలో కూడా క్లేశము అధికం గానే ఉందని అర్థము. శ్రమించనిదే ఏదీ ఫలించదు. ఏ శ్రమ లేకుండా ఫలితాన్ని పొందాలంటే, ఏ ఫలమూ రాదు, చావు తప్ప. కష్ట పడకుండా ఆధ్యాత్మిక సాధనలు ఫలితా న్నివ్వవు. పురిటి నొప్పులు పడకుండా బిడ్డను కనడం ఏ తల్లికీ సాధ్యం కాదు ***(అసహజాలు చర్చకు అర్థవంతాలు కావు).*** సగుణారాధన కూడా కష్టమే అయినా, నిర్గుణోపాసన కష్టతర మనడానికి కారణం అవరోధం దుర్భరంగా ఉండటమే. ఆ అవరోధం ఏదో కాదు, దేహాభిమానమే. అదే అవ్యక్తోపాసనలో అడ్డు నిలిచే ప్రతిబంధకము.

**దేహాభిమానం**

దేహాత్మ బుద్ధి, అంటే దేహమే ఆత్మ అనే బుద్ధి కల వారికి *(దేహవద్భిః దేహాభిమాన వద్భిః)* అవ్యక్తోపాసన సులభంగా ప్రాప్తించదు.

రూపం లేని పరమేశ్వరునికి ప్రపంచం రూపంగా ఉంది. విశ్వము ఆయనకు ఉపాధి. ఉపాధి యైన విశ్వము విశ్వేశ్వరుని కన్నా అన్యంగా లేదు. విశ్వం కూడా విశ్వాత్మయే. కాని, విశ్వాత్మ విశ్వం కాదు.

జీవుడు రూపం లేని ఆత్మ. దేహము జీవునికి రూపోపాధి. జీవుణ్ణి వదలి దేహం మనుగడను సాగించ లేదు. కనుక దేహం కూడా ఆత్మయే కాని ఆత్మ దేహం కాదు. ఆత్మ లేకుండా దేహం ఉండలేదు. కానీ, దేహం లేకపోయినా ఆత్మ నిత్యమై ఉంటుంది.

దేహమే ఆత్మ అనే దేహాత్మ బుద్ధి గల సాధకుడు ఆత్మధ్యానాన్ని కొనసాగించ లేడు. ఒకవేళ కొనసాగించినా, సాధన కష్టతరంగా సాగుతుంది. తనకు దేహం ఉంది అని భావించినంత కాలం, దేవుడికి కూడా దేహం ఉంది అనే భావన సాగుతూ ఉంటుంది. రూపాసక్తి ఉండేవారు అరూప ధ్యానాన్ని ఎలా చేయగలరు? చేసినా క్లేశము అధికతరం గానే ఉంటుంది. కనుక అవ్యక్తోపాసన అనే దైవధ్యానము దేహాత్మబుద్ధిని త్యజించిన వారికే సాధ్య పడుతుంది. అంతవరకు కష్టము అధికమే అయినా, అధికతర కష్టము కాని సాకారోపాసనే శ్రేష్ఠము అనేది అంతర్భావము. సాకారోపాసనలో శుద్ధి పడిన బుద్ధి నిరాకారోపాసనను సరళంగా కొనసాగించ గలుగుతుంది. సగుణోపాసన ద్వారా అర్హుడైన సాధకుడే నిర్గుణోపాసనలో నిరాటంకంగా పయనించ గలడు.

రైలుబండిలో ప్రయాణం చేయాలి అంటే, టిక్కెట్టును కలిగి ఉండటమే అర్హత. టిక్కెట్టు లేకుండా బండి ఎక్కితే, ఎక్కడ దిగి పోవలసి వస్తుందో ఎక్కిన వాడికి కూడా అర్థం కాదు. సాకారంలో శుద్ధి పడకుండా నిరాకారాన్ని ఆశ్రయిస్తే, సాధన ఎక్కడ దుర్భర మౌతుందో సాధకునికి కూడా అర్థం కాదు.

పునాది లేని మేడ ఎంత కాలం నిలుస్తుంది? భూమిని దున్ని మెత్త బరచకుండా విత్తనాలు చల్లి ఏ ఫలితాన్ని పొందాలి? సగుణోపాసన లేకుండా నిర్గుణాన్ని ఆశ్రయించడం కూడా అలాగే ఉంటుంది. అసాధ్యాలను సాధ్యాలుగా మార్చాలంటే కష్టం అధికతరం గానే ఉంటుంది. అసాధ్యము అంటే, దానిని విడిచి పెట్టమని కాదు. ఆచరించడానికి అర్హతను సంపాదించి అసాధ్యాన్ని సుసాధ్యం చేసుకోమని అర్థము. అసాధ్యాన్ని సాధించే స్థాయికి ఎదగమని, పరిపక్వతను ముందుగా సాధించమని అర్థము. పరిపూర్ణం వైపు సాగడానికి కావలసిన పరిపక్వత సాకారోపాసన లోనే సిద్ధిస్తుంది.

**సాకారమే సుకరము**

ఆత్మానాత్మ వివేకము పూర్ణంగా సిద్ధించి, అనాత్మ యైన దేహము తాను కాదని, నిత్యమైన ఆత్మయే





తాననే దృఢ భావన ఏర్పడే వరకు అవ్యక్తోపాసన కన్నా, మత్కర్మకృత్యాది సాధన పంచకముతో కూడిన విశ్వరూపోపాసనే సుకరము అనే పరమేశ్వరుని అభిప్రాయము ఈ శ్లోకంలో సుస్పష్ట మైంది.

దేహాభిమానం ప్రారంభంలో దృఢం గానే ఉండినా, సాకారోపాసన నిర్మలంగా సాగే కొద్దీ దేహాత్మ బుద్ధి పలుచబడుతూ ఉంటుంది.

నాకు దేహం ఉంది. కాని నేను దేహం కాదు. దేహం నాది కాదు. దేహం నాదే అయితే, నాకు చెప్పకుండా ఎందుకు అదృశ్య మవుతుంది? మాటైనా చెప్పకుండా ఎందుకు తరలి పోతుంది? దేహం నాదే అయితే, నేను ఉండమన్నట్లు ఎందుకు ఉండలేక పోతోంది?

ఈ దేహం పరమాత్మది. ఆయన అనుగ్రహిస్తే నాకు అందింది. ఆయన ఇచ్చిన దేహాన్ని పవిత్రంగా ఉంచుకోవడం నా బాధ్యత. ఆయన ప్రసాదించిన దేహాన్ని ఆయన సేవకే వినియోగించడం నా అదృష్టం.

సాకారమూర్తిని అభిషేకించడానికి ఉపకరించే ఈ దేహాన్ని ముందుగా శుద్ధ జలాలతో స్నానం చేయిస్తున్నా. అది కూడా దేహంలో ఉండే దైవానికి అభిషేకంగా ఆచరిస్తున్నా. ఈశ్వరోపాసనలో ఉపాసనా మూర్తిని అలంకరించినట్లే, ఈ దేహాన్ని కూడా పట్టు వస్త్రాలతో, చందన తిలకాదులతో అలంకరిస్తున్నా. పరమేశ్వరునికి సమర్పించిన నైవేద్యాన్ని దేహానికి ప్రసాదంగా పెడుతున్నా.

నేత్రాలు భగవంతుని దివ్యమూర్తిని పవిత్రంగా దర్శిస్తున్నాయి. దేవతార్చనలో హస్తాలు పావన మవుతున్నాయి. మంత్రోచ్చారణతో మాట శుద్ధి పడుతుంటే, తదేక చింతనముతో చిత్తము ప్రసన్న మవుతూ ఉంది. దైవారాధనలో దేహాభిమానం పలుచ బడుతోంది. ఈ విధంగా సాకారోపాసనలో దేహభావన క్షయించి, పవిత్రమైన దైవ భావన తేజోమయ మవుతూ ఉంది.

అవ్యక్తోపాసన శ్రేష్ఠ మైనదే అయినా, పరిణతి చెందని వారికి శ్రేయస్కరము కాదు. అక్షరోపాసన గంభీర మైన సాగరాన్ని ఈదినట్లే ఉంటుంది. కాని, సాకారోపాసన సుకరమే గాక, పవిత్ర గంగాజలాలలో స్నానం చేసినట్లు సులభంగా, శ్రేయస్కరంగా ఉంటుంది.

ప్రచండ తేజంతో భానుడు ప్రకాశించ వచ్చు. అలాగని సూర్యుణ్ణి ప్రత్యక్షంగా ఎంత సేపని చూడగలం? కాని, వెలిగే దీపాన్ని ఎంత సేపైనా ప్రశాంతంగా చూడగలం. ఉపాసనా విషయంలో, ధ్యాన మార్గంలో సగుణ నిర్గుణాలు ఇలాగే ఉంటాయి.

అర్జునా! కర్మయోగి కాని వాడు కర్మసన్యాసి కాలేడు. కర్మయోగం లేకుండా సన్యాసాన్ని పొందడం కష్టం. కర్మయోగి అయిన మననశీలుడు బ్రహ్మమును శీఘ్రంగా పొందుతాడు *(5 - 6)* అని గీతాచార్యుడు ముందే స్పష్టం చేసి ఉన్నాడు.

దేహాభిమానాన్ని పోగొట్టుకోకుండా, తాత్కాలిక ఆవేశంతో నిర్గుణారాధనను ప్రారంభించి నిరాశ చెందడం కన్నా, సుకరము, సులభము, శ్రేయస్కరమైన సగుణారాధనలో సఫల మయ్యే ప్రయత్నాన్ని సాగించడమే ముముక్షువులకు ఆదర్శమైన సాధనా మార్గము.

మహాత్ము లందరూ ఈ విధంగా ఆచరించిన వారే. ఈ విధమైన ఆచరణలో పరిణతి చెంది అభివృద్ధిని సాధించిన వారే. పుట్టే వారందరూ బిడ్డలు గానే పుడతారు. నెమ్మదిగా, ఓ పద్ధతిగా పెరిగి పెద్ద లవుతారు. మనం కూడా అలాగే మెల్లగా పెద్దవారి కోవ లోకి చేరి పోవాలి. అలాంటి వారిని పేర్కొనాలి అంటే ఏ కొందరో వేళ్ళ మీద

శ్రీ ఆదిశంకరాచార్య స్వామి తరువాత, శ్రీ సురేశ్వరాచార్యులు, శ్రీ విద్యారణ్యులు, శ్రీ మధుసూదన సరస్వతి, భగవాన్ లెక్కెట్టేటట్లు కనిపిస్తారు.

శ్రీరమణులు - ఇలా కొందరినే చెప్పగలం. కాని, వీరందరూ గీతాచార్యుడు బోధించిన ఈ మార్గంలో చరించిన వారే. తరించిన వారే.

అద్వైత సిద్ధి అనే అద్భుతమైన గ్రంథాన్ని రచించిన శ్రీ మధుసూదన సరస్వతి గొప్ప అద్వైతి. అద్వైత సంప్రదాయంలో అసమానమైన ఆచార్యులలో ఒకరు. కానీ, వారి సాధన భక్త సులభుడైన బాలకృష్ణుని తోనే ముడిపడి ఉండింది. భవ్యమైన బాలకృష్ణుని దివ్యారాధనలో వారు ఊహ కందని అద్వైత శిఖరాలను అవలీలగా అందుకున్నారు.

శ్లో ॥ ***ధ్యానావస్థిత తద్గతేన మనసా తన్నిర్గుణమ్ నిష్క్రియమ్***
***జ్యోతిః కించన యోగినో యది పునః పశ్యన్తి పశ్యన్తుతే***
***అస్మాకం తు తదేవ లోచన చమత్కారాయ భూయాచ్చిరమ్***
***కాలిందీ పులినేషు యత్కిమపి తన్నీలం తమోధావతి ॥***

అక్షరోపాసనలో ధ్యానమగ్న మైన చిత్తముతో నిర్గుణము, నిష్క్రియము, ప్రకాశైక స్వరూపము అయిన అవ్యక్తమును యోగులు దర్శిస్తే దర్శించనీ. నా మటుకు నాకు, యమునా సైకత శ్రేణులలో అలరిస్తూ అల్లరి చేసే నల్లని పిల్లవాడే కళ్ళ ముందు వింతగా కదులుతూ ఉండు గాక!

ఎంత మనోజ్ఞమో! ఎంత మనోహరమో! ఆ మధుర మంజుల మనోజ్ఞ మోహనమూర్తి మనోహర రూపంలో మధుసూదన సరస్వతి మనస్సు మంచు లాగా కరిగి పోయేది! వెన్న లాగా చల్లబడేది. అదంతా సాకారోపాసన వైభవమే.

*ఇంతవరకు వరుసగా మూడు శ్లోకాలలో నిర్గుణారాధనను ముచ్చటగా చర్చించిన గీతాచార్యుడు, సర్వులకు ఆచరణ యోగ్యమైన సగుణాన్ని కొనసాగిస్తున్నాడు. ఇక ఈ అధ్యాయ మంతా భక్తిమయం గానే సాగుతుంది. నిర్గుణ వైభవాన్ని తరువాత అధ్యాయం క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగంలో చర్చిస్తాడు.*

**యే తు సర్వాణి కర్మాణి మయి సంన్యస్య మత్పరాః ।**
**అనన్యే నైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే ॥** 6
**తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసార సాగరాత్ ।**
**భవామి నచిరా త్పార్థ మయ్యావేశిత చేతసామ్ ॥** 7

***యే-తు-సర్వాణి-కర్మాణి-మయి-సంన్యస్య-మత్పరాః***
***అనన్యేన-ఏవ-యోగేన-మాం-ధ్యాయంత-ఉపాసతే***
***తేషాం-అహం-సముద్ధర్తా-మృత్యుసంసార సాగరాత్***
***భవామి-నచిరాత్-పార్థ-మయి-ఆవేశిత చేతసాం***

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా! | సంన్యస్య | = సమర్పించి |
| మత్పరాః | = నేనే పరమగతి అనే వారు | అనన్యేన | = ఏకాంతమైన |
| యే తు | = ఎవరైతే | యోగేన ఏవ | = యోగముచే |
| సర్వాణి | = సర్వములైన | మాం | = నన్ను |
| కర్మాణి | = కర్మలను | ధ్యాయంత | = ధ్యానము చేస్తూ |
| మయి | = నా యందు | ఉపాసతే | = ఉపాసిస్తూ ఉంటారో |





| | | | |
|---|---|---|---|
| మయి | = నా యందు | నచిరాత్ | = త్వరలోనే |
| ఆవేశిత చేతసాం | = ఉంచబడిన మనస్సు గల | మృత్యుసంసార సాగరాత్ | = జననమరణ సంసార సాగరము నుండి |
| తేషాం | = వారలను | సముద్ధర్తా | = ఉద్ధరించే వాణ్ణి |
| అహం | = నేను | భవామి | = అవుతాను |

**అర్జునా! అనన్య భక్తితో నన్నే ధ్యానిస్తూ ఉపాసించే వారు సర్వ కర్మలను నాకే సమర్పిస్తారు. నన్నే పరమగతిగా భావిస్తారు. చిత్తమును నా పైనే ఉంచిన అలాంటి భక్తుల్ని మృత్యు రూపమైన సంసార సాగరం నుండి శీఘ్రంగా నేను ఉద్ధరిస్తాను.**

**వ్యాఖ్య**

**భక్తోద్ధారణము**

**యే తు** - ఎవ్వరైతే అనే శ్లోకారంభం లోని పదంలో **తు** శబ్దం శంక నివృత్త్యర్థము మరియు విషయ పృథక్త్వర్థమును సూచించడం కోసం ప్రయోగింప బడింది. అవ్యక్తోపాసకులు నన్నే పొందుతారు **(మామేవ ప్రాప్నువన్తి)** అని పూర్వ శ్లోక ద్వయంలో పరమేశ్వరుడు చెప్పడం చేత, సాకారోపాసకులు పరమేశ్వరుని పొందరా? అనే శంక ఉత్పన్నం కావచ్చు. దానిని నివారించే ప్రయత్నంగా **తు** శబ్ద ప్రయోగం జరిగింది.

గడచిన మూడు శ్లోకాలలో అక్షర పరబ్రహ్మోపాసనను గూర్చి చర్చించడము జరిగింది. విషయాన్ని వేరు చేస్తూ, ప్రస్తుత శ్లోకములో సగుణారాధకులను గూర్చి చెప్పడం తిరిగి ఆరంభ మవుతూ ఉందని తెలుపడానికి **తు** శబ్దము ప్రయోగింప బడింది.

అక్షర పరబ్రహ్మోపాసకులు నన్నే పొందుతారు **(మామేవ ప్రాప్నువన్తి)** అని చెప్పిన భగవానుడు, సాకారోపాసకుల్ని తానే ఉద్ధరిస్తానని ప్రస్తుత శ్లోకంలో చెబుతున్నాడు **(తేషాం అహం సముద్ధర్తా)**. దేని నుండి ఉద్ధరిస్తాడు? మృత్యురూప సంసార సాగరం నుండి ఉద్ధరిస్తాడు **(మృత్యు సంసార సాగరాత్)**. ఎవరిని ఉద్ధరిస్తాడు? చిత్తమును తన యందే నిలిపిన భక్తుల్ని ఉద్ధరిస్తాడు **(మయ్యా వేశిత చేతసామ్)**. ఆ భక్తులు ఎలాంటి వారు? ఎవరు?

సర్వ కర్మలను పరమాత్మ యందే సమర్పించిన వారు **(సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య)**. భగవంతుడే పరమగతి యని భావించే వారు **(మత్పరాః)**. అనన్య యోగంతో భగవంతుణ్ణే ధ్యానిస్తూ ఉపాసించే వారు **(అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే)**. వీరే ప్రస్తుతం పరమేశ్వరుని చేత ఉద్ధరింపబడే భక్తులు. ప్రస్తుతం మనం అధ్యయనం చేస్తున్న శ్లోకద్వయంలో మొదటి శ్లోకంలో భక్తుడు ఆచరించ వలసిన సాధన, రెండవ శ్లోకంలో తద్వారా ప్రాప్తించే ఫలమును తెలుపుతున్నాడు భగవంతుడు.

**సర్వకర్మ సమర్పణము**

ఎవరికి మనం ఏది సమర్పించినా, ఆ సమర్పించ బడేది సమర్పించిన తరువాత వారిది అవుతుంది. అంటే, సమర్పించక ముందు అది మనదిగా ఉంటుంది అనేది స్పష్టం.

ప్రస్తుతం కర్మలను సమర్పించడం జరుగుతూ ఉంది. మన కర్మలను ఈశ్వరునికి సమర్పిస్తున్నాం **(కర్మాణి ఈశ్వరే సంన్యస్య)**. అంటే, అంతకు పూర్వం ఆ కర్మలు మనవిగా ఉన్నాయి అని అర్థం. అవి ఏ కర్మలు? మన ద్వారా ఆచరింపబడే సమస్త కర్మలు **(సర్వాణి కర్మాణి)**. అవి వేదోక్తమైన యజ్ఞయాగాదులు కావచ్చు. స్మృతి ప్రతిపాదితమైన పూజాదికాలు కావచ్చు. నిత్య నైమిత్తికాలు కావచ్చు. లేదా లౌకిక కర్మలు

కావచ్చు. ఇవన్నీ ఇంతవరకు మనవి గానే ఉన్నాయి. కర్మయోగులైన భక్తులు ఆ కర్మల నన్నిటినీ పరమాత్మ యందే సమర్పిస్తారు. ఈ క్షణం వరకు, అంటే సమర్పించే క్షణం వరకు అవి మన కర్మలు అనే బుద్ధి ఉండింది. వాటినే ఈశ్వరునికి అర్పించడం చేత, 'మమ' బుద్ధి తొలగి, ఈశ్వరార్పణ బుద్ధి కలుగుతూ ఉంది. కర్మాచరణము నందు గాని, కర్మ ఫలానుభవము నందు గాని 'నేను - నాది' అనే బుద్ధి దూరమై ఈశ్వర భావమే ప్రకాశిత మవుతూ ఉంది.

కర్మాచరణంలో సర్వకర్త అయిన పరమేశ్వరుని వైభవాన్ని గుర్తించడం చేత **అహం కర్తా** అనే భావన అదృశ్యమై, ***హరిః కర్తా*** అనే దివ్యభావన ప్రకాశిస్తుంది. కర్మాచరణము నందు కర్మాసక్తి లేనందున, ఫలానుభవంలో ఫలాసక్తి అదృశ్యమై, ప్రసాద భావన ప్రసన్న మవుతుంది. కర్మల విషయంలో భక్తుడు నిమిత్తంగా శోభిస్తాడు. సూత్రధారి యైన పరమేశ్వరుని చేతిలో పాత్రధారిగా మారుతాడు. చూచేందుకు ఉపకరించే కన్ను లాగా, వ్రాసేందుకు ఉపయోగపడే పెన్ను లాగా మారుతాడు.

ప్రస్తుతం నా చేతి లోని కలం నా ముందున్న కాగితముపై కదులుతూ ఉంది. గీతా వ్యాఖ్యానము వ్రాస్తూ ఉంది. ఇక్కడ వ్రాసేది కలమా, నేనా? నేనే. కలాన్ని చేత పట్టుకొని నేనే వ్రాస్తున్నాను. కలం నా చేతిలో పనిముట్టుగా కదుల్తూ ఉంది. ఏమి వ్రాయాలో, ఎలా వ్రాయాలో తెలిసేది నాకే గాని కలానికి కాదు. అలాంటప్పుడు రచనా వ్యాపకం కలాని కెందుకు? వ్రాసేది, వ్రాయించేది నేనే అయినపుడు, కలానికి కంగా రెందుకు? పనిముట్టు పనిముట్టుగా ఉండ గలిగితే చాలు. పని గట్టుకొని కులక నవసరం లేదు. ఈ పని చేయగలిగితే, పనిముట్టు పని నుండి విడిపడి పోతుంది. పని, పనితనము రెండిటి లోను తనకు కర్తృత్వము ఉండదు. కర్తృత్వమే లేనపుడు కర్తృత్వాభిమానము ఉండదు. కర్తృత్వము, కర్తృత్వాభిమానము లేనపుడు, భోక్తృత్వము, భోక్తృత్వాభిమానము కూడా ఉండవు. పనులన్నీ ఉన్నట్లే ఉంటూ లేనివిగా మారి పోతాయి. ఇది కర్మసన్యాసము కాదు. కర్మలలో సన్యాసము. అదే కర్మయోగ వైభవము. భక్తుని జీవనకళా ప్రాభవము.

తనది కాని దానిని ఇంతవరకు అభిమానంతో తనదిగా భావించిన వాడు, అభిమానాన్ని త్యజించి తన కర్మలను ఈశ్వర కర్మలుగా గుర్తించి సమర్పించడం జరిగింది. వాస్తవానికి సమర్పించక పూర్వము కూడా అవి తన కర్మలు కావు. తెలియక తన కర్మలని ఇంతవరకు భ్రమించిన వాడు, అవి తనవి కావనే సత్యాన్ని గుర్తించ గానే తనవి కానివి, కానివి గానే దూర మౌతున్నాయి. ఇంతకీ దూర మయ్యేవి కర్మలా, కర్మల యందలి అభిమానమా? కర్మలు దూరం కావు, కాలేవు. అభిమానమే దూర మవుతూ ఉంది. కనుక కర్మల యందు అభిమానమును వదలడమే గాక, అలా అభిమానాన్ని వదులుతున్నాను అనే భావనను కూడా వదిలేయాలి. 'నేను వదిలేశాను' అనే భావనను కూడా వదిలి పెట్టడమే సర్వకర్మ సమర్పణము. మాధవుని చేతిలో మురళి అలాగే జీవించింది. ఏమీ లేనిదిగా మిగిలి, అన్నీ తానైన మాధవుని చేతిలో అందంగా కులికింది. అమృత నాదాలను పలికింది. మాధవుని వైభవాన్ని ప్రదర్శించే పనిముట్టు అయింది. అందుకే తన అధరామృతాన్ని పంచి వేణువుకు విందు చేశాడు వేణుగోపాలుడు.

*చరణము:* **వనమున పెరిగిన వెదురు కూనను ముద్దుల మురళిగ మార్చాడు**
**మోహన వంశిని పలికించి జగతిని మురిపించాడు**
**బృందావనిలో మురళీనాదం - భక్తుల పాలిటి అమృతగానం**

*పల్లవి:* **నల్లని వాడు అల్లరి వాడు**
**చైతన్యుని యోదలో మాధవుడు** ॥ **నల్లని** ॥

అని వేణునాద వైభవాన్ని వర్ణించింది చైతన్య గీతిక.





ఈ విధమైన సర్వకర్మ సమర్పణము జరిగి, కర్మలలో కర్తృత్వ భోక్తృత్వ అభిమానం సంపూర్ణంగా త్యజింప బడాలి అంటే, లక్ష్య సిద్ధి ఉండాలి. తాను ఆచరించే కర్మలు ఏ వైపుకు పయనిస్తాయో తెలిసి ఉండాలి. అదే గమ్యస్థాన మంటే. అభిమానమును త్యజించి, నిమిత్తమాత్రంగా కర్మలను ఆచరించే భక్తునికి పరమ గమ్యము భగవంతుడే **(మత్పరాః)**.

**మత్పరత్వము**

భక్తులకు పరమ పురుషార్థము భగవంతుడు. నదికి సముద్రము గమ్య మైనట్లు, భక్తులకు భగవంతుడే పరమ గమ్యము. అదే మత్పరత్వము. అంటే పరమేశ్వరునే ఉత్తమ గమ్యముగా, ఏకైక గమ్యముగా కలిగి ఉండటము ***(మత్పరాః అహం పరః యేషాం తే మత్పరాః సన్తః)***.

పరమేశ్వరుని పరమ గమ్యంగా భావించి, పరమేశ్వరుని చేతిలో పనిముట్టుగా నిమిత్తమాత్రంగా భక్తుడు కర్మాచరణంలో ఉంటాడు. కర్మసంగం లేకుండా కేవలం చిత్తశుద్ధి కొరకు కర్మలను అభిమాన రహితంగా ఆచరిస్తూ ఉంటాడు.

***యోగినః కర్మ కుర్వన్తి సంగం త్యక్త్వా ఆత్మశుద్ధయే*** - సంగత్వాన్ని విడిచి, కేవలం చిత్తశుద్ధి కొరకే యోగులు కర్మల నాచరిస్తారు అని ఐదవ అధ్యాయంలో భగవంతుడు చెప్పినట్లు *(5 -11)* జీవించే వారే మత్పరులు.

కర్మయోగులైన భక్తులు మోక్షమునే పరమావధిగా భావిస్తారు కనుక, మోక్షార్థం చిత్తశుద్ధిని వాంఛించి కర్మఫలాసక్తి లేకుండా కర్మల నాచరిస్తారు. వివిధములైన కర్మలు వారి ద్వారా జరుగుతూ ఉంటాయి. వారు ఆచరించే కర్మలకు అనుగుణంగా మనోవృత్తులు మారుతూ ఉంటాయి. వృత్తి మార్పు జరుగుతున్నా, వృత్తి లోని భావన మాత్రం అచ్యుతుడే అయి ఉంటాడు. ఇదే మత్పరత్వము. కాస్త జాగ్రత్తగా అర్థం చేసుకోవలసిన విషయము. సోదాహరణంగా చెప్పుకుందాం.

**పరిచర్య ప్రవృత్తి**

ఒక పరిచారిక యజమాని గృహంలో ఊడిగం చేస్తూ బ్రతుకుతూ ఉంటుంది. ఆమె పూరిగుడిసెలో తన బిడ్డతో కలిసి జీవిస్తూ ఉంటుంది. రెక్కాడితే గాని డొక్కాడదు. బిడ్డ ఒక్కడినే గుడిసెలో ఉంచి ఆమె ఊడిగం చేయడానికి వెళ్తుంది.

యజమాని బిడ్డ కూడా తన బిడ్డ వయస్సు వాడే. యజమాని ఇంట్లో యజమాని బిడ్డకు పరిచారిక స్నానం చేయిస్తుంది. బట్టలు తొడుగుతుంది. బువ్వ పెడుతుంది. బొమ్మలతో ఆడిస్తుంది. చేసే పనులన్నీ యజమాని బిడ్డ కొరకే. కానీ, ఆమె బుద్ధిలో మాత్రం గుడిసెలో ఒంటరిగా ఉన్న తన బిడ్డే మెదుల్తూ ఉంటాడు. కదుల్తూ ఉంటాడు. చేతులలో యజమాని బిడ్డ ఉన్నా, చిత్తంలో తన బిడ్డే ఉంటాడు. తన బిడ్డకు సంబంధించిన ఆలోచనే ఉంటుంది.

పనులు మారుతున్నా, ఆమె ప్రవృత్తి ఒకే విధంగా ఉంటుంది. వ్యవహారము భిన్నంగా ఉన్నా, మనో వైఖరిలో మార్పు ఉండదు. ఇక్కడ శ్రద్ధ పెట్టి అర్థం చేసుకోండి.

యజమాని బిడ్డకు చేసే పరిచర్యలు వేరు వేరుగా ఉన్నాయి. స్నానం చేయించడం వేరు. బట్టలు తొడగటం వేరు. అన్నం పెట్టడం వేరు. ఆట లాడించడం వేరు. ఏయే పనులు చేస్తూ ఉంటే, ఆయా పనులకు సంబంధించిన ఆలోచనలే, భావాలే, వృత్తులే మనస్సులో కదులుతూ ఉంటాయి.

స్నానానంతరం బట్టలు తొడిగే టప్పుడు బుద్ధిలో బట్టలకు సంబంధించిన వృత్తులు కదుల్తాయే గాని, బొమ్మలకు సంబంధించిన వృత్తులు కదలవు. భోజనానంతరం బిడ్డను ఆట లాడించే సమయంలో బొమ్మలకు సంబంధించిన ఆలోచనలు లేదా వృత్తులు ఆమె మనస్సులో ఉంటాయే గాని స్నానాలగది లోని వస్తువులకు సంబంధించిన వృత్తులు కదలవు.

చేసే పనులు మారుతూ ఉంటే, వాటికి సంబంధించిన వృత్తులు కూడా మనస్సులో మారుతూ ఉంటాయి. ఏ పని చేస్తూ ఉంటే, దానికి సంబంధించిన ఆలోచనలే కదుల్తూ ఉంటాయి.

కానీ, పనులు మారుతున్నా, ఆయా పనులకు సంబంధించిన వృత్తులు బుద్ధిలో మారవచ్చు నేమో గాని, వృత్తుల లోని విషయం మాత్రం గుడిసెలో ఒంటరిగా ఉన్న తన బిడ్డే గాని యజమాని పుత్రుడు కాడు. అతనికి సంబంధించిన కార్యాలు కావు. వృత్తి ఏదైనా కావచ్చు. వృత్తి విశేషం మాత్రం గుడిసెలో ఏకాకిగా ఉన్న తన పుత్రుడే.

భక్తుడైన కర్మయోగి జీవితంలో ఎన్ని కర్మ లాచరించినా, ఆయా కర్మలకు సంబంధించిన వృత్తులు బుద్ధిలో కదులుతూ ఉండినా, సర్వ కర్మలను పరమేశ్వరుని యందు సమర్పించి, భగవంతుడే పరమగతిగా భావించి జీవించే అతనికి, బుద్ధి లోని వృత్తి విశేషము మాత్రం ఒక్క భగవంతుడే అయి ఉంటాడు. ఇదే మత్పరత్వ మంటే.

పరిచారిక వివిధ కార్యాలు ఆచరిస్తున్నా, వాటికి సంబంధించిన ఆలోచనలు ఆమె మనస్సులో కదులుతూ ఉండినా, ఆమె మనస్సు లోని ఆలోచన లన్నిటిలో గుడిసెలో ఒంటరిగా ఉన్న తన బిడ్డే ఉన్నట్లు,

భక్తుడు ఏ పనులు చేస్తున్నా, వాటికి సంబంధించిన ఆలోచనలే అతని మనస్సులో కదులుతూ ఉండినా, అతని మనస్సు లోని ఆలోచన లన్నిటిలో తన గుండె గుడిలో శోభిస్తున్న ఏకాంత రామయ్యే నిండి ఉంటాడు. ఇదే మత్పరత్వము. కర్తృత్వాలు, అభిమానాలు అంతరించిన పుణ్య కాలంలో కర్పూర కాంతి లాగా శోభిస్తున్న భక్తి తత్త్వము.

*చరణము:* **కలిసొచ్చిన విధి పోయిందని**
**కదిలొచ్చిన గతి తోడుందని**
**వెన్నుడు మదిలో ఒదిగిపోగా**
**కన్నులలో కాంతి వెలిగిందని**
**హృదిలో శాంతి నిలిచిందని**

*పల్లవి:* **సత్యమైన నీ కథ విని**
**వినిపించింది మనసు మనవిని**

*అనుపల్లవి:* **పోయిన పున్నమి వచ్చిందని**
**చేసిన పున్నెము తెచ్చిందని** ॥ **సత్యమైన** ॥

అని మత్పరత్వంలో మైమరచింది చైతన్య గీతిక.

**తదేక నిష్ఠ**

సర్వ కర్మలను భగవంతునికి సమర్పించి, భగవంతుడే పరమగతిగా భావించి జీవించే భక్తులు అనన్య యోగంతో పరమాత్మనే ధ్యానిస్తూ, ఉపాసిస్తూ ఉంటారు. అనన్య యోగము అంటే ఏమిటో కూడా స్పష్టంగా అర్థం చేసుకోవాలి.





***అనన్యేన*** అంటే మరొకటి వేరుగా లేనిది అని అర్థము. ***యోగేన*** అంటే యోగంతో అని అర్థము. మరొక ఆధారము లేదా ఆశ్రయము తెలియని యోగము అనన్య యోగము. అంటే, పరమేశ్వరుడు తప్ప మరొక ఆశ్రయము తెలియని యోగముతో భక్తులు భగవంతుని ఆరాధిస్తూ ధ్యానిస్తారు. ధ్యానిస్తూ ఉపాసిస్తారు ***(అనన్యేన ఏవ అవిద్యమానమ్ అన్యత్ ఆలంబనం విశ్వరూపం దేవం ధ్యాయన్తః చిన్తయన్తః ఉపాసతే).*** ఇదే అనన్య యోగంతో కూడిన భక్తిరూప ధ్యానము; లేదా ధ్యానరూప భక్తి. సగుణ బ్రహ్మ విషయ మానస వ్యాపారము.

***నీవే తప్ప నితః పరం బెరుగ*** - నువ్వు తప్ప నాకు వేరే దిక్కు లేదు అని గజేంద్రుడు అన్యాశ్రయాలను వదలి శ్రీహరిని ఆశ్రయించడమే అనన్య యోగము. అందుకనే, ***అన్యాశ్రయాణాం త్యాగః అనన్యతా*** - అన్యములైన ఆశ్రయాలను విడిచి పెట్టి ఈశ్వరు నొక్కడినే ఆశ్రయించడం అనన్య భక్తి అని నారధ మహర్షి భక్తి సూత్రాలలో ప్రవచించాడు.

కొందరు కుహనా భక్తులు చేసే దంతా రాగద్వేషాల పంచన నిలబడి చేసేస్తూ, నాదేముంది? అంతా పై వాడే నడిపిస్తున్నాడు. నేను నిమిత్తమాత్రుణ్ణి అని దంత వేదాంతాన్ని దంచేస్తుంటారు.

ఇలాంటి సమయాల్లోనే పై వాడు క్రిందికి చూస్తాడు. అంతే. సర్వం తలక్రిందు లౌతుంది. అప్పుడు మరో దంత వాక్యం వినిపిస్తారు. ఏం చేద్దాం! నా కర్మ అలా కాలింది, పై వాడు మాత్రం ఏం చేస్తాడు? అంటారు. ఈ బుద్ధి ముందే ఉండి ఉంటే, 'నా కర్మ' అనేదే ఉండేది కాదు కదా! నీ కర్మ కానిది 'అతని కర్మ' కదా! అతని కర్మను చక్కదిద్దుకో వలసిన అవసరం అతనిదే కదా! ఇక నీకు దిగు లెందుకు? భగవంతుడు కూడా అదే చెబుతున్నాడు.

**ఉద్ధారకుని ఉదంతము**

పార్థా! నా మీదనే మనస్సు పెట్టిన వారిని నేను ఉద్ధరించకుంటే మరెవరు ఉద్ధరిస్తారు? అనన్య శరణులు, మత్పరులైన భక్తులను **(తేషాం)** నేను ఉద్ధరిస్తాను **(అహం సముద్ధర్తా).** దేని నుండి ఉద్ధరిస్తా నంటావా! మృత్యుసంసార సముద్రం నుండి ఉద్ధరిస్తాను **(మృత్యు సంసార సాగరాత్).**

జననమరణ రూప సంసారము తీరము లేని సముద్రము. ఎంత ఈదినా మునగడమే గాని తేలడము ఉండదు. పైకి లేవడము ఉండదు. ఇది మృత్యువుతో కూడిన సంసారము. అందుచేత మృత్యు సంసారము. మృత్యువు ఉంది అంటే జన్మము కూడా ఉండాలి కదా! అదే సంసార శబ్దార్థము.

సంసారము ఉంది అంటే సంసర్గము ఉంది అని అర్థము. సంస్పృష్టి ఉందనే భావము. పుట్టుక లేకుండా సంసారము ఎలా ఉంటుంది? పుట్టిన వారికే సంసారం ఉంటుంది కనుక, మృత్యు సంసార సాగరము అంటే జననమరణ రూప సముద్రము అని అర్థము.

***మృత్యు సంసార సాగరాత్*** అనే సమాసానికి శ్రీ శంకరులు **మృత్యు యుక్తః సంసారః, స ఏవ సాగరః, దుస్తరత్వాత్, తస్మాత్ మృత్యు సంసార సాగరాత్** - మృత్యువుతో కూడిన సాగరము మృత్యు సాగరము, దాట శక్యము కానిది. అందుచేత అది మృత్యు సంసార సాగరము అని నిర్వచించారు. దాని నుండి భగవంతుడు మనల్ని ఉద్ధరిస్తాడు. కనుక మృత్యు యుక్త సంసార సాగరము అని ఆచార్యుల వారు అర్థం చెప్పిన సమాసంలో, **యుక్తః** అనే పదము మూలంలో లోపించి ఉంది. దీనినే **మధ్యమ పద లోప సమాసం** అంటారు. **యుక్తః** అనే పదము మధ్యలో లోపించిన సమాసము. పైన నేను తెలిపినట్లు, 'సంసార' శబ్దాన్ని జననముగా స్వీకరించ వచ్చు. దోషం లేదు.

ఈ విధమైన జనన మరణ రూప సంసార సాగరంలో పడి జీవులు పరిభ్రమిస్తూ ఉంటారు. ఇది దుస్తరమైన భవ సాగరము. ఇదొక సంసార సుడిగుండం. సాలెవాడు వస్త్రాన్ని నేసే టప్పుడు మగ్గము నాడె ఒక వైపు నుండి మరొక వైపుకు వేగంగా ఎలా పరుగు తీస్తుందో, జీవులు కూడా జననమరణాల మధ్య పరుగులు పెడుతూ ఉంటారు. వేదాంత పంచదశిలో శ్రీ విద్యారణ్య స్వామి జీవుల జననమరణాలను నదిలో సుడిగుండాల మధ్య వేగంగా దొర్లిపోతున్న కీటకాన్ని ఉదహరిస్తూ ప్రబోధించారు.

*నద్యాం కీటా ఇవ ఆవర్తాత్ ఆవర్తాన్తర మాశు తే,*
*వ్రజన్తో జన్మనో జన్మ లభన్తే నైవ నిర్వృత్తిమ్ ॥*

నదిలో ***(నద్యాం)*** ఒక సుడి నుండి మరొక సుడి లోకి ***(ఆవర్తాత్ ఆవర్తాన్తరమ్)*** పురుగు ***(కీటా)*** వేగంగా దొర్లినట్లు ***(ఆశు వ్రజన్తః),*** జీవులు ***(తే)*** ఒక జన్మ నుండి మరొక జన్మకు ***(జన్మనః జన్మ)*** పోతూ ఉంటారు. దాని నుండి విముక్తిని పొందరు ***(నిర్వృత్తిమ్ న ఏవ లభన్తే).***

ఈ విధమైన జనన మరణ రూప సంసార సాగరం నుండి అనన్య భక్తులను భగవంతుడు ఉద్ధరిస్తాడు. ఈ సందర్భంలో **ఉద్ధర్తా** అని గాక, **సముద్ధర్తా** అని ఉపసర్గను చేర్చి మరీ ఉద్బోధించాడు. **సముద్ధర్తా** అంటే చక్కగా ఉద్ధరిస్తాను, లేదా తప్పక ఉద్ధరిస్తాను అని అర్థము.

**ఉద్ధర్తా** శబ్దానికి మరొక అర్థాన్ని కూడా గ్రహించ వచ్చు. **ఉత్** అంటే పైన, లేదా ఊర్ధ్వంగా అని అర్థము. ***ధర్త*** అంటే నిలిపే వాడు అని అర్థము. అనన్య చిత్తులైన నా భక్తులను సర్వ ఉపద్రవాలకు పైన **(ఉత్)** నేను నిలుపుతాను ***(ధారయితను)*** అని వాగ్దానం చేస్తున్నాడు వాసుదేవుడు. బ్రహ్మము నందు నిలుపుతాను అని హామీ ఇస్తున్నాడు. ఈ విధంగా బ్రహ్మాదులకు సైతం లభ్యం కాని భగవంతుడు, భక్తుల విషయంలో ప్రసన్నుడై, వారిని భవసాగరం నుండి బయట పడేస్తున్నాడు. ఇదే అనన్య భక్తి ఫలం.

***చిలిపి చిలిపి పనుల చక్కనయ్య***
***బ్రహ్మరుద్రాదుల కైన నీవు చిక్కవయ్య***
***తలచి వలచిన వారికే దక్కినావు***
***నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!***

అని చిన్నికృష్ణ శతకంలో ఒక వెన్నముద్ద.

*ఇక భక్తులు చేయవలసింది ఏమిటో చెబుతున్నాడు.*

**మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ ।** 8
**నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః ॥**

***మయి-ఏవ-మనః-ఆధత్స్వ-మయి-బుద్ధిం-నివేశయ***
***నివసిష్యసి-మయి-ఏవ-అతః-ఊర్ధ్వం-న-సంశయః***

| | | | | | |
|---|---|---|---|---|---|
| మయి ఏవ | = | నా యందే | నివేశయ | = | ప్రవేశ పెట్టుము |
| మనః | = | మనస్సును | అతః ఊర్ధ్వం | = | అటు పిమ్మట |
| ఆధత్స్వ | = | ఉంచుము | మయి ఏవ | = | నా యందే |
| మయి | = | నా యందే | నివసిష్యసి | = | నివసింతువు |
| బుద్ధిం | = | బుద్ధిని | న సంశయః | = | సందేహము లేదు |





**అర్జునా! నీ మనస్సును నాపై పెట్టు. బుద్ధిని కూడా నా పైనే ఉంచు. ఆ తరువాత నువ్వు నా లోనే ఉంటావు. సందేహించకు.**

**వ్యాఖ్య**

సతతయుక్తులై పరమేశ్వరునే ప్రీతితో సేవించే వారికి బుద్ధి యోగాన్ని ప్రసాదిస్తాను అని విభూతి యోగంలో తెలిపిన భగవంతుడు *(10 - 11)*, అనన్య యోగముతో భగవంతుడే పరమగతి అని భావించి సదా ధ్యానిస్తూ ఉపాసించే భక్తులను తానే ఉద్ధరిస్తాడని, అది కూడా శీఘ్రంగా ఉద్ధరిస్తాడని పూర్వ శ్లోకంలో చెప్పడం జరిగింది. ఇక, మనం చెయ్య వలసిందే మిగిలి ఉంది. ఈ శ్లోకం నుండి అన్నీ సాధనకు సంబంధించిన విషయాలే. శ్రద్ధగా చెప్పుకుందాం.

**మాధవుని యందే మనస్సు**

అర్జునా! నీ మనస్సును నా యందే ఉంచు **(మయ్యేవ).** మరొకచోట ఉంచకు అని దాని అర్థము. అదే ఏవ శబ్దము. భగవంతుడు కాని దాని యందు మనస్సును ఉంచకు అని అర్థము. అనన్య యోగాన్ని గూర్చి పూర్వ శ్లోకం లోనే చెప్పి ఉన్నాడు కనుక, అన్య విషయాలపై మనస్సు పెట్టవద్దు అంటున్నాడు. నా యందే ఉంచు అంటున్నాడు.

ఇక్కడ మనస్సును తన మీదే పెట్టమని భగవంతుడు చెప్పడంలో విశ్వరూప పరమేశ్వరుడైన సగుణ బ్రహ్మము నందే పెట్టమని అర్థము **(విశ్వరూపే పరమేశ్వరే మనః ఆధత్స్వ స్థాపయ).**

ఒక కార్యాన్ని ఆరంభించ మని ఎవరు చెప్పినా, ఆ కార్యము ఇంకా ఆరంభం కాలేదని అర్థము. ఒకవేళ ఆరంభమైనా సరిగా లేదు అని భావము. మనస్సును నా యందు ఉంచు అని పరమేశ్వరుడు ఆజ్ఞాపించాడు అంటే, ఇంకా మన మనస్సు భగవంతునిపై పెట్టడం జరగ లేదని అర్థము. ఒకవేళ పెట్టినా, సరిగా ఉంచడం లేదని భావము. అందుకనే ఫలితాలు అందక, నా మనస్సు నిలవడం లేదండి, కూర్చోవడం లేదండి, పడుకోవడం లేదండి అని ఊకదంపుడు కబుర్లు వినిపిస్తూ ఉంటాము.

మనస్సును భగవంతునిపై పెట్టడం అంత సులభ సాధ్యమైన విషయం కాదు. దానికి ఎంతో సంస్కారం ఉండాలి. వివేక వైరాగ్యాలు కనీసం అవసర మైనంతైనా ఉండి తీరాలి. భావస్పందన కూడా కావాలి. ఇవన్నీ ప్రయత్నశీలురకే ప్రాప్తిస్తాయి.

మనస్సు నీళ్ళ లాంటిది. ఒకచోట నిలవదు. నీళ్ళు ఎలా పారుతూ ఉంటాయో, మనస్సు అలా పారిపోతూ ఉంటుంది. అది కూడా పైకి పోదు. నీళ్ళు ఎలా పల్లానికి ప్రవహిస్తాయో, మనస్సు కూడా ఊర్ధ్వంగా భగవంతుని వైపు నడవకుండా, అధోముఖంగా ప్రపంచం వైపు పరుగులు పెడుతూ ఉంటుంది.

నీళ్ళల్లో ఉండే మరొక విశేష మేమిటంటే, అది ఏ పాత్రలో పోస్తే ఆ రూపం ధరిస్తుంది. దేనిలో పోస్తే దాని రూపాన్నే, లేదా ఆకారాన్నే పొందుతుంది. చెంబులో నీళ్ళు పోస్తే, నీళ్ళు కూడా గుండ్రంగా ఉన్నట్లు కనిపిస్తాయి. కూజాలో పోస్తే కూజా ఆకారాన్ని ధరిస్తాయి. చదరంగా ఉండే పాత్రలో పోస్తే, చదరంగా కనిపిస్తాయి. దీర్ఘ చతురస్రంగా ఉండే పాత్రలో పోస్తే దీర్ఘచతురస్రంగా గోచరిస్తాయి. తన కంటూ ప్రత్యేక ఆకృతి లేని జలం, దేనిలో పోస్తే దాని ఆకృతిని ధరిస్తూ ఉంటుంది. రూప మెలాగో, రంగు అయినా, రుచి అయినా అంతే.

మనస్సు కూడా ఏ విషయం పైకి మరలితే, దాని ఆకారాన్ని పొందుతూ ఉంటుంది. అందుకే మనస్సులో విషయాకార వృత్తులు తిష్ఠ వేసి ఉంటాయి. మనస్సుకు తెలిసినవే మనస్సులో ఉంటాయి. తెలియనివి ఉండ లేవు. తనకు లేని అనుభవాలను మనస్సు తనలో ఉంచుకో లేదు. ప్రపంచం తన అనుభవంలో ఉంది కనుక,

దాని వైపుకే మనస్సు పరుగులు పెడుతుంది. భగవ ద్విషయం మనస్సు యొక్క అనుభవంలో లేదు. అందుచేత, మనస్సు భగవంతునిపై నిలవదు. గీతాచార్యుడేమో నీ మనస్సును నా యందు ఉంచు అంటున్నాడు (**మయ్యేవ మన ఆధత్స్వ**).

**అనుభవాలే అవరోధాలు**

తెలియనివి సందేహాలను కదిలించి కలత పెడతాయి. తెలిసినవి స్వానుభవాన్ని స్మృతికి తెచ్చి వేధిస్తాయి. భగవంతునిపై మనస్సును పెట్టా లనుకున్నా పెట్టలేక పోవడానికి ఈ రెండు అవరోధాలే కట్టని గోడలై అడ్డు నిలుస్తున్నాయి.

భగవంతుడు ఉన్నాడు అని నమ్మి, ఏదో తమకు తోచిన, లేదా ఇతరులు తమపై మోపిన భావాలను మోసుకొని భారంగా భక్తి చేయడమే గాని, భగవంతుడు అంటే ఏమిటో, ఆయన స్వరూప స్వభావాలు ఏమిటో యథార్థంగా తెలిసిన వారు చాలా అరుదుగా అగుపిస్తారు. ఎక్కువ శాతం భగవంతునికి సంబంధించిన అవగాహన పూర్ణంగా లేని వారే ఉంటారు. కాని, ఉన్నట్లు అగుపిస్తారు.

భగవంతుడు అంటే ఏమిటో అర్థం కాని వారు భగవంతునిపై మనస్సు నెలా ఉంచుతారు? కనుక తెలియనితనము, అంటే జ్ఞానము లేకపోవడము భగవంతునిపై మనస్సు నిలుపలేక పోవడానికి ఒక ముఖ్య కారణము.

మొదటి కారణము తెలియనితన మైతే, రెండవ కారణము తెలిసిన తనము. భగవంతునిపై మనస్సు నిలవక పోవడానికి భగవంతునికి సంబంధించిన జ్ఞానము లేక పోవడము ఒక కారణ మైతే, ప్రపంచానికి సంబంధించిన విషయానుభవ జ్ఞానము పుష్కలంగా ఉండటము మరొక కారణము. ఇది స్వానుభవం. తనకే తెలిసిన విషయం. తన అనుభవ సారంగా మనస్సులో తిష్ఠ వేసి యున్న జ్ఞానము. ఏమిటా జ్ఞానము? ఏమిటా అనుభవం?

అదే విషయానుభవము. ప్రాపంచిక విషయానుభవ జ్ఞానము. పూర్వానుభవ సారము. గతంలో మనస్సును మనం ఎన్నో చోట్ల ఉంచాము. ఎందరి పైనో పెట్టు కున్నాము. అలా ఎందుకు పెట్టుకున్నామో, ఏమి సాధించాలని పెట్టుకున్నామో, అది మనకే తెలుసు. అంతేకాదు. ఆశించింది సాధించలేక పోయామని కూడా తెలుసు. మనస్సును ఎక్కడుంచినా, ఎవరి కిచ్చినా అది చితికి పోయిందే గాని బ్రతికి బట్ట కట్ట లేదు. మోదాన్ని ఊహించి మోసాన్ని రుచి చూసింది. ప్రమోదాన్ని కాంక్షించి ప్రమాదాలలో నలిగి పోయింది. ప్రతి చోటికి పూల దోసిళ్ళతో పరుగులు తీస్తూ వెళ్ళడం, రాళ్ళ దెబ్బలతో రాటుదేలి తిరిగి రావడం - జన్మజన్మలలో ఇలాగే అలసి పోయింది. అన్యాయమై పోయింది. విచలితమై పోయింది. విశ్వాసాన్ని ఎక్కడో పారేసుకుంది. నమ్మక మేదైనా వమ్ము చేసేదే. విశ్వసిస్తే విఘాతాలే మిగుల్తా యని, విషాదాలే ఎదురవుతా యని భీతి చెందుతోంది. చేసిన స్నేహాలు, చూసిన సంబంధాలు అన్నీ సంతాపాలనే అందించడం చేత, నేడు భగవంతునితో సంబంధాన్ని పెట్టుకోవాలన్నా, హృదయంలో ఏదో ఓ మూల సందేహం పట్టి పీడిస్తూనే ఉంది. తరిస్తానో, అంతరిస్తానో అని మనస్సు ఆవేదన చెందుతూనే ఉంది.

*విసిగి పోయాను విని విని జగతి గోడు*
*నిన్ను చేరాలని నా మనసు జగడ మాడు*
*అడుగుతున్నాను అడుగైన వేయలేక*
*నీ అడుగుల కడ పడి ఉందు నీలకంఠా!* అని నీలకంఠ శతకంలో ఒక విబూది పండు.





దేహంలో మనస్సు, మనస్సులో సందేహము - అవి అలా ఉండాల్సిందే. అలాగే ఉంటాయి కూడా. పరమాత్మ జ్ఞానం కలిగే వరకు ఈ జంటలు విడి పోకుండా ఉంటాయి. సందేహ మనేది మనస్సులో ఉండక పోతే మట్టిలో ఉంటుందా? ఎందుకు ఉంది అంటే ఏమి చెప్పగలం? మనస్సు అంటే ఏమిటో తెలియక పోవడమే ఈ ప్రశ్న వేయడానికి కారణము.

సందేహాల పుట్టనే మనస్సు అంటారు. నిశ్చయ జ్ఞానము లేనపుడే సందేహం పుట్టు కొస్తుంది. ఏ విషయాన్నైనా పిచ్చి పట్టినట్లు చిందులేస్తూ ఆలోచించడమే గాని, ఏ ఒక్క విషయానికి సంబంధించిన నిశ్చయ జ్ఞానము కూడా మనస్సులో ఉండదు. అందుకే సందేహాలు, సంతాపాలూను.

**మనః సంకల్ప వికల్పాత్మకమ్** - సంకల్ప వికల్పాలతో కూడిన దానిని మనస్సు అంటారు. రెండు చేతు లున్నందుకు, ఎప్పుడూ రెండు విషయాలను చేత పట్టుకొని, ఈ రెండిటిలో ఏది సమంజసము - ఏది అసమంజసము, ఏది మేలు - ఏది కీడు అంటూ నిశ్చయం లేకుండా సంశయంలో పడి కొట్టుమిట్టాడే దానినే మనస్సు అంటారు.

మనిషితో దిన మంతా మనస్సే కలిసి ఉంటుంది. మనిషి నిద్రించినా, మనస్సు మేలుకొని కలలు కంటూ ఉంటుంది. అన్నిచోట్ల చూపులే. మనస్సు పొరపాటున కూడా చేతలలో చేయి దూర్చదు. రోజంతా తోడు ఉంటుంది. క్షణం కూడా సందేహంపై మోజు విడిచి పెట్టదు. రోజు ప్రారంభమే సందేహం మోజులో ఆరంభ మౌతుంది. నిద్ర లేవడమే సందేహంతో మనస్సు నిద్ర లేస్తుంది.

మనిషి రాత్రి ఎన్ని గంటలు నిద్రించినా, నిద్ర లేచే సమయంలో ఇప్పుడే లేద్దామా, మరి కొంత సేపు పడుకుందామా? అనే సందేహంలో పడతాడు. అంటే, మనిషి లేవక ముందే మనస్సు ముస్తాబై సందేహాల మూటను నెత్తి నెట్టుకొని సిద్ధంగా ఉందన్న మాట. ఇక, మనిషి నిద్ర లేచి మాత్రం సాధించే దేముంటుంది? నిద్ర పోని మనస్సుతో కాపురమే కదా! మనస్సు మేలుకొని ఉన్నంత కాలం దాని సంతర్పణే సరిపోయె! ఇక మనిషికి సద్భక్తి కలిగే దెప్పుడు?

**భగవంతుని మీదే బుద్ధి**

అందుకనే, అర్జునా! నీ మనస్సును నా యందు ఉంచు అని చెప్పిన గోవిందుడు, వెంటనే గ్రుక్క త్రిప్పుకోకుండా, నీ బుద్ధిని నా యందు ఉంచు అనేశాడు (**మయి బుద్ధిం నివేశయ!**). మనస్సైనా, బుద్ధి అయినా అంతఃకరణమే కదా! అలాంటప్పుడు నీ మనస్సును నా యందు ఉంచు అని చెప్పిన భగవంతుడు, నీ బుద్ధిని నా యందు ఉంచు అని వెంటనే ఎందుకన్నాడో అర్థం చేసుకోవాలి.

సంకల్ప వికల్పాత్మకం మనస్సు అయితే, బుద్ధి నిశ్చయాత్మకం. రెండు విషయాలను పట్టుకొని సందేహాల మధ్య సతమత మయ్యేది మనస్సైతే, ఆ రెండిటిలో ఒక దానిని నిశ్చయించే జ్ఞానమే బుద్ధి. కనుక, సందేహించే మనస్సునే గాక, నిశ్చయించే బుద్ధిని కూడా నా యందు ఉంచు అంటున్నాడు (**మయ్యేవ అధ్యవసాయం కుర్వతీం బుద్ధిమ్**). అధ్యవసాయము అంటే నిశ్చయము. దానినే వ్యవసాయాత్మక బుద్ధి అని రెండవ అధ్యాయంలో చెప్పుకున్నాం. అంటే, నిశ్చయాన్ని చేసే బుద్ధి అని అర్థము.

భగవంతుని మీద మనస్సు నిలవక పోవడానికి భగవంతునికి సంబంధించిన నిశ్చయ జ్ఞానము లేక పోవడమే కారణం కనుక, బుద్ధిని సమర్పించడము అంటే, నిశ్చయ జ్ఞానాన్ని పొంది అనన్య యోగముతో జీవించడ మని అర్థము.

మరి, అలాంటప్పుడు నిశ్చయించేది బుద్ధి కనుక, బుద్ధిని నా యందు ఉంచు అని చెబితే సరిపోతుంది

కదా! సందేహాస్పదమైన మనస్సు యొక్క ప్రస్తావన ఎందుకు? అనే సంశయము కలుగుతూ ఉంది కదూ? అదే మనస్సు కార్యము.

మనస్సు సంకల్పాలు చేస్తేనే బుద్ధి నిశ్చయిస్తుంది. బుద్ధి నిశ్చయించేదే కాని, సంకల్పాలు చేసేది కాదు. కనుక సంకల్ప వికల్పాత్మక మైన మనస్సును, విషయ నిర్ధారణ చేసి నిశ్చయించే బుద్ధిని, రెండిటిని తన యందే ఉంచమని భగవంతుడు చెప్పడంలో విశేష మిదే.

బుద్ధి వృత్తులన్నీ తద్వృత్తులుగా, అంటే భగవ త్సంకల్పాలుగా మారడమే బుద్ధిని పరమేశ్వరునిపై ఉంచడము. అంతటా బుద్ధి వృత్తికి భగవంతుణ్ణి విషయంగా మార్చడమే ప్రధానమైన విషయము.

ఇదే జరిగితే, ఆ తరువాత భక్తుడు భగవంతుని యందే ఉంటాడు ***(నివసిష్యసి మయ్యేవ, మయి నివాసం కరిష్యసి ఏవ).***

ముముక్షువునకు కావలసింది మోక్షము. మోక్షము జ్ఞానరూపంలో ఉంది. జ్ఞానమునకు అంతఃకరణ శుద్ధి అవసరం. అంతఃకరణ శుద్ధి కర్మయోగం వల్ల ప్రాప్తం. ఈ విధంగా నిశ్చయ జ్ఞానము గల బుద్ధి భగవంతుని లోనే ఉంటుంది. ఆ తరువాత సంశయాలకు తావుండదు. నిశ్చయాత్మకమైన బుద్ధి భగవంతుని యందు ఉంది అంటే బ్రతుకు ధన్యమైంది అని అర్థము. ఈ దశలో సందేహాలు ఉండే అవకాశం లేదు. అందుకనే ***న సంశయః*** - సందేహమును విడిచి పెట్ట మంటున్నాడు భగవంతుడు.

మనోబుద్ధులను పరమాత్మకు సమర్పించి జీవించే భక్తులు ధన్యజీవులు. ఇదే ఉత్తమమైన సాధన. ఉత్తమోత్తమ మైన ఈ సాధనను సర్వులూ ఆచరించ గలరా? ఒకవేళ ఆచరించలేని వారి పరిస్థితి ఏమిటి?

*భగవంతుడు మరో మెట్టు దిగి ప్రసంగిస్తున్నాడు.*

**అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్ ।**
**అభ్యాసయోగేన తతో మా మి చ్ఛాప్తుం ధనఞ్జయ ॥** 9

***అథ-చిత్తం-సమాధాతుం-న-శక్నోషి-మయి-స్థిరం***
***అభ్యాసయోగేన-తతః-మాం-ఇచ్ఛ-ఆప్తుం-ధనంజయ***

| | | | | | |
|---|---|---|---|---|---|
| ధనంజయ | = | అర్జునా! | న శక్నోషి | = | అశక్తుడవైతే |
| అథ | = | ఇంకను | తతః | = | అటుపైన |
| మయి | = | నా యందు | అభ్యాసయోగేన | = | అభ్యాసయోగము చేత |
| స్థిరం | = | నిలకడగ | మాం | = | నన్ను |
| చిత్తం | = | మనస్సును | ఆప్తుం | = | పొందుటకు |
| సమాధాతుం | = | నిలుపుటకు | ఇచ్ఛ | = | ప్రయత్నించు |

**ధనంజయా! అర్జునా! మనస్సును నా యందు స్థిరంగా ఉంచే సామర్థ్యం లేకపోతే, అభ్యాస యోగంతో నన్ను పొందేందుకు ప్రయత్నించు.**

**వ్యాఖ్య**

విశ్వరూపంలో ఉన్న విశ్వమూర్తిని ఉపాసించే స్థిర చిత్తము లేని వారికి సులభోపాయంగా ప్రత్యమ్నాయ సాధనలు చెబుతున్నాడు. ప్రథమంగా అభ్యాస యోగము.

అర్జునా! విశ్వరూప పరమేశ్వరుడైన నా యందే మనస్సును, బుద్ధిని ఉంచ మన్నాను. ఒకవేళ ఆ విధంగా





***(అథ ఏవం)*** నా యందు మనస్సును ఏకాగ్రం చేసే సామర్థ్యం లేకపోతే ***(మయి చిత్తం స్థాపయితుం స్థిరమ్ న శక్నోషి చేత్),*** అభ్యాస యోగం చేత ***(అభ్యాస యోగేన)*** నన్ను పొందేందుకు ప్రయత్నించు ***(మామ్ ఆప్తుం ఇచ్ఛ)*** అంటున్నాడు భగవంతుడు.

**సాధనాంతరము**

మనోబుద్ధులను పరమేశ్వరుని యందు లగ్నం చేయడ మనేది మహోన్నతమైన సాధన. అలాంటి సాధన సాధ్యపడని వారికి కాస్త తక్కువ స్థాయి సాధన అయిన అభ్యాస యోగాన్ని ఉపాయాంతరంగా సూచిస్తున్నాడు. అందుకే నేమో 'అభ్యాసము కూసు విద్య' అనే సామెతను పెద్దలు ఉదహరిస్తూ ఉంటారు.

అభ్యాసము లేని విషయాలలో అభివృద్ధి అగుపించదు. కొందరు పట్టుమని పది నిముషాలు ఒకచోట కూర్చోలేరు. కానీ, ఎన్ని గంటలు తిరగమన్నా తిరుగుతూ ఉంటారు. అభ్యాసం గల వక్త గంటల తరబడి వేదికపై కూర్చొని కాలు కదపకుండా ప్రసంగిస్తూ ఉంటే, అభ్యాసం లేని కారణంగా శ్రోతలు అటు ఇటు కదుల్తూ, కాళ్ళు మార్చుకుంటూ ఉండటము ప్రవచనాలు జరిగే చోట స్పష్టంగా చూడ గలం.

ఉపాసన, ధ్యానాది సాధన లందు మనస్సు క్షణం నిలవకుండా పరుగులు తీస్తూ ఉంటుంది. ఆసక్తి లేకపోవడం ఒక కారణమైతే, అభ్యాసం లేకపోవడం రెండవ కారణము.

తిరిగే కాలు, తిట్టే నోరు ఊరుకోవు అంటూ ఉంటారు పెద్దలు. అవైనా ఊరుకుంటాయేమో గాని, తిరిగే మనస్సు మాత్రం ఒక చోట ఉండట మనేది బ్రహ్మ ప్రళయమే. అలా నిలవని చిత్తాన్ని స్థిరంగా నిలపడానికి చేసే ప్రయత్నమే అభ్యాస యోగము.

**అభ్యాస యోగము**

చంచలమైన చిత్తాన్ని స్థిరంగా ఒకచోట నిలిపే ప్రత్యామ్నాయ సాధన అభ్యాస యోగము. అంటే, ధ్యాన సమయంలో మనస్సును బాహ్యానికి పరుగులు పెట్టకుండా ఆంతర్యంలో నిలపడమే అభ్యాస యోగము.

మనస్సు బహిర్ముఖమైతే, ఎటైనా పోవచ్చు. అనేక విషయాలలో సంచరించ వచ్చు. కానీ, ఆంతర్యంలో ధ్యేయ విషయంపై నిలిస్తే మాత్రం ఏక రూపమై ఉంటుంది. కనుక, అలా బహిర్ముఖమై అనేక విషయాలలో చరించే చిత్తమును అన్నిటి నుండి వెనుకకు మరలించి ***(సర్వతః సమాహృత్య)*** ఒకే ఆలంబనంలో ***(ఏకస్మిన్ ఆలంబనే)*** మళ్ళీ మళ్ళీ ***(పునః పునః)*** నిలపడము అభ్యాసము ***(స్థాపనమ్ అభ్యాసః).*** అట్టి అభ్యాసముతో కూడిన యోగము అభ్యాస యోగము ***(తత్పూర్వక యోగః అభ్యాసయోగః).***

అభ్యాస యోగము అనే దానిలో రెండు పదాలు ఉన్నాయి. ఒకటి అభ్యాసము. రెండవది యోగము. అనేక విషయాల మీదికి పరుగులు పెట్టే మనస్సును సమస్తము నుండి సమాహరించి ఒకే ఆలంబనము నందు నిలపడము అభ్యాసము. ఈ అభ్యాసాన్ని పదే పదే చేస్తూ ఉండాలి. మళ్ళీ మళ్ళీ ఆచరిస్తూ ఉండాలి. ఎందుకని? మనస్సును మనం ఉపసంహరించినా, అది మళ్ళీ మళ్ళీ ఉద్యమిస్తూ ఉరకలేస్తూ ఉంటుంది కనుక.

విపరీత ప్రత్యయాలను నిరోధించి, అనుకూల ప్రత్యయముపై మనస్సును నిలపడానికి పదే పదే చేసే ప్రయత్నమే అభ్యాస యోగము. అంటే, విజాతీయ రహిత సజాతీయ వృత్తి ప్రవాహము నిరంతరము కొనసాగేలా చూడటానికి ఉపయోగించే సాధనే అభ్యాసము. మనస్సును నిగ్రహించడానికి ఉత్తమమైన సాధనము.

చంచలమై, నిలకడ లేకుండా ఎక్కడెక్కడో సంచరించే మనస్సును ఆయా ప్రదేశాల నుండి, విషయాల నుండి మరలించి, ఆత్మ యందు నిలిచే లాగా ప్రయత్నించాలి అని ఆరవ అధ్యాయంలో భగవంతుడు

ఉపదేశించి ఉన్నాడు *(6 - 26)*. ఇది ఆత్మధ్యానానికి సంబంధించిన విషయము. ఆత్మను ఆలంబనం చేసుకొని మనస్సును నియమించడం సులభ సాధ్యం కాదు. అరూపమైన నిర్గుణము నందు మనస్సును స్థిరంగా ఉంచ లేము. కానీ, ప్రస్తుతము, ఇక్కడ మనం అర్థం చేసుకుంటున్న అభ్యాస యోగము నిర్గుణానికి సంబంధించింది కాదు. ఇది సగుణ బ్రహ్మ విషయము. ఇక్కడ ధ్యేయమూర్తి సాకారము. ఆలంబనముగా ప్రతిమాది రూపాలు ఉంటాయి.

మనస్సు బాహ్య విషయాల మీదికి వెళ్ళేటప్పుడు, దానిని వెనుకకు మరల్చి, ఒక విగ్రహము నందు గాని, మూర్తి యందు గాని, ఏదో ఒక రూపము నందు గాని, బ్రహ్మ భావన కలిగి, దాని యందు మనస్సును ఏకాగ్రం చేయడమే అభ్యాసము. ఆత్మధ్యానం కన్నా ప్రతిమా ద్యాలంబనము నందు మనస్సును నిలిపి ధ్యానమును కొనసాగించుట అభ్యాస యోగము. అంటే, విపరీత ప్రత్యయ రహిత, అనుకూల ప్రత్యయ వృత్తి ప్రవాహము. ఇంకా స్పష్టంగా చెప్పాలి అంటే, విజాతీయ వృత్తి రహిత సజాతీయ వృత్తి ప్రవాహ సగుణ బ్రహ్మ విషయ మానస వ్యాపారము. ఇదే ధ్యానము. దీనికి సాధనాంతరము అభ్యాస యోగము.

మన ప్రయత్నాలు సాగుతూ ఉన్నా, మనస్సు చలిస్తూనే ఉంటుంది కనుక, చేజారి క్రింద పడిన వస్తువును తిరిగి తీసుకొని జేబులో పెట్టుకున్నట్లు, నిలవకుండా పరుగులు తీసే మనస్సును అంతర్ముఖం చేసి ఏకమైన ఆలంబనమైన ధ్యేయమూర్తిపై నిలుపుతూ ఉండాలి. అది పోతూనే ఉంటుంది. మనం తెచ్చి పెడుతూనే ఉండాలి. దుర్నిగ్రహమైన మనస్సు అభ్యాస వైరాగ్యాల ద్వారానే నిగ్రహింప బడుతుంది అని భగవంతుడు ఆత్మసంయమ యోగంలో చెప్పే ఉన్నాడు కదా! *(6 - 35)*.

**యోగాభ్యాసము**

అభ్యాస యోగాన్ని ఉపాయాంతరంగా గ్రహించి ధ్యానయోగమును అభ్యసించాలి. అదే యోగాభ్యాసము. అభ్యాసయోగం ద్వారా యోగాభ్యాసము స్థిర పడుతుంది. ఇలా స్థిర పడిన యోగాభ్యాసము విశ్వరూపోపాసనను సుగమం చేసి, సుకరంగా తీర్చి దిద్దుతుంది.

ప్రాపంచిక విషయాలలో పడి మనస్సు పాడై పోయింది. పచ్చి అరటి బోదెను ఎంత తగల బెట్టినా, పచ్చి కట్టెల్ని ఎంత కాల్చినా, పొగ వస్తుందే గాని మంట రాదు. అలాగే ప్రాపంచిక విషయ జలాలలో బాగా తడిసి పోయిన మనస్సును ధ్యానంలో నిలిపే ప్రయత్నం చేసినా, ఆంతర్యంలో సెగలు, పొగలు రగులుతాయే గాని జ్ఞాన జ్యోతి వెలగదు.

వత్తిని సూర్యరశ్మిలో ఎండబెట్టి, ఆ తరువాత నేతిలో ముంచి వెలిగిస్తేనే దీపం దివ్యంగా అఖండంగా ప్రకాశిస్తుంది. విషయ వాసనా జలాలలో పడి తడిసి పోయిన పచ్చి అరటి బోదె లాంటి చిత్తమును వైరాగ్య మనే సూర్యకాంతిలో ఎండబెట్టి, భక్తి అనే ఘృతంలో తడిపి, అభ్యాస మనే జ్వాలను తోడు చేస్తే, ఆ తరువాత ధ్యానదీపం దివ్యంగా ప్రకాశిస్తుంది. ప్రతి ఒక్కరు ధ్యానజ్యోతి వెలుగులో జ్ఞానసిరిని ప్రోగు చేసుకోవాలి. ఈ సత్యాన్ని ఎరుక పరుస్తూ, ఈ సందర్భంలో అర్జునుని ***ధనంజయ!*** అని పిలుస్తున్నాడు గీతాచార్యుడు.

ధనంజయా! రాజసూయ యాగ సమయంలో ఎందరో చక్రవర్తుల్ని జయించి, ధనాన్ని ప్రోగు చేసిన వాడివి. కానీ, నీ మనస్సును నీవు జయించ గలిగితే నీకు జ్ఞాన ధనం సిద్ధిస్తుంది. అక్షయ సిరి ప్రాప్తిస్తుంది. మోక్షలక్ష్మి నిన్ను వరిస్తుంది. అభ్యసించి యోగాన్ని ఆచరించు. చిత్తాన్ని నిరోధించు. విషయాలను ధ్యానించే చిత్తాన్ని నిగ్రహించి, పరమేశ్వరుని చరణ కమలాల వద్ద స్థిరంగా ఉంచేయ్! నిలవకుండా పరుగులు తీసినా, పదే పదే అభ్యాసం ద్వారా దారి మళ్ళించి, చిత్తాన్ని యోగంలో నిలుపు, అని పరమాత్మ ఆదేశం. ఇదే అభ్యాస యోగము. ఒక ఉదాహరణం వినండి.





శ్లో॥ *చేతో మత్త మదం గజం మదభర భ్రాన్తం భ్రమన్తం దిశో*
*దుస్సంకల్ప వికల్ప దన్త దలిత ప్రోద్దామ ధైర్య ద్రుమమ్,*
*ఉద్యద్గాఢతర ప్రబోధ నిగడం భూయః సమాక్రామితుం*
*ధాత్రా యోజిత మద్భుతం నరహరే రాలాన మఙ్ఘ్రి ద్వయమ్ ॥*

చిత్తము మదపు టేనుగు వంటిది. వివేక మనే దృఢమైన గొలుసుతో ఎంతగా కట్టినా, మాటి మాటికీ బలవంతంగా త్రెంచుకొని నానా దిక్కులలో పడి పరుగులు తీస్తూనే ఉంటుంది. దుర్భరమైన సంకల్ప వికల్పాలనే దంతాలతో ధైర్యమనే మహా వృక్షాన్ని సైతం కూల్చేస్తుంది. అలాంటి చిత్త మనే మద మత్తేభాన్ని శ్రీహరి పద పంకజాలనే స్తంభానికి మళ్ళీ మళ్ళీ తీసుకొని వచ్చి కట్టేస్తూ ఉండాలి. ఇది అభ్యాసం. ఇదే యోగం. ఇదే అభ్యాసయోగం. యోగాభ్యాసం.

*ఒకవేళ, అభ్యాస యోగంలో కూడా అశక్తులైతే, తరువాత ఏమి చేయాలి? వినండి.*

అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మ పరమో భవ ।
మదర్థ మపి కర్మాణి కుర్వన్ సిద్ధి మవాప్స్యసి ॥ 10

అభ్యాసే-అపి-అసమర్థః-అసి-మత్కర్మపరమః-భవ
మదర్థం-అపి-కర్మాణి-కుర్వన్-సిద్ధిం-అవాప్స్యసి

| | | | |
|---|---|---|---|
| అభ్యాసే అపి | = అభ్యాసయోగము నందు కూడా | కర్మాణి | = కర్మలను |
| అసమర్థః | = అసమర్థుడవు | మదర్థం | = నా కొరకుగా |
| అసి | = అయితే | కుర్వన్ అపి | = చేయుచున్నను |
| మత్కర్మపరమః | = నా నిమిత్తమైన కర్మ యందు పరాయణుడవు | సిద్ధిం | = సిద్ధిని |
| భవ | = కమ్ము! | అవాప్స్యసి | = పొందగలవు |

**అర్జునా! అభ్యాసంలో కూడా అశక్తుడ వైతే, నా కొరకు కర్మలు చేస్తూ పో! నా కొరకు కర్మలు ఆచరించినా సిద్ధిని పొందుతావు.**

**వ్యాఖ్య**

మోక్షం జ్ఞానరూపంలో ఉన్నందున జ్ఞానం ద్వారానే మోక్షం ప్రాప్తిస్తుంది. మరో మార్గం లేదు. కానీ, చిత్తశుద్ధి లోపించిన వారికి జ్ఞానము అలవడే అవకాశము లేదు. కనుక జ్ఞానప్రాప్తి కొరకు ఉపకరించే చిత్తశుద్ధి కోసం ఉపాసనలు, కర్మలు చెప్ప బడ్డాయి. ఇవే అంతరంగ బహిరంగ సాధనలు.

ఒక ప్రదేశము నందు కూర్చొని అనుష్ఠించే సగుణ ధ్యానము అంతరంగ సాధన అవుతుంది. అది కష్ట సాధ్యమైన వారికి సాధనాంతరంగా అభ్యాసయోగాన్ని సూచించాడు భగవంతుడు. ఒకవేళ అభ్యాస యోగాన్ని ఆచరించడానికి కూడా అశక్తులైన వారు అంతరంగ సాధన అయిన ధ్యానాన్ని ప్రక్కన బెట్టి బహిరంగ సాధన మైన కర్మయోగము వైపు దృష్టిని సారించ మని ప్రస్తుత శ్లోకంలో చెబుతున్నాడు.

అర్జునా! అభ్యాసము నందు కూడా అసమర్థుడవు అయితే **(అభ్యాసే అపి అసమర్థః అశక్తః అసి తర్హి),** నా కొరకు కర్మలు ఆచరించే వాడివి కా! **(మత్కర్మ పరమః భవ!).** నా కొరకే కర్మలను ఆచరించినా సిద్ధిని పొందుతావు అంటున్నాడు భగవంతుడు. ఇక్కడ 'సిద్ధి' అంటే మోక్షము కాదు, చిత్తశుద్ధి అని అర్థము. ముందు చిత్తశుద్ధి కలిగితే, ఆ తరువాత జ్ఞానప్రాప్తి ద్వారా మోక్షము సిద్ధిస్తుంది అని భావము.

**ఈశ్వర కార్యము**

లోకంలో కర్మ లున్నాయే గాని, ఈశ్వర కర్మలు, జీవకర్మలు అని రెండు లేవు. కర్మలు ఈశ్వర భావనతో చేస్తే ఈశ్వరకర్మ లవుతాయి. జీవభావనతో చేస్తే జీవకర్మ లవుతాయి.

ఏ కర్మ చేసినా, నేను చేస్తున్నాను అనే భావన మనిషిలో ఉంటుంది. కర్మ ముగిసిన తరువాత ఈ కర్మ నా వల్లే జరిగింది అనే భావన దృఢంగా ఉంటుంది. ఇదే జీవ భావన. అభిమానముతో కూడిన కర్తృత్వము కర్తృత్వాభిమానము.

ఈ విధమైన కర్తృత్వాభిమానంతో సాగిన కర్మ జీవకర్మ. కర్తృత్వాభిమానంతో సాగే జీవకర్మలు బంధహేతువు లవుతాయి. అభిమానంతో కర్మాచరణం సాగించే జీవుడు బద్ధు డవుతాడు. అలా కాకుండా, ఈశ్వర భావన కలిగి యుండి, తాను నిమిత్త మనే బుద్ధితో కర్మలు ఆచరిస్తే, అవి ఈశ్వర కర్మ లవుతాయి. ఈశ్వర కర్మ లాచరించే వారు బద్ధులు కారు. బుధు లవుతారు. బుద్ధి శుద్ధి పడిన వారవుతారు. శుద్ధ బుద్ధు లవుతారు.

**మత్కర్మ** అంటే **మదర్థం కర్మ** అని అర్థము. భగవంతుని కొరకు చేసే కర్మలు మదర్థ కర్మలు. అంటే, ఈశ్వర ప్రీత్యర్థం ఆచరించే కర్మలు. ఈశ్వరార్పణ బుద్ధితో అనుష్ఠించే కర్మలు.

కర్మలు చేసేది మనమే అయినపుడు ఈశ్వరార్పణ భావంతో ఎందుకు చెయ్యాలి? అనే సంశయం కలగవచ్చు. కర్మల విషయంలో అవగాహన ఏర్పడనంత కాలము మనమే కర్మలు చేస్తున్నా మనే అహంకారము ఉంటుంది. కర్మల స్వభావ స్వరూపాలు అర్థమైన నాడు ఈశ్వరుని ప్రమేయం లేకుండా స్వల్పమైన కర్మను కూడా ఆచరించడం సాధ్యం కాదని బోధ పడుతుంది. అందుకనే మన పెద్దలు శివుని ఆజ్ఞ లేనిదే చీమైనా కుట్టదు అంటూ ఉంటారు.

ఈశ్వరాజ్ఞ చేత కర్మలు జరిగే టప్పుడు, ఈశ్వరాజ్ఞ వల్లే ఫలితాలు అందేటప్పుడు ***(కర్తుః ఆజ్ఞయా ప్రాప్యతే ఫలం)*** అవి ఈశ్వర కర్మ లవుతాయే గాని, మన కర్మ లెలా అవుతాయి?

దండ కట్టినా, పిండి కొట్టినా, బండి లాగినా, బండ నెత్తినా చేతులలో శక్తి ఉండాలి. చేతులు మనవి కావచ్చు. చేతుల లోని శక్తి మనదో కాదో ఒకసారి ఆలోచించాలి.

మాట పలకాలన్నా, పాట పాడాలన్నా, వడ్డించింది తృప్తిగా తినాలన్నా, నిందలు వడ్డిస్తూ ఇతరులను తిట్టాలన్నా, నోటికి శక్తి ఉండాలి. నోరు మనదే కావచ్చు. నోటి లోని శక్తి మనదో కాదో కొద్దిగా విచారించాలి.

నడిచేందుకు మనకు కాళ్ళున్నాయి. చూచేందుకు కళ్ళున్నాయి. వినేందుకు చెవు లున్నాయి. ఆలోచించేందుకు మనస్సుంది. వీటన్నిటిలో శక్తి ఉంది. ఆ శక్తి ఏమిటో ఆలోచిస్తే అది ఈశ్వర శక్తి, పరమేశ్వర శక్తి అని అర్థ మవుతుంది. పెట్రోలు లేని వాహనం ఎలా కదల లేదో, ఈశ్వర శక్తి లేకపోతే మనం ఏదీ చెయ్యలేము. అంతా ఈశ్వర శక్తే అయినపుడు, అన్నీ ఈశ్వర శక్తి చేత నడిచే కర్మ లైనపుడు, ఇక ప్రత్యేకంగా మన కర్మ లెక్కడున్నాయి? ఉన్నాయి అనుకుంటే, అక్కడే అహంకారము తలెత్తుతుంది. ఆ తరువాత అనర్థాలను మోయలేక తల దించుకోవలసి వస్తుంది.

కర్మలు మన వల్లే జరిగే టట్లైతే, అపజయాలు ఎందుకుంటాయి? కర్మ లాచరించే శక్తి మనదే అయితే, అశక్తత లెందు కుంటాయి? విద్యుద్దీపాలు దివ్యంగా ప్రకాశించ వచ్చు. ఆ ప్రకాశము ఎవరిది? ఎవరికి సంబంధించింది? దీపాలు ప్రకాశించినా, అలా ప్రకాశించే శక్తి విద్యుత్తుదే కాని దీపానిది కాదు. అందుకే అది విద్యుచ్ఛక్తి.





మన దేహేంద్రియ మనస్సుల ద్వారా సాగే కర్మల లోని శక్తి కూడా మనది కాదు. అది భగవంతుని శక్తి. భగవచ్ఛక్తి. ఈశ్వర శక్తి. ఈ సత్యాన్ని గ్రహించిన మరుక్షణం మన కర్మలన్నీ ఈశ్వరకర్మ లవుతాయి. మనం నిమిత్తంగా మారి పోతాము. అహంకారం బుద్ధి నుండి పారి పోతుంది.

**ఈశ్వరార్పణం**

కర్మ లన్నీ ఈశ్వరానుగ్రహం చేత సాగుతున్నాయి కనుక, ఈశ్వరునికి అర్పించకుండా వాటిని మనం అనుభవించ లేము. అన్ని కర్మల వెనుక ఈశ్వర చైతన్యమే ఉంది. కనుక, అన్ని కర్మలకు ముందు వెనుక ఈశ్వర భావనే ఉంటుంది.

దీపానికి నమస్కరించి దీపం వెలిగిస్తాము. వెలిగించిన తరువాత దీపదర్శనం చేస్తూ, **దీప జ్యోతిర్నమోస్తుతే** అంటూ చేతులు జోడించి నమస్కరిస్తాము.

దీపం వెలిగించాలని సంకల్పించినా, వెలిగించే లోగా పక్షవాతం వచ్చి చేతులు పడిపోతే, చేసే దేమీ ఉండదు, దురదృష్టాన్ని చూసి దుఃఖించడం తప్ప. ఇలా ఎన్ని సంఘటనలు లోకంలో మనం చూడటం లేదు! అలా జరగకుండా జ్యోతి ప్రజ్వలనం చేయాలంటే, చేతులు పడిపోకుండా చేతులను శక్తివంతంగా నిలిపే ఈశ్వర శక్తి మనకు తోడుగా ఉండాలి. అందుకే దీప ప్రజ్వలనానికి ముందే నమస్కరించి, భగవాన్! చేయించే వాడివి నీవే. నేను నిమిత్తమాత్రుణ్ణి అని దణ్ణం పెడుతున్నాం.

అలాగే దీపాన్ని వెలిగించిన తరువాత, కనులారా కాంతిని దర్శించి, కరములు జోడించక ముందే కళ్ళు శాశ్వతంగా మూత పడితే, ఏం చెయ్యగలం? భగవత్కృప వల్ల కళ్ళు ఎంత కాలమైనా చూడవచ్చు. కృప తప్పిన వేళ, మూత పడటానికి రెప్పపాటు చాలు. అలా మూత పడకుండా దీప దర్శనం చేస్తూ వందనం అర్పించడానికి, మన కళ్ళ లోని వత్తులను వెలిగించే శక్తి వాసుదేవునిదే గాని, మన దవుతుందా? భగవాన్! నీ వల్లనే జ్యోతి ప్రజ్వలనం చేశాను. నీ కృపతో వెలిగించిన జ్యోతిని, నీ కృపతో వెలిగే నా కన్నుల కాంతితో దర్శిస్తున్నాను. అంతా నీవే చేయించావు. అంతా నీ ప్రసాదమే. నేను నిమిత్త మాత్రుణ్ణి. ఇదే ఈశ్వరార్పణ బుద్ధి. మత్కర్మ భావన. ఈ భావన బుద్ధిని శుద్ధి చేస్తుంది. జ్ఞానానికి సిద్ధం చేస్తుంది.

ఈశ్వరశక్తి వైభవము ఎలాంటిదో, అది తన జీవితాన్ని ఎలా ప్రభావితం చేస్తూ ఉందో అర్థమైతే, ఆ తరువాత ఈశ్వరుని యందు ఆసక్తి పెరుగుతుంది. అనురక్తి వృద్ధి చెందుతుంది. పరానురక్తిలో బుద్ధి పరవశిస్తుంది. ఈశ్వర ప్రేమ హృదయంలో నిండి ఉంది కనుక, కర్మలన్నీ ఈశ్వర కర్మ లవుతాయి. దైవం ధర్మరూపంలో ఉన్నందున కర్మలలో ధర్మాచరణం ఉంటుందే గాని రాగద్వేషాలు తలెత్తవు. బ్రతుకు ధర్మ సౌరభంతో పరిమళిస్తుంది.

ధర్మజీవన ఫలంగా ప్రాప్తించే శాంతిలో హృదయం ప్రసన్నంగా ఉంటుంది. సంసారంలో కొనసాగుతున్నా, లోకంలో ఉన్నా, భగవద్గుణ సారరూపుడైన పరమేశ్వరుడే హృదయంలో సంభావింప బడుతూ ఉంటాడు. శ్రవణ కీర్తనాదుల ద్వారా మనస్సు లోకేశ్వరుని యందే ఓలలాడుతూ ఉంటుంది **(లోకేఽపి భగవద్గుణ శ్రవణ కీర్తనాత్)**. ఈ విధంగా **మత్కర్మ** వల్ల లేదా **మదర్థ** కర్మ వల్ల బుద్ధి అనుక్షణమూ శుద్ధి పడుతూ, జ్ఞానానికి సిద్ధపడుతూ ఉంటుంది. అలా శుద్ధిపడిన బుద్ధి జ్ఞానప్రాప్తి ద్వారా మోక్షాన్ని పొందుతుంది.

*అభ్యాస యోగంలో అశక్తు డైనట్లే, ఈ మత్కర్మ పరత్వంలో కూడా అసమర్థు డైతే, ఆ తరువాత పరిస్థితి ఏమిటి? చెబుతున్నాడు.*

**అథైత ద ప్యశక్తోఽ సి కర్తుం మద్యోగ మాశ్రితః ।**
**సర్వకర్మ ఫలత్యాగం తతః కురు యతాత్మవాన్ ॥** 11

*అథ-ఏతత్-అపి-అశక్తః-అసి-కర్తుం-మద్యోగం-ఆశ్రితః*
*సర్వకర్మఫలత్యాగం-తతః-కురు-యతాత్మవాన్*

| | | | | | |
|---|---|---|---|---|---|
| అథ | = | ఇంకను | మద్యోగం | = | నా యోగమును |
| ఏతత్ అపి | = | ఇది కూడా | ఆశ్రితః | = | ఆశ్రయించిన వాడవై |
| కర్తుం | = | ఆచరించుటకు | యతాత్మవాన్ | = | నిగ్రహవంతుడవై |
| అశక్తః | = | అశక్తుడవు | సర్వకర్మఫలత్యాగం | = | సర్వకర్మల యొక్క ఫల త్యాగమును |
| అసి | = | అయినచో | | | |
| తతః | = | ఆ తరువాత | కురు | = | చెయ్యి |

**అర్జునా! అది కూడా చేయలేకపోతే, నా యోగాన్ని ఆశ్రయించు. మనస్సును నియమించు. ఆ తరువాత, కర్మఫలాలన్నిటినీ విడిచి పెట్టేయ్!**

**వ్యాఖ్య**

మనోబుద్ధులను పరమేశ్వరుని యందు సమర్పించుట అనే ఉత్కృష్టమైన సాధనను ఆచరించే శక్తి లేని వారికి సాధనాంతరంగా అభ్యాస యోగాన్ని సూచించడం జరిగింది. అభ్యాస యోగంలో కూడా అశక్తులైన వారికి భగవత్కర్మలను ఆచరించడము ఉపాయాంతరంగా చెప్పడం జరిగింది. అది కూడా చేయలేని వారికి చివరి సాధనోపాయాన్ని ప్రస్తుత శ్లోకంలో చెబుతున్నాడు.

అర్జునా! మత్కర్మ పరత్వం కూడా నీకు అసాధ్య మైతే, నా యోగాన్ని ఆశ్రయించి ***(మద్యోగం ఆశ్రితః)***, సమస్తమైన కర్మఫలాలను త్యజించి, నిగ్రహవంతుడవై కర్మలను ఆచరిస్తూ పో! అంటున్నాడు.

**కర్మత్యాగము**

కర్మ జరిగింది అంటే కర్త ఉంటాడు. కర్త లేకుండా కర్మ జరగడం సాధ్యపడదు. కర్మల విషయంలో ఈశ్వర వైభవాన్ని అర్థం చేసుకున్న వాడు, 'నేను కర్తను కాను - భగవంతుడే కర్త ***(నాహం కర్తా హరిః కర్తా)***, పరమేశ్వరుని అధ్యక్షత లోనే సమస్తమూ నడుస్తూ ఉంది, నేను నిమిత్తమాత్రుణ్ణి, పనిముట్టును మాత్రమే, పనితన మంతా పరమేశ్వరునిదే' అనే భావన కలిగి ఉంటాడు.

కర్మ నేను చేయడం లేదు అనే భావన ఎప్పుడైతే కలిగిందో, కర్మ చేయని వాడికి ఫలం ప్రాప్తించే అవకాశం లేనందున, కర్మాసక్తితో పాటు ఫలాసక్తి కూడా లేకుండా పోతుంది. కర్తృత్వాభిమానంతో పాటు భోక్తృత్వాభిమానం కూడా లేకుండా పోతుంది.

ఒక్క విషయాన్ని ఈ సందర్భములో జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. 'నేను కర్తను కాను' అని ఈ అధ్యాయంలో భక్తుడు భావించే దానిని అకర్మగా అర్థం చేసుకోకూడదు. 'నేను కర్మ చేయడం లేదు' అంటున్నాడే గాని, నాల్గవ అధ్యాయంలో మనం చూసిన 'అకర్త' తానని భావించడం లేదు. అది ఆత్మవిదుని విషయం. ఇక్కడ విషయం కర్మయోగి ప్రస్తావన. అది మరచి పోకూడదు.

ఆత్మ యందు కర్మ లేదు కనుక తనను 'అకర్త'గా చూస్తున్నాడు ఆత్మవిదుడు. కాని, కర్మయోగి స్థాయి అది కాదు. కర్మయోగి తాను చేయడం లేదు అంటున్నాడే గాని, తన కర్మలలో కర్తను నిరాకరించడం లేదు.





ఈశ్వరుని సర్వకర్తగా చూస్తున్నాడు కనుక తాను కర్తృత్వాభిమానం లేకుండా ఉన్నాడు. అంతే.

పదవ శ్లోకంలో చెప్పిన ఈ విధమైన సాధన, అంటే కర్తృత్వ భావనను త్యజించి మత్కర్మ పరత్వంగా జీవించడం అసాధ్య మైతే, ఈశ్వర ప్రీత్యర్థం కర్మాచరణంలో ఉంటూ **(మద్యోగం ఆశ్రితః)** ఫలాసక్తి లేకుండా జీవించ మని ఈ శ్లోకంలో చెబుతున్నాడు. అంటే, కర్తృత్వాభిమానాన్ని త్యజించ లేకపోతే, భోక్తృత్వాభిమానాన్నైనా త్యజించ మని చివరి ఉపాయాంతరాన్ని బోధిస్తున్నాడు.

కర్మత్యాగము సాధన అయితే, 'అకర్త' భావన సాధ్య మవుతుంది. కర్మఫలత్యాగము సాధన అయితే, కర్మ త్యాగము సాధన అవుతుంది. ఈ సోపానక్రమాన్ని అవధానంతో అర్థం చేసుకోండి.

ఉత్తమ కోవకు చెందిన ఆత్మవిదుడు **అహం అకర్తా** అనే భావనలో సదా ఉంటాడు. రెండవ కోవకు చెందిన మత్కర్మపరుడు **నాహం కర్తా - హరిః కర్తా** అనే భావనను కలిగి కర్మాచరణంలో ఉంటాడు. ఇతడు కర్మత్యాగి. కానీ, మూడవ కోవకు చెందిన ఫలత్యాగి **అహం కర్తా, ఈశ్వర భృత్యవత్ అహం కరోమి, అహం కర్తా - ఈశ్వరః ఫల ప్రదాతా** - 'నేను కర్తను. ఈశ్వరుని దాసుని వలె కర్మలను ఆచరిస్తాను. నేను కర్మ చేస్తాను. పరమేశ్వరుడు ఫలితాన్ని ప్రసాదిస్తాడు' అనే భావనలో ఉంటాడు. ఈ ముగ్గురిలో తేడాను గమనిస్తే, మొదటి కోవకు చెందిన 'అకర్త' అయిన ఆత్మవిదుడు ప్రస్తుతం మన ప్రసంగ విషయం కాదు. కనుక, అతనిని ప్రక్కన పెట్టవచ్చు. మిగిలిన ఇద్దరు భక్తులలో మొదటివాడు కర్మత్యాగి. పూర్వ శ్లోకంలో అతనిని గూర్చి తెలుసుకున్నాం. రెండవ వాడు ఫలత్యాగి. ప్రస్తుతం అతడి విషయాన్నే మనం చర్చిస్తున్నాం.

**ఫలత్యాగము**

కర్మ నా అధీనంలో ఉంది. ఫలం నా అధీనంలో లేదు. కర్మ నైతే నేను ఆచరించ గలను కాని, కర్మను ఫలంగా మలచే శక్తి నాకు లేదు. కర్మఫల మనేది అనేక కారణాలపై ఆధారపడి ఉంటుంది. వాటిపై నాకు నియంత్రణ లేదు.

ఫలం ఏదైనా, దానిని అనుగ్రహించే వాడు సర్వజ్ఞుడైన పరమేశ్వరుడు. నా కర్మలకు రావలసిన ఫలితాలు వస్తాయే గాని, నా ఆశలకు ఫలితాలు రావు. నేను భక్తుణ్ణి. కర్మయోగిని. నాకు మోక్షం కావాలి. అదే నా లక్ష్యం. కర్మలకు ఈశ్వరుడు ఫలితా లిస్తాడు. అవి కర్మఫలాలు. వాటి యందు నాకు ఆసక్తి లేదు. ఫలాసక్తి నాలో లేదు. కానీ, ఆ ఫలాలు ఈశ్వరుడు అనుగ్రహించేవి కనుక, వాటిని ప్రసాదంగా స్వీకరిస్తాను. ప్రసన్నంగా ఉంటాను. ఏది వచ్చినా ప్రసాదమే. ఈశ్వర ప్రసాదము ఏదైనా నా మంచికే. ఇక్కడే ప్రసాదము వస్తువుగా కాకుండా భావనగా మారిపోతోంది.

కర్మల యందు ఆసక్తి ఉండేటప్పుడు ఫలాసక్తి ఉంటుంది. కర్మత్యాగము జరిగితే, ఫలత్యాగము సహజంగా జరిగి పోతుంది. ఈ విధంగా కర్మత్యాగము అసాధ్య మని భావించే వారు కర్మలను ఈశ్వర ప్రీత్యర్థం ఆచరిస్తూ, ఫలాసక్తి లేకుండా జీవిస్తే సరిపోతుంది. కర్మత్యాగము కన్నా ఫలత్యాగము సులభతరం కదా! అందుకనే, కర్తృత్వాన్ని వీడలేని వారు 'మద్యోగులై' ఫలాసక్తిని త్యజించి భోక్తృత్వము నుండి విడిపడ వచ్చు. అందుకే ఫలత్యాగము చివరి ఉపాయాంతరంగా చెబుతున్నాడు భగవంతుడు.

ఇక్కడ మరొక గమ్మత్తు ఉంది. ఫలాసక్తి లేని వానికి కర్మాసక్తి ఉండే అవకాశం ఉంటుందా? కాస్త ఆలోచించండి. ఫలము నందు ఆసక్తి ఎప్పుడైతే లేకుండా పోతుందో, కర్మల యందు కూడా ఆసక్తి దానంతటదే క్షీణిస్తుంది. ఫలం యొక్క అవసరం నాకు లేనపుడు, కర్మ యొక్క అవసరం ఎందు కుంటుంది?

'నేను కర్తను కాను' అని భావించే వానికి ఫలాసక్తి ఉండదు. 'నేను కర్తను' అని భావించినంత వరకు ఫలాసక్తి పోదు. కర్త అనే భావం ఉండినా, ఫలాసక్తి లేనపుడు, కర్మాసక్తి కూడా ఉండే అవకాశం లేనందున, కర్మత్యాగము చేయుటకు అశక్తుడైన వాడు ***(మత్కర్మ పరత్వం కర్తుమ్ అశక్తః అసి)*** సర్వకర్మ ఫలత్యాగం చేయడం చేత ***(సర్వేషాం కర్మణాం ఫల సంన్యాసం)*** క్రమేపీ కర్మాచరణము నందు ఆసక్తిని త్యజించి కర్మత్యాగిగా మారుతాడు. కనుకనే, కర్మత్యాగము, అంటే కర్తృత్వాభిమానము త్యాగం చేయలేని వారు, ఫలత్యాగము, అంటే భోక్తృత్వాభిమానమును ప్రసాద భావన చేత త్యజించ గలరు. ఫలత్యాగము కర్మ త్యాగానికి దారి తీస్తుంది.

ఫలత్యాగి రాగద్వేషాల నుండి విముక్తుడు. ఏది వచ్చినా అతనికి ప్రసాదమే. ప్రసాదము ఎవరిని కష్టపెడుతుంది? ప్రసాద భావన ప్రసన్నతనే కలిగిస్తుంది. ప్రసన్నచిత్తుడు ఏది జరిగినా అది తన మంచికే అనే భావన లోనే ఉంటాడు.

**ఆఖ్యాయిక**

ఒక రాజు గారి ఆస్థానములో ఫలత్యాగి అయిన భక్తుడు మంత్రిగా ఉండేవాడు. అతడు అతని జీవితంలో గాని, రాజ్యంలో గాని, ఏది జరిగినా, 'అంతా మన మంచికే' అని అంటూ ఉండేవాడు. ఏదైనా మన మంచికే అనేది అతని ప్రగాఢ విశ్వాసము.

రాజు గారికి మంత్రి మాట వేదం. అతని సలహా లేనిదే ఏ కార్యమూ ఆచరించే వాడు కాదు. వేటకు వెళ్ళినా మంత్రి గారు ప్రక్కన ఉండ వలసిందే. మంత్రి గారు లేకుండా రాజుగారి పర్యటన సాగదు.

మంత్రిగారు దేశాంతరము వెళ్ళిన సమయంలో రాజుగారు అరణ్యానికి వేటాడటానికి మంత్రిగారు లేకుండా వెళ్ళవలసి వచ్చింది. అక్కడ వేటాడుతున్న సమయంలో వెనుకనే పొదలో ఉన్న క్రూరమృగ మొకటి రాజుగారిపై విరుచుక పడింది. ఎలాగో పోరాడి రాజుగారు దానిని చంపేశారు. కాకపోతే, ఆ పోరాటంలో రాజుగారి ఎడమచేతి బొటన వ్రేలు తెగి పోయింది.

రాజుగారు తిరిగి వచ్చి, చికిత్స చేయించుకొని అంతఃపురములో విశ్రాంతి తీసుకుంటూ ఉన్నారు. ఈ లోగా దేశాంతరం వెళ్ళిన మంత్రిగారు తిరిగి వచ్చారు. విషయం తెలుసుకొని, రాజుగారి సన్నిధికి వచ్చారు.

అరణ్యంలో జరిగిన సంఘటనను రాజు గారు మంత్రిగారితో చెప్పారు. విషయమంతా ఆలకించిన మంత్రిగారు, 'అలా జరగడం కూడా మన మంచికే' అన్నారు. మంత్రిగారి మాట రాజుగారికి మింగుడు పడలేదు. తన బొటనవ్రేలు తెగిపోవడం మంచికే నంటాడా మంత్రి! మంత్రికి తాను గొప్ప భక్తుడనే అహంకారము. అందుకే ఇలా మాట్లాడుతున్నాడు అని భావించి, కోపోద్రిక్తు డైన రాజు గారు మంత్రిగారికి కారాగార శిక్ష విధించారు. మంత్రిగారు కారాగృహంలో హాయిగా సంకీర్తన చేసుకుంటూ తృప్తిగా ఉన్నారు.

కొంత కాలమైంది. ఒకనాడు రాజు గారు గ్రామాంతరం వెళ్ళి వస్తూ ఉంటే, మార్గమధ్యంలో కొందరు దోపిడి దొంగలు అపహరించుకొని పోయారు. అరణ్యంలో ఒక నిర్జన ప్రదేశానికి తీసుకొని పోయారు. అక్కడ క్షుద్ర దేవతారాధన జరుగుతూ ఉంది. ఆ రోజు పూర్ణాహుతి. ఎవరైనా ఒక విశిష్టమైన వ్యక్తిని శిరచ్ఛేదం చేసి బలి సమర్పిస్తే వారి కార్యం సఫల మవుతుందని వారి విశ్వాసము.

రాజుగారికి స్నానం చేయించారు. ఎర్రటి బట్టలు కట్టారు. నుదుటన ఎర్రటి కుంకుమను దిద్ది, మెడలో ఎర్రటి పూలమాలను వేసి దేవతామూర్తి ముందుకు తీసికొని వచ్చి వధ్య శిల వద్ద నిలబెట్టారు. మరి కొన్ని నిముషాలలో రాజుగారిని వధిస్తారు.





వారి ఆచారం ప్రకారం బలి ఇవ్వబోయే వ్యక్తిని ముందుగా వారి పురోహితుడు పరిశీలించాలి. పరీక్షించాలి. వధార్హుడే అని అతడు చెబితేనే వధిస్తారు. పురోహితుడు వచ్చాడు. రాజు గారిని పరీక్షించాడు. రాజు గారికి ఎడమ చేతి బొటన వ్రేలు లేదు. అంగలోప మున్నందున వధకు పనికిరాడు అని నిర్ణయించాడు. అంతే. అడవి దొంగలు రాజు గారిని విడిచి పెట్టేశారు.

రాజుగారు అంతఃపురం చేరారు. ఆయన మనస్సులో మంత్రిగారే మెదుల్తున్నారు. నిజమే. మంత్రిగారు చెప్పింది సత్యం. బొటనవ్రేలు పోవడం తన మంచికే జరిగింది. భక్తుడైన మంత్రిగారిని అపార్థం చేసుకున్నందుకు చింతిస్తూ, రాజుగారు తామే స్వయంగా కారాగృహానికి వెళ్ళి మంత్రిగారిని విడిపించి క్షమించ మని ప్రార్థించారు. మీ లాంటి భక్తాగ్రగణ్యుల్ణి కారాగృహంలో ఉంచి నందుకు క్షమించండి అని మంత్రిగారి చేతులు పట్టుకున్నారు రాజు గారు.

అయ్యో! అయ్యో! ప్రభువులు! మీరు అలా అనడ మేమిటి? కారాగృహంలో నన్ను ఉంచడం కూడా మన మంచికే జరిగింది అన్నారు మంత్రిగారు.

అదేమిటి? 'అంతా మన మంచికే' అంటూ ఉండటం ఇతనికి ఊతపదమా? అని సందేహించిన రాజు గారు, అమాత్యవర్యా! అదేమిటి! కారాగృహంలో బంధించడం కూడా మన మంచికేనా? అని ప్రశ్నించారు.

మహారాజా! కాస్త ఆలోచించండి. నన్ను ఇలా బంధించడం జరగక పోయి ఉన్నట్లైతే, నేను లేకుండా మీరు ఎక్కడికీ వెళ్ళరు కనుక, మీతో అరణ్యంలో నేను కూడా ఉండేవాణ్ణి. మీరు వధకు అర్హులు కారు అని తెలిసిన వెంటనే, మిగిలేది నేనే కనుక, నన్ను వధించి ఉండేవారు. మీరు నన్ను కారాగృహంలో బంధించడం చేత నాకు ప్రాణహాని తప్పింది. అంతా మన మంచికే! అన్నారు.

రాజుగారు ఎంతగానో సంతసించారు. 'అంతా మన మంచికే' అనేది మంత్రి గారికి ఊతపదము అనుకున్నాను. వాస్తవానికి ఆ వాక్యమే ఆయన ఉజ్జ్వలమైన జీవితానికి ఊత మిచ్చింది అని గ్రహించలేక పోయాను అని రాజుగారు పశ్చాత్తాప పడ్డారు.

అనుకూలమైనా, ప్రతికూలమైనా ప్రసాద భావనతో జీవించే భక్తుడు ఎట్టి పరిస్థితుల లోను చెదరడు. చలించడు. అతని ప్రశాంతతను ఎవ్వరూ భగ్నం చెయ్యలేరు.

కర్మ త్యాగమైనా, ఫల త్యాగమైనా త్యాగమే ప్రధాన మని గ్రహించాలి. మూడు, నాలుగు, ఐదు అధ్యాయాలలో ఈ విషయాన్ని ఎంతగానో చెప్పుకున్నాం. ప్రస్తుతం మళ్ళీ ఇక్కడ చర్చించుకున్నాం. ఇదే విషయాన్ని పద్దెనిమిదవ అధ్యాయంలో భగవంతుడు మళ్ళీ ప్రస్తావిస్తాడు. అక్కడ మీకు మళ్ళీ జ్ఞాపకం చేస్తాను.

*కర్మఫల త్యాగము అంతటి విశిష్ట విషయం కావడం చేత భగవానుడు ఇప్పుడు దానిని స్తుతిస్తున్నాడు* **(ఇదానీం సర్వకర్మ ఫలత్యాగం స్తౌతి).**

శ్రేయో హి జ్ఞాన మభ్యాసా జ్జ్ఞానా ద్ధ్యానం విశిష్యతే । 12
ధ్యానా త్కర్మఫలత్యాగ స్త్యాగా చ్ఛాన్తి రనన్తరమ్ ॥

**శ్రేయః-హి-జ్ఞానం-అభ్యాసాత్-జ్ఞానాత్-ధ్యానం-విశిష్యతే**
**ధ్యానాత్-కర్మఫలత్యాగః-త్యాగాత్-శాంతిః-అనంతరం**

అభ్యాసాత్ = అభ్యాసము కంటే
జ్ఞానం = జ్ఞానము
శ్రేయః = శ్రేష్ఠము
జ్ఞానాత్ = జ్ఞానము కంటే

| | | | | | |
|---|---|---|---|---|---|
| ధ్యానం | = | ధ్యానము | త్యాగాత్ | = | త్యాగము వలన |
| విశిష్యతే హి | = | విశిష్ట మైనది | అనంతరం | = | ఆ తరువాత |
| ధ్యానాత్ | = | ధ్యానము కంటే | శాంతిః | = | శాంతి |
| కర్మఫలత్యాగః | = | కర్మఫలత్యాగము | | | |

**అర్జునా! అభ్యాసము కంటే జ్ఞానము శ్రేయస్కరము. జ్ఞానము కంటే ధ్యానము విశిష్టము. ధ్యానము కంటే కర్మఫల త్యాగము శ్రేష్ఠము. త్యాగము వల్ల శాంతి కలుగుతుంది.**

**వ్యాఖ్య**

**విషయ సమన్వయము**

అభ్యాసము, జ్ఞానము, ధ్యానము, కర్మఫల త్యాగము, శాంతి అనేవి ఈ శ్లోకంలో ఉత్తరోత్తర విశిష్టత్వంతో చెప్పబడ్డాయి. అంటే, వెనుకటి దాని కంటే తరువాతది విశిష్టము అనే క్రమంలో చెప్పబడ్డాయి. ఈ క్రమాన్ని అనుసరించి ప్రస్తుత శ్లోకాన్ని ఎనిమిదవ శ్లోకం నుండి మనం చెప్పుకున్న సాధనలతో సమన్వయ పరచుకొని అర్థం చేసుకోవడం సాధ్య పడదు.

ఎనిమిదవ శ్లోకంలో మనోబుద్ధులను పరమేశ్వరుని యందు ఉంచడ మనే సాధనను పరమోత్కృష్ట మైన దానినిగా అభివర్ణించడం జరిగింది. ఉన్నతమైన ఈ సాధనను ఆచరించలేని వారికి, అంటే విశిష్టమైన విశ్వరూపోపాసన అసాధ్యమైన వారికి, స్థూలమైన ప్రతిమాదుల యందు అభ్యాస యోగమును సూచించడము జరిగింది. అంటే, అభ్యాసయోగము విశ్వరూ పోపాసన కన్నా తక్కువ దని స్పష్ట మవుతూనే ఉంది కదా!

అభ్యాసయోగమును కూడా ఆచరించ డానికి అశక్తు లైన వారికి మత్కర్మ పరత్వమును, అది కూడా ఆచరించడానికి అసమర్థులైన వారికి సర్వకర్మ ఫల త్యాగమును సూచించడం జరిగింది. దీనిని బట్టి అభ్యాసము కంటే మత్కర్మ పరత్వము, దాని కంటే సర్వకర్మ ఫలత్యాగము ఒక దాని కంటే మరొకటి తక్కువదిగా చెప్పబడ్డాయి. అలాంటప్పుడు అన్నిటి కన్నా తక్కువ స్థాయి లోని దైన కర్మఫల త్యాగమును శ్రేష్ఠ మైనదిగా ఈ శ్లోకంలో అభివర్ణించడ మేమిటి?

అంతేకాదు. ఈ క్రమంలో అర్థం చేసుకుంటే ధ్యానం కన్నా కర్మఫల త్యాగము శ్రేష్ఠమని చెప్పినట్లు అవుతూ ఉంది. కానీ, ధ్యానం చేయడానికి అశక్తులైన వారికి కర్మ ప్రసంగ మని పది మరియు పదకొండవ శ్లోకాలలో అర్థం చేసుకున్నాం. అలాంటప్పుడు కర్మఫల త్యాగము ధ్యానం కన్నా ఎలా శ్రేష్ఠము?

అంతేగాక, కర్మఫల త్యాగం వల్ల శాంతి లభిస్తుంది అని కూడా ఈ శ్లోకంలో చెప్పడం జరిగింది. శాంతి అనేది స్వరూపానికి సంబంధించిన విషయం. స్వరూప జ్ఞానం వల్లనే స్వరూప శాంతి అనుభూత మవుతుంది అని గీత పూర్వార్థ మంతా చూశాం. ఇప్పుడేమో కర్మఫల త్యాగము వల్ల శాంతి కలుగుతుంది అని వింటున్నాము. ఇది పరస్పర విరుద్ధం కాదా?

కనుక ప్రస్తుత శ్లోకంలో చెప్పబడుతున్న అభ్యాస జ్ఞానాదులను కేవలం ఎనిమిదవ శ్లోకం నుండి పదకొండవ శ్లోకం వరకు మనం చెప్పుకున్న విషయంతో అనుసంధానం చేస్తూ అర్థం చేసుకొనే అవకాశము లేదు. ఈ పన్నెండవ శ్లోకము తనదైన ఒక ప్రత్యేక విషయాన్ని ప్రస్తావిస్తూ ఉందని అర్థ మవుతూ ఉంది. అలాంటప్పుడు అభ్యాస, జ్ఞాన, ధ్యాన, ఫలత్యాగ శాంతులకు స్పష్టమైన అర్థా లేమిటో గ్రహించవలసి ఉంటుంది. అదే మన ప్రస్తుత కర్తవ్యము.





**అభ్యాసము - జ్ఞానము**

అభ్యాసము కంటే **(అభ్యాసాత్)** జ్ఞానము ప్రశస్తము **(జ్ఞానమ్ శ్రేయః ప్రశస్యతరం).** ఇక్కడ అభ్యాసము కంటే జ్ఞానము శ్రేష్ఠము అంటే వివేక శూన్యమైన అభ్యాసం కంటే జ్ఞానము శ్రేష్ఠము అని అర్థము **(అవివేక పూర్వక అభ్యాసాత్ జ్ఞానమ్ శ్రేయః).**

యోగానికి సంబంధించిన యమ నియమ ఆసన ప్రాణాయామాది అభ్యాసంలో గాని, లేదా జ్ఞానానికి సంబంధించి మనన నిదిధ్యాసనల విషయంలో గాని, వివేకాదులు లేకుండా కేవలం శ్రవణాభ్యాసము చేయడం కంటే, వివేకముతో, పురుషార్థ నిశ్చయం కలిగిన జ్ఞానసాధన శ్రేష్ఠము అని అర్థము. యోగాభ్యాసంలో జ్ఞానం ఉత్పన్నమయ్యే అవకాశం లేదు కనుక, వివేక శూన్యమైన అభ్యాసము కంటే వివేకయుతమైన జ్ఞానము ప్రశస్తము.

**జ్ఞానము - ధ్యానము**

జ్ఞానము కంటే **(జ్ఞానాత్)** ధ్యానము శ్రేష్ఠము, విశిష్టము **(ధ్యానం విశిష్యతే).** ధ్యానము అంటే జ్ఞానపూరిత ధ్యానము అని అర్థము. కనుక జ్ఞానం కంటే జ్ఞానపూరిత ధ్యానం శ్రేష్ఠ మైనది **(జ్ఞానాత్ జ్ఞాన పూర్వకం ధ్యానం విశిష్యతే).** జ్ఞానం లేని ధ్యానము అవరోధాలతో కూడి ఉంటుంది. ప్రతిబంధకాలతో నిండి ఉంటుంది. ధ్యానం జ్ఞానయుత మైనపుడు, ప్రతిబంధకాలు తొలగడమే గాక, విపరీత ప్రత్యయ నివృత్తి జరుగుతుంది. విజాతీయ వృత్తి రహిత, సజాతీయ వృత్తి ప్రవాహ సగుణ బ్రహ్మ విషయ మానస వ్యాపారము నైరంతర్యంగా సాగుతుంది. అందుచేత కేవలం జ్ఞానం కంటే, జ్ఞానపూరిత ధ్యానం విశిష్ట మైనది.

**ధ్యానము - కర్మఫల త్యాగము**

ధ్యానము కంటే **(జ్ఞానవతః ధ్యానాదపి)** కర్మఫల త్యాగము విశిష్ట మైనది **(కర్మఫల త్యాగః విశిష్యతే).** కర్మఫల త్యాగము వలన సర్వకర్మలు ఈశ్వరార్పితం చేయబడు తున్నాయి కనుక, కర్మల యందు గాని, వాటి ఫలితముల యందు గాని సంకల్ప కామాదులు ఉదయించవు. అదియే అంతఃకరణ శుద్ధి. అంతఃకరణ శుద్ధి ప్రాప్తిస్తే, జ్ఞానప్రాప్తి, తద్వారా మోక్షసిద్ధి లభించడం, కారణమైన అజ్ఞానముతో సహా సంసారము నశించడము వెంటనే జరిగి పోతుంది. కాలం కొరకు నిరీక్షించ నవసరం ఉండదు. ఈ విధంగా శాంతి ప్రాప్తిస్తుంది **(కర్మఫల త్యాగాత్ శాంతిః ఉపశమః సహేతుకస్య సంసారస్య అనన్తర మేవ స్యాత్, న తు కాలాన్తరమ్ అపేక్షతే).**

యోగయుక్తుడు కర్మఫలాలను త్యజించి ఆత్మ సంబంధమైన శాంతిని పొందుతున్నాడు అని ఐదవ అధ్యాయంలో భగవంతుడు బోధించిన విషయాన్ని ఈ సందర్భంలో మననం చేసుకోవడం యుక్తం ( **యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తి మాప్నోతి నైష్ఠికీమ్.** *5 - 12* ). ఈ విధంగా కర్మయోగులు ఫలత్యాగం ద్వారా శ్రేయస్సును పొందుతారు.

*వివిధ సాధనలను ఇంతవరకు వివరించిన భగవంతుడు, ఇక వరుసగా ఏడు శ్లోకాలలో ఉత్తమ భక్తుని లక్షణాలను వివరిస్తున్నాడు.*

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ ।
నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ ॥ 13

సంతుష్టః సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః ।
మయ్యర్పిత మనోబుద్ధి ర్యో మద్భక్తః స మే ప్రియః ॥ 14

*అద్వేష్టా-సర్వభూతానాం-మైత్రః-కరుణః-ఏవ-చ*
*నిర్మమః-నిరహంకారః-సమదుఃఖసుఖః-క్షమీ*
*సంతుష్టః-సతతం-యోగీ-యతాత్మా-దృఢనిశ్చయః*
*మయి-అర్పితమనోబుద్ధిః-యః-మద్భక్తః-సః-మే-ప్రియః*

| | | | |
|---|---|---|---|
| సర్వభూతానాం | = సకల భూతము లందు | యోగీ | = యోగయుక్తుడు |
| అద్వేష్టా | = ద్వేషము లేనివాడు | యతాత్మా | = ఆత్మనిగ్రహము కల వాడు |
| మైత్రః | = మైత్రి కలవాడు | దృఢనిశ్చయః | = దృఢసంకల్పము గల వాడు |
| కరుణః ఏవ చ | = దయ గల వాడు | మయి | = నా యందు |
| నిర్మమః | = మమకారము లేని వాడు | అర్పిత మనోబుద్ధిః | = నిలిపిన మనోబుద్ధులు గల వాడు |
| నిరహంకారః | = అహంకారము లేని వాడు | మద్భక్తః | = నా భక్తుడు |
| సమదుఃఖసుఖః | = సుఖదుఃఖముల యందు సమముగ ఉండే వాడు | యః | = ఎవరో |
| | | సః | = వాడు |
| క్షమీ | = సహనశీలుడు | మే | = నాకు |
| సతతం | = సదా | ప్రియః | =ప్రియుడు |
| సంతుష్టః | = సంతృప్తి చెందిన వాడు | | |

**సర్వ ప్రాణులను ద్వేషించని వాడు, మైత్రి, దయ కలవాడు, మమకార అహంకారాలు లేనివాడు, సుఖదుఃఖాలలో సమభావంతో ఉండేవాడు, ఓర్పు కలవాడు,**
**నిత్య సంతుష్టుడు, యోగయుక్తుడు, మనో నిగ్రహం కలవాడు, దృఢమైన నిర్ణయము కలవాడు, మనోబుద్ధులను నా యందే సమర్పించిన వాడు అయిన నా భక్తుడు నాకు ఇష్టుడు.**

**వ్యాఖ్య**

విశ్వరూపోపాసన, అక్షరోపాసనలను ఆచరించే వారిలో యోగవిత్తము లెవరు? అని అర్జునుడు ప్రశ్నించడంతో పన్నెండవ అధ్యాయమైన భక్తి యోగము ప్రారంభమైంది. అర్జునుని ప్రశ్నకు సమాధానంగా సాకార నిరాకార ధ్యానాలను వివరించి చెప్పిన భగవానుడు, దేహాభిమానులకు సాకారమే శ్రేష్ఠ మని నిశ్చయించి, తత్సంబంధ మైన జీవన విధానాన్ని, వివిధ సాధనలను తెలిపి, ప్రస్తుతం ఉత్తమ భక్తుని లక్షణాలను వివరించే చివరి ఘట్టానికి చేరుకున్నాడు.

ఉత్తమ భక్తుడు ఎవడో కాడు జ్ఞానియే. ప్రస్తుతం పరమేశ్వరుడు చెప్పే లక్షణాలన్నీ జ్ఞాని లక్షణాలే. జ్ఞాని లక్షణాలు జ్ఞాని కన్నా వేరు కావు. జ్ఞానికి, జ్ఞానానికి భేదము లేదు. **జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్** - జ్ఞాని నేనే అన్నాడు విజ్ఞాన యోగంలో భగవంతుడు. కనుక, జ్ఞానికి సంబంధించిన ఈ లక్షణాలలో భగవ ద్వైభవమే దర్శనీయంగా ఉంటుంది. జ్ఞానికి ఇవి సహజ లక్షణాలే. జ్ఞానిలో ఏవైతే సహజంగా అలంకరణాలై శోభిస్తున్నాయో, వాటిని భక్తుడైన కర్మయోగి సాధనలుగా స్వీకరించి ఆచరించ వలసి ఉంటుంది. ఇక్కడ నుండి పందొమ్మిదవ శ్లోకంలో **స్థిరమతిః** అనే లక్షణం వరకు ముప్పై ఐదు లక్షణాలు వర్ణింప బడ్డాయి. సాధకులకు అత్యంత ఉపయుక్త మైన ఈ సాధనలను వరుసగా చెప్పుకుందాం. ప్రథమంగా పదమూడు, పద్నాలుగు శ్లోకాలలో మొత్తము పన్నెండు లక్షణాలు ఉన్నాయి. ఈ రెండు శ్లోకాలు లేకాన్వయాలు. అంటే కలిపి అర్థం చేసుకోవలసినవి.

భగవంతునికి ప్రియుడైన భక్తుడు సర్వ ప్రాణుల యందు ద్వేషము లేనివాడు ***(అద్వేష్టా సర్వభూతానామ్)***. ఇది ప్రథమ లక్షణము.





**ద్వేషభావ రహితుడు**

భక్తుడు అద్వేష్టుడు. సర్వప్రాణుల యందు ద్వేష భావము లేనివాడు **(అద్వేష్టా సర్వభూతానామ్)**. కేవలం మానవుల యందే గాక సర్వ ప్రాణుల యందు ద్వేష భావము లేనివాడు భక్తుడు. రాగ ముంటేనే ద్వేషం కలుగుతుంది. ప్రియం ఉంటేనే, దానికి అవరోధాన్ని కల్పించిన వారి యందు ద్వేషం ఉత్పన్న మవుతుంది. ఆత్మవిదుడైన జ్ఞాన భక్తునికి దేనిపై రాగ ముంటుంది? **ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి** *(6 - 32)*. సర్వ ప్రాణులను తన ఆత్మ లాగే దర్శించే వాడు జ్ఞాని. అలాంటి వానికి ప్రత్యేకంగా ఎవరిపై రాగం ఉంటుంది? రాగమే లేనపుడు ద్వేష మెలా ఉంటుంది? అందుచేత భక్తుడు అద్వేష్టుడు.

జ్ఞాని అద్వేష్టుడు కనుక ఎవరినీ ద్వేషించడు. మరి ఇతరులు తనను ద్వేషిస్తే, లేదా మోసం చేస్తే, లేక బాధిస్తే, వారి మీద కూడా ద్వేషం రాదా? రాదు. అందుకే అతడు అద్వేష్టుడు. తనకు దుఃఖాన్ని కల్పించిన వారిని కూడా ద్వేషించడు **(ఆత్మనః దుఃఖ హేతు మపి న కించిత్ ద్వేష్టి)**. కారణం, అందరినీ అతడు తన లాగే దర్శిస్తాడు కనుక **(సర్వాణి భూతాని ఆత్మత్వేన హి పశ్యతి)**. తనను తాను ద్వేషించుకో లేడు కనుక, తన స్వరూప మైన సర్వులను కూడా ద్వేషించ లేడు.

రుచికరమైన పదార్థాలను తొందర తొందరగా తినేటప్పుడు ఒక్కొక్కసారి నాలుక పళ్ళ మధ్య పడి నలుగుతుంది. ఆ సమయంలో చాలా బాధ కలుగుతుంది. అలాగని నాలుకను కొరికిన పళ్ళను ద్వేషిస్తామా? ఇదీ అంతే. నాలుకే కాదు, నాలుకను కొరికిన పళ్ళు కూడా మనవే కనుక వాటిని ద్వేషించము. అలాగే తన నెవరైనా దుఃఖ పెట్టినా, సర్వులను తన ఆత్మ స్వరూపంగా దర్శించే జ్ఞాని యైన భక్తుడు వారిని ద్వేషించడు. కనుక, సమమైన ఆత్మదర్శనములో రాగద్వేషాలకు స్థానం లేదు. అర్జునా! నేను సర్వ భూతాలలో సమంగా ఉన్నాను. నాకు ప్రియుడు లేడు. ద్వేషింప దగిన వాడూ లేడు *(9 - 29)* అన్నాడు గీతాచార్యుడు. జ్ఞాని స్థితి అదే. జ్ఞానికి, భగవంతుడికీ తేడా లేదు.

ఆత్మౌపమ్య బుద్ధి కారణంగా జ్ఞాని ఎవరినీ ద్వేషించడు. కర్మయోగి యైన భక్తుడు సర్వమూ వాసుదేవుడే అనే భావంతో ఉంటాడు కనుక **(వాసుదేవ స్సర్వ మితి** *- 7 - 19)* అతడు కూడా ఎవరినీ ద్వేషించడు.

ద్వేషాలు లేని సమాజము విలసిల్లా లంటే, ద్వేష కారణంగా హింసలు విజృంభించని శాంతి సమాజంలో నెలకొనాలంటే, జ్ఞానులు కాకపోయినా, కర్మయోగులైన భక్తులతో అయినా ఆ సమాజం నిండి ఉండాలి.

ద్వేషించకుండా ఉంటే సరిపోతుందా? ప్రేమించ నవసరం లేదా? దుఃఖం లేకుండా ఉంటే సరిపోతుందా? ఆనందం అవసరం లేదా? ద్వేషము లేకుండా ఉండటం నిషేధ పద్ధతి. అదొక్కటే సరిపోదు. గేదె ఎవరిని ద్వేషిస్తుంది? చెట్టుకు ఎవరిపై ద్వేషం ఉంటుంది? జ్ఞానం కల మానవులు గేదెల లాగా, గోడల లాగా ఉండ కూడదు. ద్వేషం లేకుండా ఉండటము మంచిదే. కానీ, ప్రేమను కలిగి ఉండటము వాంఛనీయము. ప్రేమే మైత్రీ కరుణలను విరజిమ్ముతుంది. రెండు, మూడు లక్షణాలు మైత్రీ కరుణలే.

**మిత్రుడు**

మిత్రత్వము మైత్రి **(మిత్ర భావః మైత్రీ)**. మిత్రత్వముతో మసలుకొనే వాడు మిత్రుడు **(మిత్రతయా వర్తతే ఇతి మైత్రః)**. అద్వేష్టుడుగా ఉండట మంటేనే మిత్రుడుగా మెలగ మని భావము. ద్వేషాన్ని నిషేధించడంలో ప్రేమను ప్రతిపాదించడమే ప్రధానము అనేది శ్రుతి హృదయము.

**న హి నిందా నిన్దితుం ప్రవర్తతేఽ పి తు విధేయం స్తోతుమ్**

కేవలం నిందించడమే నింద యొక్క ఉద్దేశం కాదు. స్తుతింప దగిన వాటిని స్తుతించుటకే నిందా ప్రయోగము అన్నది వేదం.

మైత్రీ భావము అద్భుత మైనది. ఆత్మకు ఆత్మయే మిత్రుడు. మన ఎడమ చేతిని దోమ కుడితే, వెంటనే కుడి చేయి అక్కడికి అప్రయత్నంగా వెళ్ళి మృదువుగా మర్దనం చేస్తుంది. అదే మైత్రి. ఆత్మౌపమ్య బుద్ధి ప్రభావము. జ్ఞాని వైభవము.

భక్తుడు కూడా సర్వత్ర సర్వేశ్వరుని దర్శించడం చేత నిమ్నోన్నతాలు చూడకుండా అంతట మైత్రీ భావంతో ప్రవర్తిస్తూ ఉంటాడు.

**సూ॥ మైత్రీ కరుణా ముదిత ఉపేక్షాణాం భావనాత శ్చిత్త ప్రసాదనమ్॥**

మైత్రి, కరుణ, ముదిత ఉపేక్షల యొక్క భావం వల్ల చిత్త ప్రసాదము ఏర్పడుతుంది అని పతంజలి మహర్షి యోగ దర్శనం - సమాధి పాదంలో వ్రాశారు.

సాధారణంగా మనకు నాలుగు రకాలైన వ్యక్తులు జీవితంలో తారస పడుతూ ఉంటారు. మొదటి రకం వారు మనతో సమానులు. వారి విషయంలో మనం స్నేహంగా మెలగాలి. అదే మైత్రి ***(మైత్రీ)***. అలా ప్రవర్తించడం చేత మనస్సులో ఈర్ష్యలు తొలగి పోతాయి.

రెండవ వారు మన కన్నా తక్కువ స్థాయిలో ఉండేవారు. బాధలలో ఉండేవారు. వారి విషయంలో మనం కరుణను చూపాలి ***(కరుణ)***. కరుణా ప్రభావం చేత మన మనస్సు లోని కాఠిన్యాలు కరిగి పోతాయి.

ఇక మూడవ వారు సుఖశాంతులతో, కీర్తి ప్రతిష్ఠలతో తులతూగే వారు. అలాంటి వారిని చూచి నపుడు ముదిత హృదయులము కావాలి. ఆహ్లాద పడాలి ***(ముదిత)***. ముదితా భావం వల్ల మన మనస్సు లోని అసూయ అనే కాలుష్యము కనుమరు గవుతుంది.

ఇక నాల్గవ వారు దుష్టులు. నీచులు. దుర్మార్గులు. ఇలాంటి వారు ఎదురు పడి నపుడు తటస్థంగా, అంటే ఉదాసీనంగా ఉండగలగాలి. వారి పట్ల ఉపేక్షా భావంతో మెలగాలి ***(ఉపేక్ష)***. అప్పుడు మన మనస్సులో క్రోధము ఏర్పడదు. మనలో ఉద్వేగము కలగదు.

మొదటి లక్షణములో మనం చెప్పుకొనిన రాగద్వేషాలు చిత్త మాలిన్యానికి హేతువు లైతే, మైత్రీ కరుణాదులు చిత్త ప్రసాదానికి హేతువు లవుతాయి.

### కారుణ్య మూర్తి

భక్తుడు కరుణామయుడు. కరుణా హృదయుడు. దయాగుణం కలవాడు ***(కరుణః కరుణా కృపా దుఃఖితేషు దయా)***. జ్ఞాని సర్వకర్మ సన్యాసి. సర్వత్ర ఆత్మౌపమ్య బుద్ధి కలవాడు. సన్యాస స్వీకార సమయం లోనే సర్వ ప్రాణులకు అభయ ప్రదానం చేసిన వాడు ***(సర్వ భూతానాం అభయ ప్రదః సన్న్యాసీ)***. ఇదే కరుణ. ఈ కరుణ ఉండటం చేతనే సాధు మహాత్ముడు ఆచార్యుడై శిష్యులకు ప్రేమతో బోధ చేస్తాడు. ప్రశాంత మనస్కుడైన గురువు బ్రహ్మనిష్ఠుడే కాదు, దయామయుడు కూడా అని పరబ్రహ్మోష్టకంలో ప్రవచించారు శ్రీశంకరాచార్యస్వామి ***(దయాలుం గురుం బ్రహ్మనిష్ఠం ప్రశాన్తం)***.

కర్మయోగి యైన భక్తుడు సర్వత్ర వాసుదేవ చైతన్యమునే దర్శించడం చేత అందరి విషయం లోను, సర్వ ప్రాణుల యందును దయ కలిగి ఉంటాడు.

తాను పళ్ళెంలో వడ్డించుకున్న రొట్టెను కుక్క అపహరించి పరుగు తీస్తే, 'పాండురంగా! ఆగు, పరుగెట్టకు! ఆ రొట్టె గట్టిగా ఉంది. దానిని నువ్వు కొరకలేవు. ఈ నేతిలో ముంచుకొని తిను' అంటూ నేతి గిన్నెను పట్టుకొని నామదేవుడు కుక్క వెంట పరుగు దీయడంలో ఉన్నదంతా కరుణే కదా!





### నిర్మముడు

'నాది' అనేది లేనివాడు నిర్మముడు **(నిర్మమః మమ ప్రత్యయ వర్జితః)**. 'నాది' అనే బుద్ధి మమకారము. ఇది చాలా ప్రమాద భరితమైంది. 'ఇది నాది' అంటే నాది కానిది మరొకటి ఉంది అని అర్థము. మమకారం ఉన్నంత వరకు ద్వైత భావన దూరం కాదు. సమస్తాన్ని త్యజించిన సర్వసంగ పరిత్యాగులు కూడా, ఇది నా ఆశ్రమము - ఇది నా కమండలము అంటూ ఉంటారు. అన్నిటినీ పరిత్యజించినా, **మమ కౌపీనః** - నా గోచి అని మమకారాన్ని దాచి పెట్టుకుంటారు.

ద్వేషాన్ని దాటి, మైత్రీ కరుణలను వెంట పెట్టుకొని ప్రయాణం సాగించినా, మమకారం అనే గుంటలో అందరూ పడిపోతారు.

బిడ్డపై తల్లిదండ్రులకు ద్వేషం ఉంటుందా? మైత్రీకరుణలు లేకుండా పోతాయా? కానీ, నాల్గవ లక్షణ మైన ఈ మమకారం వద్దే వాళ్ళు బందీ లవుతారు. దుర్యోధనుని విషయంలో ధృతరాష్ట్రునికి ఉన్న మమకారమే హస్తినలో మారణహోమాన్ని సృష్టించింది.

జ్ఞానికి సర్వం ఆత్మే కనుక, అతనిలో మమకారం ఉండే అవకాశం లేదు. కాని, భక్తుడు ప్రయత్నంతో, అవగాహనతో మమకారాన్ని దూరం చేసుకోవాలి. మమకారాన్ని అనుకున్నంత తేలికగా దూరం చేసుకోలేము. అహంకారము దూరమైతేనే మమకారం అదృశ్య మవుతుంది. అదే తరువాత లక్షణం.

### నిరహంకారుడు

'నేను' అనే జ్ఞానం లేనివాడు నిరహంకారుడు **( నిరహంకారః నిర్గత అహం ప్రత్యయః )**. అహంకార రహితుడు. దేహమే నేను అనే భావన లేనివాడు అహంకార శూన్యుడు. అనాత్మ యందు ఆత్మబుద్ధి లేనివాడు. 'నేను' అనే అహంకారం ఉంటేనే 'నాది' అనే మమకారం ఉంటుంది. మమకారానికి అహంకారమే పునాది. అహంకారానికి అజ్ఞానమే కారణము. తాను ఆత్మ అనే జ్ఞానం లేకపోవడం చేత, అనాత్మ అయిన దేహమే తానని భ్రమించడం జరుగుతోంది. దేహము తాను అనే అహంకారం కారణంగా, దేహానికి సంబంధించిన పుత్ర కళత్రాదులు, గృహ వాహనాదులు తనవి అనే మమకారం ఏర్పడుతూ ఉంది. 'నేను ఆత్మ' అనే ఆత్మౌపమ్య బుద్ధి వలన 'నేను దేహము' అనే అహంకారము నశిస్తూ ఉంది. అహంభావన ఎప్పుడైతే నశిస్తూ ఉందో, మమ భావన దానంతటదే నశించి పోతూ ఉంది. ఈ విధంగా నిరహంకారుడైన భక్తుడు నిర్మముడు అవుతున్నాడు. నిర్మముడు, నిరహంకారుడు అయిన వానిని సుఖదుఃఖాలు ఎలా బాధిస్తాయి?

### సుఖదుఃఖ సముడు

సుఖమును, దుఃఖమును సమంగా చూచేవాడు సుఖదుఃఖ సముడు. మమత్వము ఉండే చోట ప్రియత్వము ఉంటుంది. అదే రాగము. సుఖానికి హేతువు. అలాంటి సుఖానికి అవరోధము కలిగి నపుడు ద్వేషము పుడుతుంది. అది దుఃఖానికి హేతువు.

సుఖదుఃఖ హేతువులు రాగద్వేషాలను కదిలిస్తాయి. రాగద్వేషాలు ద్వంద్వాల వెంట పరుగులు తీయిస్తాయి. నిర్మముడు మమవృత్తి లేనివాడు. కనుక ప్రియాప్రియాలకు అతీతుడు. నిరహంకారుడు సుఖదుఃఖాలు లేని వాడు. ఈ విధంగా భక్తుడు సుఖదుఃఖాలను దాటి పోతున్నాడు. కనుక, అతడు సహనాన్ని కోల్పోడు. వార్పులు, తీర్పులు తెలియకుండా ఓర్పుతో శోభిస్తాడు.

**క్షమావంతుడు**

క్షమావంతుడు అంటే ఓర్పు గలవాడు. తిట్టినా, కొట్టినా చలించని గుణం కలవాడు క్షమావంతుడు ***(క్షమావాన్ ఆక్రుష్టః అభిహతః వా అవిక్రియః ఏవ ఆస్తే).*** క్షమ అంటే, అనివార్యంగా ఆవేదన చెందుతూ బాధలు అనుభవించడం కాదు. సంతాప విలాప రహితంగా సహించడమే క్షమ యొక్క లక్షణము. తన నీడను కొడితే ఎలా స్పందించడో, అలా సాక్షిగా బాధలను భరించడము. ఆత్మమైన తనను తిట్టే వారెవరు? కొట్టే వారెవరు? ఇదే జ్ఞాని క్షమానుభూతి. భక్తుని ప్రేమానుభూతి.

**వృక్ష ఇవ తిష్ఠాసేత్ ఛిద్యమానో న కుప్యేత న కంప్యేత !**

వృక్షాన్ని ఖండిస్తూ ఉన్నా, కోపం లేకుండా, చలించకుండా ఎలా ఉంటుందో, అలా ఉండటమే క్షమా సామ్య మని వేదం ప్రవచించింది.

ఇక్కడికి పదమూడవ శ్లోకాన్ని పూర్తి చేస్తూ ఏడు లక్షణాలను చెప్పుకున్నాం. ఇక భక్తుడు సదా ఎలా ప్రవర్తిస్తూ ఉంటాడో పద్నాల్గవ శ్లోకంలో చెప్పుకుంటాం.

పద్నాల్గవ శ్లోకంలో ఐదు లక్షణాలు ఉన్నాయి. వీటి మధ్యలో ***సతతం*** అనే పదం గడప మీద దీపం లాగా వెలుగుతూ ఉంది. ఈ ***సతతం*** అనే పదం ఐదు విశేషణాల తోను సంబంధాన్ని కలిగి ఉంటుంది.

**సదా సంతుష్టుడు**

లాభాలాభాలలో సదా తృప్తిగా ఉండేవాడు సంతత సంతుష్టుడు. సదా 'చాలు' అనే బుద్ధితో తృప్తి చెంది ఉండేవాడు ***(నిత్యం లాభే అలాభే చ ఉత్పన్న అలం ప్రత్యయః).*** ***అలం*** అంటే చాలు అని అర్థం. ఏది వచ్చినా సరిపడి తృప్తిగా ఉండే బుద్ధి. కొరత లేని, వెలితి తెలియని బుద్ధి ***అలం*** ప్రత్యయ పూర్ణము. నిత్యాత్మ భావనే ఈ ***అలం*** ప్రత్యయ హేతువు. ఆత్మ యందు ఆత్మ చేత ఆత్మానందాన్ని అనుభవించే జ్ఞాని బుద్ధి ***అలం*** భావనతో స్థిమితంగా, సంతుష్టమై ఉంటుంది *(2 - 55).*

భక్తుడు ఏది వచ్చినా ప్రసాద బుద్ధితో స్వీకరిస్తాడు కనుక, లాభాలాభాలలో, మానావమానాలలో, జయాపజయాలలో, ప్రాప్తాప్రాప్తాలలో స్థిమితాన్ని కోల్పోక, సదా సంతుష్టుడై ఉంటాడు.

మనము కూడా అప్పుడప్పుడూ సంతుష్టులు గానే ఉంటాము. కానీ, భక్తుడు ఎప్పుడూ సంతుష్టుడై ఉంటాడు. మన సంతోషము చాలా వాటిపై ఆధారపడి ఉంటుంది కనుక, అవి ప్రాప్తిస్తే సంతోషంగా ఉంటాము. అవి దూరమైతే సంతోషాన్ని పారేసుకుంటాము.

భక్తుని యొక్క సంతోషము మరొక దానిపై ఆధారపడి ఉండేది కాదు. అది కేవలం తనకు, తన జ్ఞానానికి సంబంధించిన విషయం. కనుక అది ఎన్నడూ తనకు దూరం కాదు. అదే నిత్య సంతోషము. సంతతానందము. అది కలవాడే సతత సంతుష్టుడు.

**నిత్యయోగి**

భక్తుడు నిత్యము యోగియై ఉంటాడు. అందుచేత, అతడు నిత్యయోగి. సతతం యోగి ***(సతతం సమాహిత చిత్తః సతతం యోగీ).*** సదా సమాహిత చిత్తుడు. సమరూపుడైన బ్రహ్మము నందే చిత్తమును నిశ్చలముగా ఉంచువాడు యోగి. అలా బ్రహ్మము నందే సదా అతడి చిత్తము ఉంటుంది కనుక అతడు సదాయోగి. యోగము నందు అప్రమత్తంగా ఉండేవాడు. జ్ఞానీ భక్తుడు సహజం గానే యోగిగా శోభిస్తూ ఉంటే,





కర్మయోగి అయిన భక్తుడు ప్రయత్నంతో అప్రమత్తుడై ఉంటాడు. దిక్సూచి సదా ఉత్తర దిక్కు వైపే ఉన్నట్లు, భక్తుడు సదా యోగము నందే స్థిరపడి ఉంటాడు.

మనమూ యోగము నందు ఉంటాము. కానీ సతతం యోగులుగా ఉండ లేము. మన యోగం ఏదో కాలానికి పరిమితమై ఉంటుంది. భక్తుడు సర్వ కాలాలలో యోగిగా ఉంటాడు. అందుకే భక్తుడు సతతయోగి.

మనకు యోగ మొక్కటే కాదు. యోగంతో పాటు మన మనస్సుకు ఎన్నో కావాలి. ఏవేవో రుచులు, అభిరుచులు మన మనస్సులలో తిష్ఠ వేసి ఉంటాయి. అందుచేత మన మనస్సు సదా యోగంలో ఉండలేక చలిస్తూ ఉంటుంది. అన్య విషయాలలో చరిస్తూ ఉంటుంది.

భక్తునికి భగవంతుడు తప్ప మరొక దాని యందు మనస్సు లగ్నం కాదు. మరొక విషయము నందు భక్తుని మనస్సుకు ఆసక్తి ఉండదు, అనురక్తి కుదరదు, అభిరుచి కలగదు. అందుచేత అతడు సదా యోగి.

**సదా యతాత్ముడు**

యత స్వభావము కలవాడు యతాత్ముడు. సదా యతాత్ముడు కనుక సంయతాత్ముడు ***(సంయత స్వభావః యతాత్మా).*** ***యతః*** అంటే నియమింప బడిన 'స్వభావం', చిత్తము లేదా సంస్కారము కలవాడు. అంటే, దేహేంద్రియ మనోబుద్ధులను చక్కగా, నిరంతరము తన అధీనంలో ఉంచుకొని ఉండేవాడు. జ్ఞాని ఆత్మౌపమ్య బుద్ధి కలవాడు కనుక అతనికి సహజం గానే నిగ్రహింపబడి ఉంటాయి. కాని, భక్తుడు ప్రయత్నంతో నిగ్రహిస్తాడు.

తాను నివారించిన చోటికి కాళ్ళు నడచి పోవు. తాను నిషేధించిన పదార్థాలను నాలుక రుచి చూడదు. తాను వద్దనిన మాటలను నోరు మాట్లాడదు. ఏ పనులు చేయాలో, ఏ పనులు చేయకూడదో నిర్ణయించేది తానే గాని తన మనస్సు కాదు. చెయ్యమనిన పనులనే చేతులు చేస్తాయి. వద్దని వారిస్తే వాటిని ముట్టుకోవు. పొరపాటున కూడా పట్టుకోవు. ఇదే సంయతాత్ముని సదా స్వభావ సంగతము.

**సదా దృఢ నిశ్చయుడు**

దృఢము అంటే స్థిర మైనది. దృఢ నిశ్చయము అంటే స్థిరమైన నిశ్చయము. అట్టి దృఢ నిశ్చయము కలవాడు దృఢ నిశ్చయుడు. దేని విషయంలో దృఢ నిశ్చయం కలవాడు? ఆత్మ విషయంలో దృఢ నిశ్చయం కలవాడు. ఎట్టి పరిస్థితుల లోను తన దృఢ నిశ్చయం నుండి జారి పోనివాడు కనుక జ్ఞాని సదా దృఢనిశ్చయుడు. సంతత దృఢ నిశ్చయుడు ***(దృఢః స్థిరః నిశ్చయః అధ్యవసాయః యస్య ఆత్మతత్త్వ విషయే సః దృఢ నిశ్చయః).*** సతత యోగిగా, సతత యతాత్ముడుగా జ్ఞాని శోభించ డానికి సదా దృఢ నిశ్చయుడై ఉండటమే కారణము.

ఇక భక్తుడైన కర్మయోగి విషయానికి వస్తే అతనికి పురుషార్థ నిశ్చయము దృఢంగా ఉన్నందున, అతడు కూడా భక్తి సాధనలో సదా దృఢ నిశ్చయంతో ఉంటాడు.

**సదార్పిత మనోబుద్ధియుతుడు**

'ఇదం' వృత్తి రూపమైన సంకల్పాత్మక మనస్సును, 'అహం' వృత్తి రూపమైన నిశ్చయాత్మక బుద్ధిని సదా పరమాత్మ యందే సమర్పించిన మహాత్ముడు జ్ఞాని. మనోబుద్ధులను సదా పరమాత్మ యందే లగ్నం చేసిన వాడు. పూర్వ లక్షణమైన దృఢ నిశ్చయము కూడా ఇందుకు కారణం కావచ్చు.

***సర్వ మిదం అహం చ బ్రహ్మైవ*** - 'ఈ సమస్త ప్రపంచము, అహం స్వరూపమైన నేను బ్రహ్మమే అయి ఉన్నాము. బ్రహ్మము కన్నా భిన్నంగా లేము' అనే దృఢ నిశ్చయ జ్ఞానం యొక్క ప్రభావము చేత, మనోబుద్ధులు

మరొక విషయం మీదికి పోయే అవకాశమే లేదు. ఈ విధంగా, సదా తన మనోబుద్ధులను పరమాత్మ యందే జ్ఞాని సుస్థిరంగా ఉంచుతాడు.

భక్తునికి సర్వమూ వాసుదేవుడే కనుక ***(వాసుదేవ స్సర్వ మితి)***. అతని మనోబుద్ధులు కూడా మరొక చోట రమించ లేవు. భక్తుల హృదయాలు పరమేశ్వరుని పాదాల యందే తన్మయమై ఉంటాయి. అందుకే భక్తులు భగవన్మయులు. తన్మయులు ***(తన్మయాః)***.

***క॥ సరసి రుహోదరు మంగళ చరితామృత మాత్మ గ్రోలు జను డితర కథా***
***గరళము గ్రోలునె? హరి సంస్మరణము జీవులకు నఖిల సౌఖ్యద మనఘా!***

'హే పుణ్యాత్మా! పద్మనాభుని పవిత్రమైన, మంగళకరమైన కథామృతమును పానం చేసే వారికి అన్య విషయాలు, చరిత్రలు విషతుల్యాలు. హరి సంస్మరణమే జీవులకు సర్వ సౌఖ్య ప్రదాయకం' అని విమల చరితుడైన విదురుడు మహాత్ముడైన మైత్రేయునితో భాగవతం - తృతీయ స్కంధంలో విన్నవించు కుంటాడు.

ఇంతవరకు పన్నెండు లక్షణాలను చెప్పుకున్నాం. ఈ పన్నెండు లక్షణాలు కలిగిన జ్ఞాని, లేదా ఈ లక్షణాలను తనవి చేసుకోవాలని నిరంతరం ప్రయత్నించే భక్తుడు తనకు ఇష్టుడు లేదా ప్రియుడు అంటున్నాడు భగవంతుడు ***(యః ఈదృశః మద్భక్తః సః మే ప్రియః)***. మరి కొన్ని భక్తుని లక్షణాలను చెప్పుకుందాం.

**యస్మా న్నోద్విజతే లోకో లోకా న్నోద్విజతే చ యః ।**
**హర్షామర్ష భయోద్వేగై ర్ముక్తో యః స చ మే ప్రియః ॥** 15

***యస్మాత్-న-ఉద్విజతే-లోకః-లోకాత్-న-ఉద్విజతే-చ-యః***
***హర్షామర్షభయోద్వేగైః-ముక్తః-యః-సః-చ-మే-ప్రియః***

| | | | |
|---|---|---|---|
| యస్మాత్ | = ఎవని వలన | హర్షామర్షభయోద్వేగైః | = సంతోషము, క్రోధము, భయము, ఉద్వేగముల నుండి |
| లోకః | = లోకము | ముక్తః | = ముక్తుడు |
| న ఉద్విజతే | = భయపడదో | యః | = ఎవడో |
| లోకాత్ చ | = లోకము వలన | సః చ | = వాడు |
| యః | = ఎవడు | మే | = నాకు |
| న ఉద్విజతే | = భయపడడో | ప్రియః | = ప్రియుడు |

**అర్జునా! భక్తుని వల్ల లోకానికి బాధ ఉండదు. లోకం వల్ల భక్తునికి బాధ లేదు. అతడు భక్తుడంటే! ఆనంద ఆక్రోశాలు, భయావేశాలు అతనిని చేరలేవు. అట్టి భక్తుడే నాకు ప్రియుడు.**

### వ్యాఖ్య

బాధ అనేది భరించ దగింది కాదు. హింస అనేది సహించ దగిందీ కాదు. అలాంటి వాటిని భరించాలన్నా, భరించే పరిస్థితిని ఊహించాలన్నా, మనిషి ఉద్వేగానికి లోనవుతాడు. ఇవన్నీ భయాలు. భయాలు ఎవరికీ ఆరోగ్యప్రదం కావు. వాటికి ఎవరూ గురి కాకూడదు. అలాంటి భయరహిత సమాజాన్ని మానవలోక మంతా ఆశిస్తోంది. కానీ, లోకం అభయ స్థానంగా మారాలి అంటే, లోకం గీతా భక్తులతో నిండి పోవాలి. గీతను అర్థం చేసుకున్న వారు జీవించే లోకమే అభయ ప్రదేశంగా మారుతుంది. గీతాజ్ఞానమే లోకానికి అభయ ప్రదానం చేయ గలుగుతుంది. ప్రస్తుత శ్లోకం ఈ సత్యాన్ని స్పష్టం చేస్తుంది. భగవద్గీతలో నాకు అత్యంత ప్రియమైన శ్లోకాలలో ఇదొకటి.





**పెట్టేది లేదు - పడేది లేదు**

భక్తుడు ఎవరినీ బాధ పెట్టడు. అందుచేత, భక్తుని వల్ల లోకానికి భయం లేదు, సంతాపము లేదు, సంక్షోభమూ లేదు. ఎంత అద్భుతమైన లక్షణమో! ఎవరినీ బాధలకు గురి చేయకుండా జీవించడము ఎందరికి సాధ్యం? భక్తులకే సాధ్యం. జ్ఞానం కల వారికే సాధ్యం. అందుకే, జ్ఞానులు ఎవరికీ భయ కారణం కారు.

చీకటిలో అందరూ భయ పడతారు, చీకటి పురుగులు తప్ప. ఏదీ తెలియని స్థితియే చీకటిలో భయ పడటానికి కారణము. తిమిరము భయ హేతువు. కానీ తేజము తిమిరాన్ని హరించినట్లు, జ్ఞానము అజ్ఞానాన్ని హరిస్తుంది. అజ్ఞాన జనిత భయాన్ని, బాధను పోగొడుతుంది.

జ్ఞాని సదా ఆత్మనే దర్శిస్తూ, ఆత్మౌపమ్య బుద్ధితో శోభిస్తూ ఉంటాడు. పరమ కారుణికత్వంతో ప్రవర్తిస్తూ ఉంటాడు. దానికి తోడు క్షమావంతుడై ఉంటాడు. కనుక, అట్టి జ్ఞాని వల్ల, లేదా భక్తుని వల్ల లోకం సంతాపం చెందదు ***(యస్మాత్ జ్ఞానినః సన్న్యాసినః లోకం న ఉద్విజతే న సంక్షుభ్యతే)***.

తాను లోకాన్ని ఉద్వేగానికి, భయానికి, బాధకు గురి చేయకుండా అభయ రూపుడుగా ఉండటమే గాకుండా, తాను కూడా లోకం వల్ల సంతాపం చెందకుండా ఉంటాడు. ఇది చాలా ముఖ్యమైన విషయం. నే నెవరినీ కష్ట పెట్టనండీ - అయినా ఎందుకో నన్ను అందరూ కష్ట పెడుతూనే ఉంటారు. బాల్యం నుండి నా బ్రతుకింతే అంటూ విచిత్ర మైన విషయాన్ని చాలా మంది వినిపిస్తూ ఉంటారు.

ఈ ప్రపంచంలో ఒకరిని మరొకరు బాధ పెట్టలేరు. అలాగే ఒకరి నొకరు సుఖపెట్టనూ లేరు. సుఖ దుఃఖా లనేవి అన్యులపై ఆధారపడి లేవు. మన ఆలోచనా విధానమే సుఖదుఃఖాలకు కారణం.

సుఖ పడే మనసున్న వారిని ఎవ్వరూ కష్టపెట్ట లేరు. దారి తప్పిన ఊహాలతో చరించే మనస్సును ఎవ్వరూ సుఖపెట్ట లేరు. నిష్కారణంగా లేనిపోనివి ఊహించుకొని బాధ పడే వారిని బాధ పెట్టడానికి మరొకరు అవసరమా? అసలు ఈ ప్రపంచంలో భయ కారణాలు లేవు, బాధా కారణాలు లేవు అని తెలియక పోవడమే భయాలకు, బాధలకు ప్రధాన కారణము. బాధలకు ప్రపంచం కారణం కాదు. ప్రపంచం కారణం కాదని తెలియక పోవడమే బాధలకు కారణం. అవగాహనా రాహిత్యమే బ్రతుకును ఆవేదనా నిలయంగా మార్చేస్తుంది.

ఈశ్వర జ్ఞానంతో జీవించే జ్ఞాని, లేదా భక్తుడు సర్వం ఈశ్వరమయంగా ప్రేమపూరిత నేత్రాలతో వీక్షించడం చేత, జ్ఞానపూరిత చక్షువులతో దర్శించడం చేత అతడు లోకాన్ని భయపెట్టడు. అలాగే లోకం వల్ల భయపడడు. తాము నీళ్ళను భయపెట్టకుండా, నీళ్ళ వల్ల తాము భయపడకుండా చేపలు నదిలో చరించి నట్లు, భక్తుడు సమాజంలో సంచరిస్తుంటాడు. అలాంటి భక్తులను కలిగిన సమాజం శాంతినిలయ మవుతుంది. అంతేగాని, భయ పెట్టే క్రోధనులతో, భయపడే పిరికి వాళ్ళతో నిండిన సమాజం శాంతి నిలయము కాకపోగా, అశాంతి స్థావరంగా మారి పోతుంది.

***అత్యుగ్రైః జల జన్తుభిః జలనిధిః న ఏవాధిమేతి క్షణం నో యాదాంసి భజన్తి భీతి ముదధేః అత్యూర్జితాత్ సర్వతః*** - భయంకరమైన జల జంతువులు తనలో చరిస్తూ ఉన్నా, సముద్రము క్షణం కూడా భయానికి లోను కాదు. అలాగే సముద్రములో జీవించే జల జంతువులు కూడా అగాధమైన సాగరము వల్ల భీతి చెందవు. జ్ఞానికి, లేదా భక్తునికి ఈ లోకంతో సంబంధం అలాగే ఉంటుంది. ఇది సామ్యము. అవగాహనా సౌలభ్యం కొరకే ఈ దృష్టాంతము. దృష్టాంతము ఎప్పుడైనా, ఎక్కడైనా ఏకదేశీయమే నని మనం చెప్పుకొనే ఉన్నాము.

**దూరం కాలేదు - దూర మయ్యాయి**

భయపెట్టని, భయపడని మహోన్నత శీలవంతుడైన జ్ఞాని ప్రియ మైనది ప్రాప్తించి నపుడు కలిగే హర్షమునకు

లోను కాడు. ప్రియవస్తు ప్రాప్తిలో ఉత్పన్నమయ్యే గగుర్పాటు, అశ్రుస్రావము మొదలైన ఆనంద అభివ్యక్త చిహ్నాలతో కూడిన ఉత్కర్ష నుండి, లేదా చిత్త విక్షేపము నుండి విడిపడి ఉంటాడు.

అమర్ష మంటే అసహనము ***(అమర్షః అసహిష్ణుతా).*** ఇతరుల యొక్క ఔన్నత్యాన్ని చూచి సహించలేక పోవడం అమర్ష. సర్వత్ర సమదర్శనం చేసే జ్ఞానిలో, లేదా ఆ ప్రయత్నంలో కొనసాగుతున్న భక్తునిలో ఇలాంటి అసహనము అనూహ్యము.

హర్షామర్షాలు లేనట్టే, భయ ఉద్వేగాలు కూడా ఉండవు. అద్వయ దర్శనం చేత భయము, చిత్త సంతాపము లేని కారణంగా ఉద్వేగము భక్తునిలో గోచరించవు. హర్షామర్ష భయోద్వేగాల నుండి అతడు ముక్తుడు ***(హర్షామర్ష భయోద్వేగైః ముక్తః).*** అలాంటి భక్తుడు భగవంతుడికి ప్రియుడట ***(యః సః మే ప్రియః).***

ఇక్కడ ప్రధానంగా ఒక్క విషయాన్ని అర్థం చేసుకోవాలి. ఖైది సంకెళ్ళను విడగొట్టుకొని పారి పోయినట్లు, హర్షామర్ష భయోద్వేగాలను భక్తుడు బలవంతంగా విడిపించుకో లేదు. శిక్షాకాలం ముగిసిన ఖైదీకి విడుదల సమయంలో సంకెళ్ళు వాటంతట అవే విడి పోయినట్లు, హర్షాదులు జ్ఞాని నుండి వాటంతట అవే జారి పోయాయి. మేల్కొనిన వాని నుండి స్వప్న దృశ్యాలు దూరమైనట్లు దూరమయ్యాయి. సూర్యోదయంతో తిమిరాలు అదృశ్య మైనట్లు అదృశ్య మయ్యాయి. అంతే.

*మరి కొన్ని అమృత విశేషణాలను చెప్పుకుందాం.*

**అనపేక్షః శుచి ర్దక్షః ఉదాసీనో గతవ్యథః ।**
**సర్వారమ్భ పరిత్యాగీ యో మద్భక్తః స మే ప్రియః ॥** 16

***అనపేక్షః-శుచిః-దక్షః-ఉదాసీనః-గతవ్యథః***
***సర్వారంభ పరిత్యాగీ-యః-మద్భక్తః-సః-మే-ప్రియః***

| | | | |
|---|---|---|---|
| అనపేక్షః | = కోరిక లేని వాడు | మద్భక్తః | = నా భక్తుడు |
| శుచిః | = పరిశుద్ధుడు | యః | = ఎవడో |
| దక్షః | = సమర్థుడు | సః | = వాడు |
| ఉదాసీనః | = నిర్లిప్తుడు | మే | = నాకు |
| గతవ్యథః | = అంతరించిన విచారము గల వాడు | ప్రియః | = ప్రియుడు |
| సర్వారంభపరిత్యాగీ | = సర్వకర్మల లోని కర్తృత్వము విడిచిన వాడు | | |

**అర్జునా! భక్తుడు అపేక్ష లేని వాడు. శుచిర్భూతుడు. సమర్థుడు. పక్షపాతం లేనివాడు. భయం లేనివాడు. సర్వారంభ పరిత్యాగి. కనుకనే, భక్తుడు నాకు ప్రియుడు.**

**వ్యాఖ్య**

**అనపేక్షుడు**

భక్తుడు ఏ విధమైన అపేక్ష లేనివాడు. ఏ కోరిక లేనివాడు. కోరదగిన విషయాల యందు స్పృహ లేని వాడు ***(అపేక్షా విషయేషు అనపేక్షః నిస్పృహః).*** సర్వకామ వినిర్ముక్తుడు. తన మనుగడకు, సుఖానికి మరొక దానిపై ఆధారపడని వాడు.

దేహానికి, ఇంద్రియాలకు, మనస్సుకు సంబంధించిన బాహ్య విషయాల యందు అపేక్ష లేనివాడు అనపేక్షుడు. కోరేవాడు ఎవడైనా కోరబడే వాటికి వశుడే. భక్తుడే. ప్రాపంచిక విషయాలను ఆశించే వాడు





ప్రపంచానికి వశుడై ఉంటాడు. ప్రపంచానికి భక్తుడై ఉంటాడు. ప్రపంచానికి భక్తుడైన వాడు పరమేశ్వరునికి భక్తుడు కాలేడు. పరమేశ్వరునికి భక్తుడైన వాడు ప్రపంచం విషయంలో విభక్తుడై ఉంటాడు. నిత్య వస్తువుతో సంబంధం కలిగి ఉండటం చేత అనిత్య విషయ సంబంధాలలో అనాసక్తుడై ఉంటాడు. అతడే అనపేక్షుడు.

**శుచిర్భూతుడు**

భక్తుడు పరిశుద్ధుడు. నిర్మలమైన వాడు. అందుచేత శుచిర్భూతుడు ***(శుచిః).*** శౌచము అనేది రెండు విధాలు. ఒకటి బాహ్య శౌచము, రెండవది అంతఃశౌచము. బాహ్య శౌచమే గాక, అంతఃకరణ శౌచము కూడా కలిగిన వాడు భక్తుడు. అందుకే అతడు శుచిర్భూతుడు ***(శుచిః బాహ్యేన అభ్యన్తరేణ చ శౌచేన సంపన్నః).***

దేహ శుభ్రత, వస్త్ర శుభ్రత, పరిసరాల శుభ్రత, పరికరాల శుభ్రతను పాటించడం బాహ్య శుభ్రత. అదే బాహ్య శౌచము. అలాగే పరిశుద్ధమైన సంకల్పాలు, నిర్మలమైన భావాలు మనస్సులో కలిగి ఉండటము, దానితో పాటు ఈర్ష్య, అసూయ, క్రోధ, భయ, ద్వేషాదులు అనే మాలిన్యాలు చిత్తములో లేకుండా చూసుకోవడము అంతఃశౌచము. భక్తుడు ఈ రెండు శౌచములను కలిగి ఉంటాడు కనుక శుచిర్భూతుడు.

స్వరూప జ్ఞానం చేత జ్ఞాని, ఈశ్వర ప్రణిధానము చేత భక్తుడు అనపేక్షులని ముందు లక్షణము లోనే చూశాము కదా! ఫలాపేక్ష లేదు అంటే, ఫలసంగం లేదు. ఫలసంగం లేని వానికి కర్మసంగం మాత్రం ఎందు కుంటుంది? కర్మసంగం లేకపోవడమే శౌచము ***(కర్మసు అసంగమః శౌచమ్).*** కర్మల యందు అనాసక్తియే శౌచము. అశౌచానికి అవకాశము ఇవ్వని శౌచము జ్ఞానికి అకర్తృత్వం వల్ల ప్రాప్తిస్తే, భక్తునికి నిమిత్తమాత్రంగా జీవించడం వల్ల లభిస్తుంది.

**దక్షుడు**

దక్షత అంటే సమర్థత. దక్షత కలవాడు దక్షుడు. తెలుసుకొన వలసినవి ఉన్నప్పుడు వాటిని స్పష్టంగా తెలుసుకొనే వాడు భక్తుడు. అతడే దక్షుడు. చేయదగినవి ఉన్నప్పుడు వాటిలో ఏ విధమైన అస్పష్టత చోటు చేసుకోకుండా చక్కని ఆచరణము కలవాడు దక్షుడు ***(ప్రత్యుత్పన్నేషు కార్యేషు సద్యః యథావత్ ప్రతిపత్తుం సమర్థః దక్షః).*** జ్ఞాతవ్య కర్తవ్యముల యందు సమర్థుడైన వాడు దక్షుడు. దక్షునిలో సమయస్ఫూర్తి ప్రధాన మైనది. అందుచేత గ్రహించ వలసిన దానిని వెంటనే గ్రహించే సమర్థత, చేయవలసిన దానిని వెంటనే ***(సద్యః)*** చేయ గలిగే దక్షత భక్తుడైన దక్షునికి ఉంటుంది. ఈ విధమైన సమర్థత జ్ఞానికి సమ్యక్ జ్ఞానము వలన, కర్మయోగికి చిత్త ప్రసాదము వలన సాధ్య మవుతుంది.

**ఉదాసీనుడు**

పక్షపాతము లేనివాడు ఉదాసీనుడు. తన కంటూ ఒక పక్షము లేనివాడు. తాను మరొక పక్షమును ఆశ్రయించని వాడు ఉదాసీనుడు ***(న కస్యచిత్ మిత్రాదేః పక్షం భజతే యః స ఉదాసీనః).*** తటస్థ వైఖరి కలవాడు. అతడే యతిపురుషుడు. నిర్మముడు, నిరహంకారుడు అని పూర్వ లక్షణాలలో మనము చర్చించుకున్న భక్తుని వైభవమే ఈ ఉదాసీనతకు హేతువు.

ఉదాసీనుడు అంటే దేనినీ పట్టించుకోని వాడు అనేది అర్థం కానే కాదు. దేనిని పట్టించుకున్నా దానికి పట్టుబడని వాడు ఉదాసీనుడు. ముట్టీ ముట్టని వాడు. అంటీ అంటని వాడు. ఉన్నట్లే ఉన్నా లేనివాడు. అద్దం లాంటి వాడు. అద్దం లాగా అర్థం చెప్పేవాడు.

ఇంటిలో ఉంటే, బయట ఉండేది కనిపించదు. బయట ఉంటే, లోన ఉండేవారు కనిపించరు. గడప మీద ఉంటే, బాహ్యాభ్యంతరాలలో ఉన్నదంతా గోచర మవుతుంది. ఒక పక్షం వహించే వారికి రెండవ పక్షము

అర్థం కాదు. ఏ పక్షము లేకుండా మధ్యస్థులైన వారికి ఉభయ పక్షాలూ అర్థ మవుతాయి. అదే ఉదాసీనత లోని వైభవము.

### గతవ్యథుడు

వ్యథ అంటే బాధ. భయంతో కూడిన ఆవేదన. దేని చేత జనులు భీతి చెందుతారో, కలత పడి చలిస్తారో, దానిని వ్యథ అన్నాడు అమరసింహుడు ***(వ్యథ భయ చలన యోః).*** అలాంటి భయం ఎవరి హృదయంలో అదృశ్యమైందో అతడు గతవ్యథుడు. భయం లేని వాడు. భయం పోయిన వాడు ***(గతవ్యథః గత భయః).***

గతము అంటే పోయింది అని అర్థము. ఏదైనా పోయింది అంటే, ఉన్నది పోతుందే గాని లేనిది పోదు. వ్యథ పోయింది అంటే, అలా పోక ముందు అది ఉంది అని అర్థము. ఎక్కడ ఉంది? ఎక్కడ నుండి పోయిందో అక్కడ ఉంది. చిత్తము లోనే ఉంది. చిత్తము నుండే నిర్గత మైంది.

చేయ వలసినవి చేయక పోవడము, చేయ కూడనివి చేయడము, అలాగే ప్రాప్తించ వలసినవి ప్రాప్తించక పోవడము, ప్రాప్తించ కూడనివి ప్రాప్తించడము వ్యథకు కారణాలు. ఇవే తాపాన్ని కలిగిస్తాయి.

జ్ఞాని తాను అకర్త, అభోక్త అనే జ్ఞానంతో సంపన్నుడై ఉండటం చేత, కృత్యాకృత్యములు అతనిని బాధించ లేవు. ***న ఏనం కృతాకృతే తపతః -*** చేసినవి, చేయనివి రెండూ జ్ఞానిని తపింప చేయవు అన్నది వేదం. అందుచేత జ్ఞాని గతవ్యథుడు.

ఇక భక్తుడు పరమేశ్వరుని ఆశ్రయంలో ఉండటం చేత, బాధలు, భయాల నుండి విడిపడి గతవ్యథుడై ప్రసన్నుడై ఉంటాడు.

### సర్వారంభ పరిత్యాగి

కర్మలన్నీ ఆరంభాలు. మొదలయ్యేవి ఆరంభాలు. ఇహపర సంబంధమైన కర్మలన్నీ ఆరంభాలే. అట్టి కర్మల నన్నిటినీ విడిచి పెట్టిన వాడు సర్వారంభ పరిత్యాగి ***(కర్మాణి సర్వారంభాః, తాన్ పరిత్యక్తుం శీలం అస్యేతి సర్వారంభ పరిత్యాగీ).*** ఆత్మకు కర్మలు లేవు. ఆత్మ యందు కర్మలు ఆరంభాలు కావు. ఆత్మ తానే అనే ఎరుక గల జ్ఞాని కర్మలు చేసినా చేయని వాడే. కనుక అతడు సర్వారంభ పరిత్యాగి. కర్తృత్వాభిమానం లేకుండా కర్త భగవంతుడే గాని తాను కాదు అని భావించడం చేత భక్తుడు కూడా సర్వారంభ పరిత్యాగియే.

**యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి । 17**
**శుభాశుభ పరిత్యాగీ భక్తిమా న్యః స మే ప్రియః ॥**

*యః-న-హృష్యతి-న-ద్వేష్టి-న-శోచతి-న-కాంక్షతి*
*శుభాశుభ పరిత్యాగీ-భక్తిమాన్-యః-సః-మే-ప్రియః*

| | | |
|---|---|---|
| యః | = | ఎవడు |
| న హృష్యతి | = | సంతసించడో |
| న ద్వేష్టి | = | ద్వేషించడో |
| న శోచతి | = | శోకించడో |
| న కాంక్షతి | = | అభిలషించడో |
| శుభాశుభపరిత్యాగీ | = | శుభాశుభ కర్మములను విడిచిన వాడో |

| | | |
|---|---|---|
| భక్తిమాన్ | = | భక్తుడు |
| యః | = | ఎవడో |
| సః | = | వాడు |
| మే | = | నాకు |
| ప్రియః | = | ఇష్టుడు |





**అర్జునా! నా భక్తుడు సంతోషించడు. ద్వేషించడు. దుఃఖించడు. ఏదీ కాంక్షించడు. మంచిచెడులను దాటిన వాడు. అందుకే అతడు నాకు ప్రియుడు.**

**వ్యాఖ్య**

అందరి మనస్సులలో ఇష్టాలు ఉంటాయి. అభీష్టాలూ ఉంటాయి. అవి తీరితే మనషులు సంతోషిస్తారు. ఇష్టాలు లేని వాడికి, అభీష్టాలు అర్థం గాని వాడికి తీరే దేముంటుంది? తీరేందుకు జ్ఞాని మనస్సులో ఏమీ లేనందున, అందరూ ఇష్టమని భావించేవి ప్రాప్తించినా జ్ఞానిలో సంతోషము కనిపించదు ***(న హృష్యతి ఇష్ట ప్రాప్తౌ).***

మనస్సులలో ఇష్టాలే కాదు, అయిష్టాలూ ఉంటాయి. ఇష్టాలు ప్రాప్తిస్తే మనుషులు ఎలా సంతోషిస్తారో, అలాగే అయిష్టాలను, అయిష్టాలు ప్రాప్తించడానికి గల కారణాలను ద్వేషిస్తారు. అయిష్టమే ద్వేషానికి కారణము. కానీ, ఇతరులు అనిష్టాలుగా భావించేవి సంభవించినా జ్ఞాని ద్వేషించడు. జ్ఞానికి ఇష్టాలే లేవు కనుక, అనిష్టాలు కూడా ఉండే అవకాశం లేదు. అనిష్టాలు లేవు కనుక ద్వేషమూ ఉండదు ***(న ద్వేష్టి అనిష్టప్రాప్తౌ).*** ఇష్టం రాగ మైతే, అనిష్టము ద్వేష మవుతుంది. జ్ఞాని రాగద్వేషాలకు అతీతుడు.

ఎవరికి ఏది ప్రియమో అది వారికి దూరం కాకూడదని వారు భావిస్తూ ఉంటారు. కొందరికి ధనం ప్రియం. కొందరికి భార్య ప్రియం. కొందరికి అందం ప్రియం. అందరికీ ప్రాణం ప్రియం. ప్రియమైనవి దూరమైతే దుఃఖిస్తూ ఉంటారు. కానీ, జ్ఞానికి దుఃఖం తెలిసే అవకాశమే లేదు. కనుక, అతడు ఎప్పుడూ దుఃఖించడు. ప్రియ మైనది దూరం అయితేనే దుఃఖం కలుగుతుంది. కాని, జ్ఞానికి ప్రియమైనది దూర మయ్యేది కాదు. అదే ఆత్మ. జ్ఞానికి ఆత్మ ఒక్కటే ప్రియము. ఆత్మ కారణం గానే సర్వమూ అతనికి ప్రియము ***(ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి!).*** ఆత్మ దూర మయ్యేది కాదు. అది తన స్వరూపమే. ప్రియ మైనది దూరమై నపుడు దుఃఖం కలుగుతుంది. ప్రియమైన ఆత్మ విషయంలో వియోగం లేనందున జ్ఞానికి శోకం లేదు; దుఃఖం రాదు ***(న శోచతి ప్రియ వియోగేన).***

మనిషి లోని కొరత మనస్సులో కోరికను కదిలిస్తుంది. లేని దానిని పొంది తృప్తి చెందాలని మనస్సు పరుగులు తీస్తుంది. అసంతృప్తి ఉన్నంత వరకు సముద్రంలో అలలు కదిలినట్లు, మనస్సులో ఆశలు కదుల్తూ ఉంటాయి. ఆత్మవిదుడైన జ్ఞాని అసంతృప్తి తెలియని వాడు. వెలితి లేనివాడు. కోరికలు కదలని వాడు. లభించనిది ఉంటే, దానిని కోరడం జరుగుతుంది. సర్వము తానైన ఆత్మరూపుడు పొంద దగిన దంటూ లేనందున, అతడు దేనినీ కోరడు ***(న చ అప్రాప్తం కాంక్షతి).***

శుభములు అంటే పుణ్యములు. అశుభములు అంటే పాపములు. స్వరూప అజ్ఞానం చేత మనిషి పుణ్య పాప కర్మల్ని ఆచరించి, వాటికి సంబంధించిన స్వర్గ నరక ఫలాలను అనుభవిస్తూ ఉంటాడు. కర్మ యందు అకర్మమును దర్శించే జ్ఞాని తాను అకర్త యనే భావన లోనే ఉంటాడు కనుక శుభాశుభములను అంటకుండా ఉంటాడు. అతడే శుభాశుభ పరిత్యాగి ***(శుభాశుభే కర్మణీ పరిత్యక్తుం శీలమ్ అస్యేతి శుభాశుభ పరిత్యాగీ).*** అట్టి భక్తుడు భగవంతునికి ప్రియుడు. సంతసించకుండా, ద్వేషించకుండా, శోకించకుండా, కాంక్షించకుండా, శుభాశుభాలకు అతీతుడై సంచరించే జ్ఞాని ఒక కదిలే దేవాలయం. నడిచే దైవం. భవ్యమైన భక్తుని జీవన వైభవాన్ని వర్ణించడానికి మాటలు చాలవు. అదొక దివ్యమైన అలౌకికానుభూతి. పవిత్రమైన లీలా విభూతి.

### ఆఖ్యాయిక

పూర్వం అదొక రాజ్యం. రాజు గారికి లేక లేక ఒక పుత్రుడు వంశాంకురంగా జన్మిస్తాడు. ఆ బిడ్డకు

అలంకరించి ఉన్న అమూల్యమైన రత్నహారాల కొరకు గజదొంగలు ఆ బిడ్డను అపహరిస్తారు. ఆభరణాలను దోచుకొని, ఆ పిల్లవాణ్ణి దూర ప్రదేశాలకు తీసుకువెళ్ళి వదిలేస్తారు.

పిల్లవాడు పెరుగుతూ పెరుగుతూ బిచ్చగాడు అవుతాడు. ఏకాకిగా జీవిస్తూ ఉంటాడు. ఒక గోచి పెట్టుకొని, అక్షయ పాత్రగా ఒక డబ్బాను చేత పట్టుకొని, భుజానికి జోలెను తగిలించుకొని, చిరిగిన బట్టను తలకు చుట్టుకొని, ఆకలేస్తే బిచ్చ మెత్తుకుంటూ, నిద్ర వస్తే చెట్టు క్రింద పడుకొని నిద్రిస్తూ ఉంటాడు.

ఐదు దశాబ్దాలు దొర్లి పోయాయి. రాజ్యంలో రాజు గారు మరణించారు. రాజు సంతతి వారే సింహాసనాన్ని అధిష్టించాలి అనేది ఆ రాజ్యంలో అనాదిగా వస్తున్న ఆచారము. రాజు గారికి కలిగిన ఒకానొక వంశాంకురం బాల్యం లోనే అపహరింప బడ్డాడు. పుట్టుమచ్చలతో సహా, బిడ్డ గురుతు లన్నీ చెప్పి, గూఢచారులను పంపి దేశ మంతా గాలించినా బిడ్డ లభ్యం కాలేదు.

ఇప్పుడేమో రాజు గారు మరణించారు. మంత్రిగారు నైష్ఠికుడు. వేదాధ్యయన తత్పరుడు. ఎంత ఆలోచించినా కర్తవ్యం బోధ పడలేదు. అన్యులను రాజ సింహాసనంపై కూర్చో పెడితే, రాజ్యానికి కీడు వాటిల్లుతుం దేమో నని మంత్రి గారి అనుమానం.

ఈ లోగా ఒక సాధు మహాత్ముడు ఆ రాజ్యానికి వచ్చాడు. మంత్రి వెళ్ళి ఆయన పాదాలపై పడి ప్రార్థించాడు. సాధు మహాత్ముని హృదయం ద్రవించింది. రాజకుమారుని జాడను దివ్య దృష్టితో తెలుసు కొనిన ఆ సాధు పురుషుడు, రాజకుమారుడు బిచ్చగాడై, ఉజ్జయినీ ఆలయ ప్రాంగణంలో తిరుగుతూ ఉన్నాడని చెప్పాడు.

ముఖ్యులను వెంట బెట్టుకొని మంత్రిగారు స్వయంగా ఉజ్జయిని చేరాడు. రాజకుమారుని గుర్తించాడు. ఆనవాళ్ళను బట్టి అతడే రాజకుమారుడని బుజువైంది. మంత్రిగారు ఆనందంతో అతనిని రాజ్యానికి తీసుకొని వచ్చి, చదువుసంధ్యలు చెప్పించారు. సంస్కరింప బడిన ఆ వ్యక్తిని ప్రజామోదంతో రాజును చేశారు. మంత్రిగారి సంరక్షణలో దినదిన ప్రవర్ధమానంగా ఎదిగి, రాజుగా అతడు గొప్ప కీర్తిప్రతిష్ఠలను ఆర్జించాడు. ఇలా కొన్ని సంవత్సరాలు గడిచి పోయాయి.

ఒకనాడు రాజు గారికి ఒక వింత ఆలోచన కలిగింది. ఉజ్జయినీ నగర వీధులలో సుమారు యాభై సంవత్సరాలు జీవించిన జీవన విధానాన్ని మరొక్కసారి, ఈ దశలో అనుభవించా లన్న కోరిక కలిగింది.

ఒక మాసం రోజులు తీర్థయాత్రా నెపంతో, రాజ్యాన్ని మంత్రి గారికి అప్పగించి, తాను కొందరు సన్నిహితులతో కలిసి బయలుదేరి ఉజ్జయిని చేరాడు. ఒక సత్రాన్ని అద్దెకు తీసుకున్నాడు. సహచరులను చుట్టు ప్రక్కల ఉన్న తీర్థక్షేత్రాలను దర్శించి రమ్మని పంపించి వేశాడు.

ఒకనాడు ఉదయాన్నే పూర్వపు వేషాన్ని ధరించాడు. గోచి పెట్టుకున్నాడు. జోలెను, డబ్బా నొక దానిని తగిలించు కున్నాడు. తలకు చిరిగిన పాత బట్టను చుట్టు కున్నాడు. నగర వీధుల లోకి బిచ్చగాడి లాగా ప్రవేశించాడు.

ఒక పూల కొట్టు ముందు నిలబడ్డాడు. పూల వర్తకుడు అతణ్ణి చూడగానే, 'ఇంతకాలం ఏమయ్యావు? రారా. ఇదిగో తీసుకో!' అంటూ కొన్ని నాణెములను ఇచ్చాడు. బిచ్చగాని రూపంలో ఉన్న రాజు ఆ డబ్బును అందుకొని దణ్ణం పెట్టి అక్కడ నుండి కదిలాడు. పూర్వం అన్ని నాణెములు లభిస్తే ఎంత సంతసించే వాడో! కానీ ఇప్పుడు మనస్సులో అలాంటి సంతోషమే లేదు.

మరొక అపరాల కొట్టు వద్దకు వెళ్ళగానే, ఇతడిని చూచిన వర్తకుడు బుసలు కొడుతూ, 'మళ్ళీ





దాపురించావు! ఉదయాన్నే నీ ముఖం చూశాను. ఇక ఈ రోజు బేరం పూజ్యమే' అంటూ దూషించాడు. అతని దూషణలను ఆలకించి మెల్లగా ముందుకు సాగి పోతాడు రాజు. అంతేగాని, మనస్సులో తిట్టిన వానిపై ద్వేషమే కలగదు.

మరొక వడ్డీ వ్యాపారి కొట్టు ముందు నిలబడ్డాడు రాజు. ఆ వడ్డీ వ్యాపారి అప్పుడే ఎవరితోనో కలహించి కలత చెంది ఉన్నాడు. బిచ్చగాణ్ణి చూడగానే, 'నికృష్టుడా! ఎక్కడ చచ్చావు ఇంతకాలం? మళ్ళీ నీ శవిగొట్టు ముఖాన్ని చూపడానికి వచ్చావా?' అని రెచ్చిపోతూ, కోపాన్ని ఆపుకోలేక బలంగా కొడతాడు. ఆ దెబ్బకు బిచ్చగాని రూపంలో ఉన్న రాజు తూలి క్రిందపడి, మెల్లగా లేచి, తన దారిన తాను పోతాడు. అంతే గాని, ఏ మాత్రం దుఃఖించడు. విచారించడు.

ఆ ప్రక్కనే ఒక నిత్యాన్నదాన సత్రం ఉంది. క్రొత్తగా ఉదారులు దానిని నెలకొల్పి ఉన్నారు. వారు గతంలో ఈ బిచ్చగాణ్ణి చూచి ఎరుగరు. వడ్డీ వ్యాపారి దుష్ప్రవర్తన వంతా చూచి బాధపడిన ఆ సత్రం యజమానులు అతనిని లోనికి తీసుకొని వెళ్ళి, ఓదార్పు మాటలు పలికి, భోజనం పెట్టిస్తారు. బట్టలు ఇస్తారు. కొంత డబ్బు కూడా ఇస్తారు. 'నాయనా! నిన్ను ఆ దుష్టుడు దుర్మార్గంగా బాధించాడు. అది మనస్సులో పెట్టుకోకు. వాడు అంతే. నువ్వు ఇక వెళ్ళు. నీకు ఇంకేమైనా డబ్బు అవసరమా? విస్సంకోచంగా అడుగు, ఇస్తాము' అంటారు. కానీ, రాజు వద్దని తల ఊపి, తన దారిన తాను వెళ్ళి, అద్దెకు తీసుకున్న సత్రానికి చేరి, దుస్తులు మార్చుకొని, ప్రశాంతంగా కూర్చుంటాడు. ఏదో అనిర్వచనీయమైన దివ్యానందంలో ఓలలాడుతూ ఉంటాడు. జరిగిన ఈ సన్నివేశాలలో శుభాశుభాలు అతనిని అంటవు. అతడు శుభాశుభాలకు అతీతుడు.

తాను బిచ్చగాడుగా తిరిగినా, అన్ని నాణెముల బిచ్చం లభించినా అతడు సంతసించలేదు. కోట్లకు అధిపతి యైన రాజు ఆ నాణెములకు సంతసిస్తాడా? **(న హృష్యతి)**. వర్తకుడు నిష్కారణంగా నిందించినా ద్వేషం లేదు. తాను రాజు అని తెలిస్తే అతడు దూషిస్తాడా? అందుకని ద్వేషం లేదు **(న ద్వేష్టి)**. తాను స్వతహాగా రాజై ఉన్నందున, కొట్టినా దుఃఖించ లేదు **(న శోచతి)**. అన్నసత్రం వాళ్ళు ఆదరించి, ఇంకేమన్నా కావాల్సి ఉంటే అడుగు అంటే, పూర్వమైతే ఆశించే వాడేమో గాని, ప్రస్తుతం తాను మకాం ఉన్న సత్రంలో తన దగ్గరే విశేషంగా ధనం ఉండే టప్పుడు ఏమి కోరుతాడు? **(న కాంక్షతి)**. తానేమిటో తనకు తెలిసి, కేవలం లీలా మాత్రంగా బిచ్చ మెత్తుకున్న రాజుగారు శుభాశుభాలకు ఎలా అతీతుడో, తన స్వరూప జ్ఞానమును కలిగి ఉన్న ఆత్మవిదుడు ఈ ప్రపంచంలో క్రీడా విలాసంగా చరిస్తూ ఉన్నా, అలౌకిక ఆనందానుభూతిలో ఓలలాడుతూ ఉంటాడు. ప్రపంచము, ప్రపంచం లోని సన్నివేశాలు జ్ఞానిని కదిలించ లేవు. అవి అతనికి స్వప్నతుల్యాలు. ప్రపంచమే విస్మృతప్రాయము. ఎవరి జ్ఞానము స్థిర మైనదో **(యస్య స్థితా భవేత్ప్రజ్ఞా)**. ఎవరి ఆనందము నిత్య ప్రవాహమో **(యస్య ఆనందః నిరంతరః)**. అట్టి జ్ఞానికి ఈ ప్రపంచము విస్మృతప్రాయము **(సః ప్రపంచః విస్మృత ప్రాయః - వివేక చూడామణి)**.

సమః శత్రౌ చ మిత్రే చ తథా మానాపమానయోః ।
శీతోష్ణ సుఖదుఃఖేషు సమః సఙ్గవివర్జితః ॥ 18
తుల్యనిన్దాస్తుతి ర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్ ।
అనికేతః స్థిరమతి ర్భక్తిమాన్ మే ప్రియో నరః ॥ 19

**సమః-శత్రౌ-చ-మిత్రే-చ-తథా-మానాపమానయోః**
**శీతోష్ణ సుఖదుఃఖేషు-సమః-సంగవివర్జితః**

**తుల్యనిందాస్తుతిః-మౌనీ-సంతుష్టః-యేన-కేనచిత్**
**అనికేతః-స్థిరమతిః-భక్తిమాన్-మే-ప్రియః-నరః**

| | | | |
|---|---|---|---|
| శత్రౌ చ | = శత్రువు నందు | మౌనీ | = మననశీలుడు |
| మిత్రే చ | = మిత్రుని యందు | యేన కేనచిత్ | = దేని చేత నైనను |
| తథా | = అటులే | సంతుష్టః | = తృప్తి నొందు వాడు |
| మానాప మానయోః | = మానావమానముల యందు | అనికేతః | = ఇల్లు లేని వాడు |
| సమః | = సముడు | స్థిరమతిః | = స్థిరబుద్ధి గల వాడు |
| శీతోష్ణసుఖదుఃఖేషు సమః | = శీతోష్ణముల యందు సుఖదుఃఖముల యందు సముడు | భక్తిమాన్ | = భక్తుడైన |
| | | నరః | = మానవుడు |
| సంగవివర్జితః | = సంగత్వము లేనివాడు | మే | = నాకు |
| తుల్య నిందాస్తుతిః | = నిందాస్తుతులలో సమముగా ఉండువాడు | ప్రియః | = ఇష్టుడు |

**అర్జునా! నా భక్తునికి శత్రువైనా, మిత్రుడైనా ఒక్కటే. మానావమానాల్ని, శీతోష్ణాలను, సుఖదుఃఖాలను అతడు సమానంగా భావిస్తాడు. అతడు అసంగుడు.**

**నిందాస్తుతులు అతనికి సమానము. అతడు మౌని. లభించిన దానితో తృప్తి చెందేవాడు. తనకంటూ స్థావరము లేనివాడు. నిశ్చల హృదయుడు. అట్టి భక్తుడు నాకు ప్రియుడు.**

### వ్యాఖ్య

ఈ రెండూ ఏకాన్వయం గల కూట శ్లోకాలు. అందుచేత రెండిటిని కలిపి వ్యాఖ్యానిస్తున్నాను. భక్తుని దశ లక్షణాలను వివరించే ఈ శ్లోకద్వయం ద్వంద్వ పంచకముతో నిండి ఉంది. అవే శత్రుమిత్రులు, మానావమానాలు, శీతోష్ణాలు, సుఃఖదుఃఖాలు, నిందాస్తుతులు. పూర్వాధ్యాయాలలో వీటిని గూర్చి చర్చించుకొని ఉన్నప్పటికీ, సందర్భోచితంగా ఇక్కడ కూడా సంక్షిప్తంగా చెప్పుకుందాం.

#### శత్రుమిత్రులు

ప్రియమైన వాడు, ఉపకారం చేసేవాడు మిత్రుడు. అప్రియమైన వాడు, అపకారం చేసేవాడు శత్రువు. కనుక, సాధారణంగా మిత్రుడు చేరువై నపుడు మనస్సులో ప్రియవృత్తి కదిలి సంతోషము, శత్రువు సమీపించి నపుడు మనస్సులో అప్రియ వృత్తి కదిలి సంతాపము కలుగుతూ ఉంటాయి. వికార హేతువులు ఇలా మనలో వికారాలను కలిగిస్తూ ఉంటాయి. ఇది వ్యావహారికంగా సర్వులకు ఉండే సాధారణ అనుభవము.

భక్తుడు ఇందుకు విలక్షణంగా ప్రవర్తిస్తాడు. అతనిది వ్యావహారిక దృష్టి కాదు. పారమార్థిక దృష్టి. ఆత్మదృష్టి. జ్ఞాన స్వరూపమైన భక్తిలో అందాలే గాని, ద్వంద్వాలు తలెత్తవు. ఉపకార అపకారాలు బుద్ధిలో నిలవవు.

జ్ఞానికి ఉపకారం చేసే శక్తి ఎవరి కుంది? అలాగని, అపకారం చేసే సామర్థ్యం ఎవరి కుంది? జ్ఞానికి పెడితే అది జ్ఞానికి ఉపకారమా? జ్ఞానిని కొడితే అది జ్ఞానికి అపకారమా? జ్ఞాని తినేవాడు కాడు. అలాగే దెబ్బలు తినేవాడూ కాడు. పెడితే తినే దైనా, కొడితే తినే దైనా దేహమే. ఉపకారమైనా, అపకారమైనా దేహానికే. జ్ఞాని దేహానికి సాక్షిమాత్రమే. కనుక అపకార ఉపకారాలకు, వాటిని ప్రారబ్ధాధీనమైన తన దేహానికి కలిగించిన శత్రుమిత్రులకు జ్ఞాని సాక్షిమాత్రుడే గాని, జ్ఞానికి శత్రుమిత్రాదులు లేరు. కనుక, శత్రుమిత్రుల యందు జ్ఞాని సమంగా వర్తిస్తాడు ***(సమః శత్రౌచ మిత్రేచ).***

ఇక్కడ, మరొక విషయాన్ని కూడా స్పష్టంగా అర్థం చేసుకోవాలి. జ్ఞానిని చాలా మంది శత్రువుగా





భావించవచ్చు. అంతమాత్రాన, జ్ఞానికి శత్రువులు ఉన్నారని భావించడానికి వీలు లేదు. శత్రుత్వ మనేది జ్ఞానిని శత్రువుగా భావించే దౌర్భాగ్యుల దుష్ట చిత్తాలలో ఉందే గాని, సౌజన్యమూర్తి అయిన జ్ఞాని సమ చిత్తంలో లేదు. తనను శత్రువుగా భావించే దుష్టులను, తనతో సఖ్యము చేసే మైత్రీ భావం గల సజ్జనులను జ్ఞాని సమదృష్టితో వీక్షిస్తాడు.

#### మానావమానాలు

ప్రస్తుత శ్లోకం లోని ద్వంద్వ పంచకములో మానావమానాలు రెండవ జంట. సమ్మానమైనా, అవమాన మైనా, రెండిటిని జ్ఞాని సమంగా వీక్షిస్తాడు **(మానాపమానయోః సమః).**

గౌరవాలలో జనులు పొంగి పోవడము, అగౌరవాలలో క్రుంగి పోవడము సాధారణంగా లోకంలో మనం చూస్తూ ఉంటాము. కానీ, జ్ఞాని ఇందుకు భిన్నంగా ఉంటాడు. తోష విషాద హేతువులు వికారములను కలిగించడానికి సిద్ధంగా ఉన్నా, తనలో ఏ వికారం లేకుండా సమంగా ఉండేవాడు జ్ఞానీ భక్తుడు. సన్మానాలు, అవమానాలు మనస్సుకు సంబంధించినవే గాని, జ్ఞానికి సంబంధించినవి కావు. మనస్సు లోని జ్ఞానాజ్ఞానములను ప్రకాశింప చేసే సాక్షి చైతన్యము తానై ఉన్నందున, మనస్సుకు సంబంధించిన మానావమానములు జ్ఞానికి సమానములు. పరస్పర విరుద్ధమైన గౌరవాగౌరవాలలో అతడు సముడు **(సమః పూజా పరిభావయోః).**

#### శీతోష్ణాలు

శీతోష్ణాలు మూడవ జంట. ఈ విషయంలో కూడా జ్ఞాని సముడు. శీతము అంటే చలి. ఉష్ణము అంటే వేడి. శీతోష్ణాలు తమ ప్రభావాన్ని దేహంపై చూపుతాయి. దేహమే తామని భావించే దేహాభిమానులను శీతోష్ణాలు వేధిస్తూ ఉంటాయి. అందుకనే ఉష్ణ ప్రదేశాలలో జీవించే వారు వేసవి కాలంలో వేడిని భరించలేక శీతల ప్రదేశాలకు విహారార్థం వెళ్తూ ఉంటారు. అలాగే చలికాలంలో దేహానికి సంబంధించిన వస్త్రధారణ యందు కూడా ప్రత్యేక శ్రద్ధను కనబరుస్తూ ఉంటారు. జ్ఞాని దేహం కాదు. దేహం ఉండటానికి ఆధారమైన ఆత్మచైతన్యమే జ్ఞాని. కనుక శీతమైనా, ఉష్ణమైనా దేహాన్ని చలింప చేయ గలవే గాని జ్ఞానిని కదిలించ లేవు. దేహానికి సంబంధించిన శీతోష్ణాలు, ఆహార పానీయాలు జ్ఞానికి అవసరాలు కావు. తన అస్తిత్వానికి ఆహార పానీయాదులు, వస్త్ర గృహాదులు అవసరాలు కావు. అవన్నీ ప్రారబ్ధాధీన మైన దేహానికే గాని, కర్మాతీతుడైన తనకు కాదు. కనుక జ్ఞాని ఎలాగైనా ఉండ గలడు. ఎక్కడైనా ఉండ గలడు. ఏది ఉన్నా లేకపోయినా ఉండ గలడు. అతడు బ్రహ్మ స్వరూపుడు. కనుక, అంతట సమరూపుడై ఉంటాడు.

#### సుఖదుఃఖాలు

సుఖదుఃఖాలు అనేవి మనో వికారాలు. ఇది నాల్గవ జంట. ఏది సుఖం? ఏది దుఃఖం? అని ప్రశ్న వేయనంత వరకే సుఖదుఃఖాలు ఉంటాయి. సుఖదుఃఖా లనేవి రాగద్వేషాలపై ఆధారపడి ఉంటాయి. రాగద్వేషాలకు ఎలా స్థిరత్వము లేదో, రాగద్వేషాల వల్ల కలిగే సుఖదుఃఖాలకు కూడా స్థిరత్వము లేదు. అవి రాకపోకలు కలిగి ఉంటాయి. కనుక సుఖదుఃఖాలు అనిత్యాలు. నిత్యమైన, ఆత్మస్వరూప మైన ఆత్మవిదునిలో మనోవికారా లైన సుఖదుఃఖాలు ఉండ లేవు. మనస్సులో కదిలే సుఖదుఃఖాలకు జ్ఞాని సాక్షీమాత్రుడై ప్రకాశిస్తూ ఉన్నందున, సుఖదుఃఖాలలో జ్ఞాని సమంగా ఉంటాడు **(సమః సుఖదుఃఖేషు).**

#### అసంగత్వం

అద్వయమైన ఆత్మస్వరూపు డైనందున, మరొక దానితో సంగత్వము ఉండే అవకాశము లేనందున,

జ్ఞాని అసంగుడు. సంగత్వము లేనివాడు **(సంగవర్జితః).** ఆశ్రయం ఉంటేనే సంగత్వం ఉంటుంది. మరొక దానిపై ఆధార పడితేనే సంగత్వం ఉంటుంది. ఇదంతా దేహాత్మ భావము పైనే ఆధారపడి ఉంటుంది. మరొక యైన జ్ఞానికి దేహం తోనే సంబంధం లేదు, సంగత్వం లేదు. ఇక దేహానికి సంబంధించిన గృహ, వస్త్ర, క్షేత్ర కళత్రాదులతో సంబంధం ఉంటుందా? అందుకే అతడు అసంగుడు.

యమునా తీరంలో ఒక చిన్న కుటీరాన్ని ఏర్పరచుకొని ఒక సాధు మహాత్ముడు జీవిస్తూ ఉండేవాడు. ఒకనాడు యమున కెళ్ళి స్నానం చేసి వచ్చే సరికి ఆయన కుటీరం అగ్ని ప్రమాదానికి గురై కాలిపోతూ ఉంది. ఆ దృశ్యాన్ని చూస్తూ ఆ సాధువు చిరునవ్వును చిందిస్తూ చిద్విలాసంతో వెలిగి పోతున్నాడు.

అది చూచిన ఒక వ్యక్తి, మహాత్మా! మీ కుటీరం కాలిపోతూ ఉంటే అలా చిరునవ్వుతో చూస్తా రేమిటి? అని ప్రశ్నించాడు.

'పండు తినబోయే పావకుడు ముందుగా తొక్కను ఎంత ప్రకాశవంతంగా తొలగిస్తున్నాడో చూసి సంబర పడుతున్నాను' అన్నాడు ఆ సాధువు.

ఎంతటి అసంగత్వం! దేహాన్ని ఆరగించబోయే అగ్నిదేవుడు, దానికి కవచం లాగా ఉన్న కుటీరాన్ని తొలగిస్తున్నాడు అనే భావన ఎంత అద్భుతము! ఆత్మ అంత అద్భుతము! అలాంటి ఆత్మజ్ఞానిని ఎవరు స్తుతించ గలరు? ఎవరు నిందించ గలరు? అతడు నిందాస్తుతులనే జంటకవుల కవిత్వానికి చిక్కేవాడు కాదు.

**నిందాస్తుతులు**

దూషించడం నింద. పొగడటం స్తుతి. ఇవే నిందాస్తుతులు. ద్వంద్వ పంచకంలో ఇది చివరి జంట. నిందాస్తుతులు మనుషుల మనస్సులను పొంగిస్తూ, క్రుంగదీస్తూ ఉంటాయి. నిందలు అమాంతం మనస్సును కాల్చేస్తూ ఉంటే, స్తుతులు బుద్ధికి ఊరట నిస్తూ ఉంటాయి. ఉత్సాహాన్ని కలిగిస్తూ ఉంటాయి. జ్ఞానికి నిందాస్తుతులు విషాద తోషాలను కలిగించ లేవు కనుక జ్ఞాని వాటి విషయంలో సమానంగా ఉంటాడు.

తనపై తనకు గౌరవం లేని వారికే పరుల స్తుతులు సుఖా న్నిస్తాయి. అలాగే నిందలు దుఃఖాన్ని కలిగిస్తాయి. అన్యుల దూషణ భూషణాలు, తిరస్కార పురస్కారాలు ఆత్మజ్ఞానిని స్పృశించ లేవు.

ఏముంది నిందాస్తుతులలో! నిందలు నిందలూ కావు; స్తుతులు స్తుతులూ కావు. అన్నీ పదలయలే. అక్షర విన్యాసాలే. వాచారంభాలే. శబ్ద తరంగాలే.

నిందలలో తత్త్వం లేదు కనుక, నిందించే వాడు తడబడుతూ తిడుతూ ఉంటాడు. స్తుతులు వాస్తవాలు కావు కనుక, ఒక వైపు స్తుతించే వారు స్వరం పెంచి స్తుతిస్తూ ఉన్నా, అందుకొనే వాడు వేదిక మీద తల దించుకొని తంటాలు పడుతూ ఉంటాడు. ఇలాంటి నిందాస్తుతులు ఆత్మజ్ఞానిని స్పృశిస్తాయా? స్పృశించ లేవు కనుకనే అతడు నిందాస్తుతులలో సమంగా శోభిస్తాడు. గుణదోషాలకు అతీతుడైన ఆత్మవిదుని దోష కథన రూపమైన నిందలు, గుణ కథన రూపమైన స్తుతులు చేరలేక వెను దిరుగుతాయి.

**మౌని**

మౌనము అంటే వాఙ్నియమము. మౌనము కలవాడు మౌనవంతుడు. అంటే వాక్కును నియమించుకున్న వాడు **(మౌనీ మౌనవాన్ సంయత వాక్).** వాక్కును నియమించడము అంటే, మాట్లాడటం మానేయడం కాదు. లేని మూగతనాన్ని కొని తెచ్చుకోవడమూ కాదు. అవసరమైన విషయాన్ని మాట్లాడటము, అది కూడా ఎంత అవసరమో అంత విషయాన్నే భావగర్భితంగా మాట్లాడటము. ఇదే వాఙ్నియమము. అంతేగాని, మాటల్ని మూట కట్టేసి మనస్సులో మథన పడటం కాదు. మౌనము అనేది మనన శీలత్వం కొరకే. అంతేగాని, మౌనం





అలంకారమూ కాదు, ఆభరణమూ కాదు. జ్ఞానికి మౌన మనేది సహజంగా ఉంటుంది. సాధకుడు అతి వాగుడు తగ్గించుకోవ డానికి, అనర్థాన్ని నివారించుకోవ డానికి మౌనాన్ని అభ్యసించ వలసి ఉంటుంది.

**సంతుష్ట చిత్తుడు**

ఆశించింది చేతి కందితే జనులు తృప్తి చెందుతూ ఉంటారు. వారి తృప్తి కొన్నిటి మీద ఆధారపడి ఉంటుంది. అలా గాక, దేనితో నైనా **(యేన కేనచిత్)** సంతృప్తి చెందే వాడు జ్ఞాని, లేదా భక్తుడు **(సంతుష్టః).** దేనితో నైనా సంతృప్తి చెందే వాడు అంటే, ఏది వచ్చినా అసంతృప్తి చెందని వాడు అని అర్థము. అంటే, ఏది రాకపోయినా సంతోషంగా ఉండేవాడు అని భావము. తన సంతృప్తికి ఏదీ అవసరము లేని వాడు. సదా తావే సంతృప్తిలో ఉండే వాడు. నిత్య సంతోషి. నిత్యపూర్ణుడు. సముద్రం లాగా తన పూర్ణత్వము, లేదా సంతోషము దేని పైనా ఆధారపడి లేదు. అలాంటి **(యేన కేన చిత్ సంతుష్టః),** సంతుష్ట చిత్తుణ్ణి మహాభారతము బ్రాహ్మణుడు అన్నది. అంటే, బ్రహ్మజ్ఞానముతో నిత్య సంతుష్టుడై ఉండే వాడే బ్రాహ్మణుడు.

**యేన కేనచి దాచ్ఛన్నో యేనకేనచి దాశితః।**

**యత్ర క్వచన శాయీ స్యాత్ తం దేవా బ్రాహ్మణం విదుః॥**

లభించిన దానితో దేహాన్ని కప్పుకొని, ప్రాప్తించిన దానిని ఆరగించి, ఎక్కడో ఒక చోట శయనించి, కాలాన్ని వెళ్ళబుచ్చే మహాత్ముడు బ్రాహ్మణుడు అని మహాభారతము - శాంతిపర్వము.

**అనికేతుడు**

నికేతము అంటే ఇల్లు, లేదా నివాస స్థానము అని అర్థము. ఇల్లు, లేదా ఆశ్రయము కలవాడు నికేతుడు. అలా ఆశ్రయము, లేదా ఇల్లు లేని వాడు అనికేతుడు **(నికేతః ఆశ్రయః నివాసః న విద్యతే యస్య సః అనికేతః).**

భక్తుడు ఇల్లు లేని వాడు అంటే, భక్తుడైన వానికి ఇల్లంటూ ఉండ కూడదని, అవసర మనకుంటే, అద్దె కొంపలో నివసించాలని వ్యాఖ్యానించిన ప్రబుద్ధుల ప్రవచనాలు కూడా బాల్యంలో నేను విన్నాను.

ఇల్లు లేని వాడు అంటే, తన కంటూ ఇల్లు లేని వాడు అని కాదు. తన దంటూ ఇల్లు లేని వాడు అని అర్థము. మమకారం లేని వాడు. మమ బుద్ధి లేని వాడు.

ఏ ఇంటి యజమాని నైనా 'ఎవరి దండీ ఈ ఇల్లు' అంటే ఏమి చెబుతాడు? 'నా దండీ' అంటాడు. అదే మమ బుద్ధి. నికేతుని బుద్ధి. అది లేని వాడు అనికేతుడు. ఇల్లు లేని వాడు కాదు. 'నా ఇల్లు' అనేది లేని వాడు.

కార్యాలయంలో పని చేస్తాం. అది మన దవుతుందా? కొంతసేపు హోటల్‌లో కూర్చుంటాం. ఆ హోటల్ మనదా? మన దైతే బిల్లు చెల్లిస్తామా? స్నేహితుల ఇళ్ళల్లో, బంధువుల ఇళ్ళల్లో కొంత కొంత కాలం గడుపుతాము. కొన్ని గంటలు సినిమా థియేటర్‌లో కూర్చుంటాం. అలాగే రోజుకు కొన్ని గంటలు ఇంటిలో ఉంటాము. ఏది మనది? ఈ ప్రపంచంలో మనది ఎక్కడుంది? మనదే అయితే, మనం పోయేనాడు అది కూడా మనతో రాదెందుకని? రాకపోతే పోయె! ప్రాణం పోయిన క్షణాన, మనది - మనది అని అల్లాడిన ఇల్లు మనల్నే లోపల ఉంచుకోవ డానికి ఇష్ట పడదు. వెంటనే గుమ్మం దాటించ మంటుంది. ఇది గ్రహించిన భక్తుడు మమ బుద్ధి లేకుండా జీవిస్తాడు.

భూ ప్రపంచం లోనే నీకు ఇల్లు లేదని వేదాంతం చెబుతూ ఉంటే, వెన్నెల పురుగులు అమాంతం అవనిని విడిచి, ఆకాశంలో ఆశ్రయాలు నిర్మించుకోవాలని తహతహ లాడుతున్నాయి. 'ఆలు లేదు - చూలు లేదు, కొడుకు పేరు ఆదిలింగం' - ఇదీ వరుస. చూలు అంటే గర్భము, లేదా బిడ్డ అని అర్థము.

చందమామలో నీళ్ళున్నాయో లేదో నని శాస్త్రజ్ఞులు ఒక వైపు పరిశోధనలు చేస్తూ ఉంటే, మమకార రాయుళ్ళు మరొక వైపు చంద్రునిలో స్థల సేకరణకు యత్నిస్తూ ఉన్నారు. ఇదే అదను అనుకొని కొందరు విక్రయించే ప్రయత్నంలో విరామం లేకుండా అలసి పోతున్నారట! ఏం చేద్దాం! మమ బుద్ధికి రెక్కలొచ్చాయి. ప్రస్తుతం అంతరిక్షంలో ఉంది. ఊపిరి ఆడకుండా ప్రాణం అల్లాడుతోంది. అల్లాడే ప్రాణాన్ని చూస్తూ మనస్సు అస్థిరంగా ఉంది. మమత్వ బుద్ధి ఉన్నంత వరకు స్థిరత్వం ఉండదు. మమత తొలగితేనే స్థిరత.

**స్థిరమతి**

అస్థిరమైన మతి గల వాడు మందమతి. స్థిరమైన మతి గల వాడు స్థిరమతి. అదే స్థిర బుద్ధి. స్థిర మైనది ఏదో దాని యందు నిలిచే బుద్ధి. స్థిర మైనది పరబ్రహ్మ మొక్కటే. అట్టి పరబ్రహ్మము నందు స్థిరంగా నిలిచే బుద్ధి స్థిరబుద్ధి ***(స్థిరమతిః - స్థిరా పరమార్థ వస్తు విషయా మతిః యస్య సః స్థిరమతిః).*** స్థిరమైన జ్ఞానము కలిగిన బుద్ధి. స్థిరమైన ప్రజ్ఞ. స్థితప్రజ్ఞ. అట్టి స్థితప్రజ్ఞుడు భక్తుడే. భక్తుడు తప్పక స్థితప్రజ్ఞు డవుతాడు. అందుచేత భక్తుడు భగవంతునికి ప్రియుడు ***(భక్తిమాన్ మే ప్రియః నరః).*** భక్తి మోక్ష సాధనము అనే విషయంలో సందేహం అవసరం లేదు. ***అద్వేష్టాది*** శ్లోకాలలో చెప్పబడిన ముప్పై ఐదు లక్షణాలు జ్ఞానిలో స్వరూపతః శోభిస్తూ ఉంటాయి. భక్తులైన కర్మయోగులను అవి సాధ్యరూపంలో అలరిస్తూ ఉంటాయి.

*ఈ అధ్యాయ సారము నంతా సింహావలోకనంగా చివరి శ్లోకంలో చెబుతున్నాడు.*

**యే తు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే ।**
**శ్రద్ధధానా మత్పరమాః భక్తాస్తేఽతీవ మే ప్రియాః ॥** 20

***యే-తు-ధర్మ్యామృతం-ఇదం-యథా-ఉక్తం-పర్యుపాసతే***
***శ్రద్ధధానాః-మత్పరమాః-భక్తాః-తే-అతీవ-మే-ప్రియాః***

| | | | | | |
|---|---|---|---|---|---|
| యే తు | = | ఎవరయితే | పర్యుపాసతే | = | సేవిస్తున్నారో |
| శ్రద్ధధానాః | = | శ్రద్ధ గలవారై | తే | = | ఆ |
| మత్పరమాః | = | నా యందాసక్తి గలవారై | భక్తాః | = | భక్తులు |
| యథా ఉక్తం | = | పైన తెలిపిన విధముగా | మే | = | నాకు |
| ఇదం | = | ఈ | అతీవప్రియాః | = | మిగుల ఇష్టులు |
| ధర్మ్యామృతం | = | ధర్మరూపమైన అమృతమును | | | |

**అర్జునా! ఈ ధర్మము అమృత స్వరూపము. నా భక్తులు శ్రద్ధావంతులై, నన్నే పరమగతిగా భావించి, నేను చెప్పిన ఈ ధర్మాన్ని ఆచరిస్తారు. అందుకే వాళ్ళు నాకు అత్యంత ప్రీతి పాత్రులు.**

వ్యాఖ్య

## ధర్మ్యామృతం

ఇది ధర్మ్యామృతం. ఈ అధ్యాయంలో బోధించ బడింది ***(ఇదం యథోక్తం)*** ధర్మ్యామృతము ***(ధర్మ్యామృతం).*** అంటే, ధర్మ్యరూపము మరియు అమృత స్వరూపము అని అర్థము.

ధర్మము నుండి తొలగనిది, వేరు కానిది కనుక ధర్మ్యం ***(ధర్మాత్ అనపేతం ధర్మ్యం).*** ఇది అమృతత్వానికి కారణం కావడం చేత అమృత స్వరూపము ***(అమృత హేతుత్వాత్).*** జనన మరణాల నుండి ఉద్ధరిస్తుంది కనుక ఇది అమృత స్వరూపము. కనుకనే భక్తి అమృత స్వరూపము అన్నాడు భక్తి సూత్రాలలో నారద మహర్షి **(అమృత స్వరూపా చ).** భక్తి అమృత స్వరూపము. భగవంతుడు అమృత స్వరూపుడు. భక్తుడు కూడా అమృత రూపుడే. కనుకనే ఈ భక్తియోగం అనే అధ్యాయంలో అమృత వర్షం కురిసింది. అమృత స్వరూపమైన భక్తిని అనుష్ఠించిన వారు అమృత స్వరూపు లవుతారు.





భగవంతుని పరమగతిగా భావించి **(మత్పరమాః),** శ్రద్ధావంతులై **(శ్రద్ధధానాః)** భక్తి చేసే వారు భగవంతునికి అత్యంత ప్రీతిపాత్రులు **(అతీవ ప్రియాః).**

ఎవరైతే పరమేశ్వరుని మరొక దాని కొరకు కాకుండా, కేవలం పరమేశ్వరుని కొరకే సేవిస్తారో వారినే 'మత్పరములు' అంటున్నాడు భగవంతుడు. కనుక, మరొక అవసర నిమిత్తం కాకుండా మోక్షార్థమే భగవంతుని ఆశ్రయించే పరమ భక్తులు ఉత్తమ శ్రద్ధావంతులై ఉండాలి.

భగవంతుని యందు, భగవంతుని స్వరూపాన్ని ప్రామాణికంగా అందించే శాస్త్రము నందు, ప్రమాణాన్ని సుస్పష్టం చేసే సద్గురువు నందు అచంచల మైన విశ్వాసాన్ని కలిగి ఉండటమే శ్రద్ధ. శ్రద్ధ గల వారు ధర్మ్యామృతాన్ని పానం చేస్తారు. శ్రద్ధావంతులకే జ్ఞానామృతం ప్రాప్తిస్తుంది **(శ్రద్ధావాన్ లభతే జ్ఞానం).**

కర్మయోగులు సాధనా రూపమైన భక్తిని ఆచరిస్తారు. జ్ఞానయోగులు సాధ్యరూప భక్తిలో అలరారుతారు. కర్మయోగులు ధర్మాచరణంలో శుద్ధిని పొందుతారు. జ్ఞానయోగులు అమృత సిద్ధిని పొంది శోభిస్తారు. యోగులు ఆచరించే ధర్మము అమృత స్వరూపమైన జ్ఞానానికి హేతువుగా ఉంది.

కనుక కర్మయోగుల ధర్మమును, జ్ఞానయోగుల అమృతమును రెండిటిని కలిపి ఈ అధ్యాయము **ధర్మ్యామృతము**గా అందించింది. ధర్మ సంబంధమైన ఈ అమృతమే మోక్ష హేతువుగా ఉంది.

ధర్మరూపంగా శోభిస్తూ, అమృతత్వానికి సాధనం కావడం చేత అమృతమైంది. అమృతము వలె ఆస్వాదింప బడుట చేత కూడా అమృతమైంది. అక్షర రూపులైన అవ్యక్తోపాసకులు ఆస్వాదించేదీ అమృతమే. అమృత జ్ఞానం చేత ఏ అద్వేష్టృత్వాది లక్షణాలు శోభిస్తున్నాయో అవి జ్ఞానికి సహజ లక్షణాలే గాని సాధన రూపాలు కావు అని వార్తికాకారుని అభిప్రాయం కూడా.

**శ్లో ॥ ఉత్పన్న ఆత్మావబోధస్య హి అద్వేష్టృత్వాదయో గుణాః ।**
**అయత్నతో భవన్త్యేవ న తు సాధన రూపిణః ॥**

ఆత్మజ్ఞానము కలిగిన మహాత్మునిలో అద్వేష్టృత్వాది లక్షణాలు ప్రయత్నము లేకుండానే శోభిస్తూ ఉన్నాయి. అవి సాధన రూపాలు కావు అన్నది వార్తికము.

అక్షర రూపమైన అవ్యక్తోపాసనను సాగించే జ్ఞానులు భగవంతునికి మిక్కిలి ప్రీతి పాత్రులు. అర్జునా! ఆత్మవిదుడైన భక్తునికి నేను మిక్కిలి ప్రియమైన వాణ్ణి. అతడు కూడా నాకు అత్యంత ప్రియుడు ***(ప్రియోహి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః - 7 - 17).***

అలాగే సగుణారాధకులైన విశ్వరూపోపాసకులు, జ్ఞానశుద్ధి ద్వారా పరమేశ్వరునే పొందుతూ ఉన్నారు కనుక, అట్టి అనన్య భక్తులు కూడా భగవంతునికి మిక్కిలి ప్రియులు **(మద్భక్తః మే ప్రియః : అ. 12 - శ్లో. 14,** *15, 16, 17, 19).*

అనన్య భక్తుడికి, జ్ఞానీ భక్తుడికి - ఇద్దరికీ పరమేశ్వరుడే పరమగతి కనుక ఇద్దరూ భగవంతునికి అత్యంత ప్రీతిపాత్రులే ***(భక్తాః తే అతీవ మే ప్రియాః).***

ధర్మామృతం దివ్యంగా కురిసింది. బుద్ధి పాత్రలలో నింపుకున్నాం. ఇక జుర్రడమే మిగిలి ఉంది. ధర్మామృతాన్ని పానం చేసేవాడు భగవంతునికి ఇష్టు డవుతాడు. భగవంతునికి ఇష్టుడైన వానికి మోక్షం ప్రాప్తిస్తుంది. పరమేశ్వరునికి అత్యంత ప్రీతిపాత్రుడైన వానికే మోక్షం లభించకుంటే ఇంకెవరికి లభిస్తుంది?

***తస్మాత్ ఇదం ధర్మామృతం ముముక్షుణా యత్నతః అనుష్ఠేయం విష్ణోః ప్రియం పరంధామ జిగమిషుణా ఇతి***

**వాక్యార్థః -** కనుక, ప్రియాతి ప్రియమైన విష్ణుపదమును పొందాలని అభిలషించే ముముక్షువు, ధర్మామృత మైన పరమ భక్తిని అవశ్యము ప్రయత్న పూర్వకంగా అనుష్ఠించాలి అని వాక్యార్థం. ఆచార్యుల వారి ఈ భాష్య వాక్య సందేశముతో భక్తిని విషయముగా కలిగిన భక్తి యోగమును సమాప్తం చేస్తూ ఉన్నాను. ఇంతటితో **తత్** పదార్థ స్వరూపమైన మధ్యమ షట్కము సమాప్త మైంది.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే భక్తియోగో నామ ద్వాదశోఽధ్యాయః

**ఈ విధంగా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రము, శ్రీకృష్ణార్జున సంవాదము అయిన భగవద్గీత యందు భక్తియోగ మనే పన్నెండవ అధ్యాయము.**





# చైతన్య భగవద్గీత

## అథ త్రయోదశోఽధ్యాయః - పదమూడవ అధ్యాయము

## క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగః - క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము

**జ్ఞానోదయం**

**అవిద్యాఽస్తమయో మోక్షః -** అవిద్య అంతరించడమే మోక్షము. అవిద్య అంటే అజ్ఞానము. అజ్ఞానము అంతరించాలంటే జ్ఞానం కావాలి; జ్ఞానం రావాలి. వెలుగు వస్తేనే చీకటి పోతుంది. జ్ఞానం వస్తేనే అజ్ఞానం పోతుంది.

ఇంతకీ ఏమిటి ఈ అజ్ఞానము? అజ్ఞానం అనర్థదాయక మైన సంసారానికి మూలం. దుఃఖమయమైన సంసారానికి అజ్ఞానమే కారణము. కనుక అజ్ఞానమే బంధము. అజ్ఞాన నాశమే మోక్షము.

బాగుంది. అజ్ఞానము అంటే ఏమిటి? అనేది ప్రశ్న. అంతేగాని, అజ్ఞాన ప్రభావ ఫలితా లేమిటి? అనేది కాదు. దుఃఖ కారణమైన సంసారానికి హేతుభూత మైన అజ్ఞానము ఏమిటి? అనేది ఇక్కడ సూటి ప్రశ్న. దీనికి సమాధానం ఉందా, లేదా?

నా దగ్గరైతే లేదు. లేనపుడు శాస్త్రాన్ని, అందులోను సర్వశాస్త్ర సారము, మోక్ష ప్రయోజనం గల గీతా శాస్త్రాన్ని వ్యాఖ్యానించడ మెందుకు? అని మీరు ప్రశ్నించ వచ్చు. గీతా శాస్త్రాన్ని వ్యాఖ్యానించడానికి గీతకు సంబంధించిన జ్ఞానము ఉండాలి గాని, అజ్ఞానానికి సంబంధించిన జ్ఞానం కాదు. గీత చెప్పే విషయాన్ని విపులీకరించి, విస్పష్టం చేయడానికే వ్యాఖ్యానము. అంతే గాని, గీత చెప్పని దానిని చెప్పేందుకు కాదు.

గీతకు అజ్ఞానం తెలియదు. గీతలో అజ్ఞానం లేదు. గీతలో లేనిది గీతా వ్యాఖ్యానంలో ఎలా ఉంటుంది? అందుకే అంటున్నాను అజ్ఞానం అంటే ఏమిటి అనే ప్రశ్నకు నా వద్ద సమాధానం లేదని.

మరి, అజ్ఞానము లేనిదే అయితే, అజ్ఞాన నాశమే మోక్షము అనే వాక్యానికి అర్థ మేమిటి? లేనిది ఎలా నశిస్తుంది? అని మీరు తిరిగి ప్రశ్నించ వచ్చు. అజ్ఞానము లేదని ఎవ రన్నారు? అజ్ఞానము నా దగ్గర లేదు అన్నాను. గీతలో లేదు అంటున్నాను. అంతేగాని, అజ్ఞానము అనేది అసలు లేనే లేదని నేను చెప్పలేదే? మరి, అజ్ఞానము అంటే తెలిసే దెలా అంటారా? ఏమో! అది ఎవరి దగ్గరుందో వాళ్ళనే ప్రశ్నించాలి. సమాధానం వారి నుండే రాబట్టాలి.

***సా అవిద్యా కస్య ఇతి?*** ఈ అజ్ఞానం ఎవరికి సంబంధించింది? ఎవరి వద్ద ఉంది? అనే ప్రశ్నను శ్రీశంకరాచార్య స్వామి తమ భాష్యంలో ప్రస్తుత అధ్యాయం లోనే లేవ నెత్తి, **యస్య దృశ్యతే తస్యైవ -** ఎవడైతే అజ్ఞానాన్ని చూస్తున్నాడో, అజ్ఞానం అంటే ఏమిటి అని ఎవడైతే ప్రశ్నిస్తున్నాడో, వాడి దగ్గరే ఉంది అని సమాధానం కూడా అందించారు.

అజ్ఞానం అనేది ప్రమాణ విషయం కాదు. అజ్ఞానాన్ని ఎవరూ చూడ లేదు. ప్రత్యక్షాది ప్రమాణాలకు అది అందే విషయం కాదు. అందుచేత, అజ్ఞానానికి శాస్త్ర తాత్పర్యం లేదు. తెలియని దానిని తెలిపేందుకే శాస్త్రము ఉంది. అలా శాస్త్రము తెలిపే విషయం ప్రయోజనాన్ని చేకూర్చేది కూడా అయి ఉండాలి. ఇక్కడే, ఈ కారణం చేతనే శాస్త్రము ప్రమాణ మైంది.